ప్రథమ ముద్రణ : 1999, ప్రమాథినామ ఉగాది

ప్రతులు : 1000



వెల : రూ. 50 /-

ప్రతులకు : శ్రీమతి ఎ.జి. ప్రసూన M.A.,B.Ed., స్థితప్రజ్ఞ
4-6-58, రిజర్వాయర్ కాలని, తిరుపతి.

గ్రాఫిక్ వర్క్ : వాసవి గ్రాఫిక్స్
215, ప్రకాశం రోడ్డు, తిరుపతి.

ముద్రణ : స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
బాలాజీ కాలని, తిరుపతి.

# కృతజ్ఞతలు

తిరుమల - తిరుపతి దేవస్థానమువారు రచయితల కొసగు ఆర్థిక పథకము ప్రకారము ఈ గ్రంథమునకు సహాయము నందించిరి.

టి.టి.డి. కార్యనిర్వహణాధికార్లు శ్రీ ఎం.కె.ఆర్. వినాయక్, ఐ.ఎ.ఎస్. గారికీ, శ్రీ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఎ.ఎస్. గారికీ, సప్తగిరి సంపాదకులు "జ్ఞానరత్న" బిరుదాంకితులు డా॥ ఎస్.ఎస్. రామమూర్తి గారికీ కృతజ్ఞతాంజలులు.

అర్థించిన వెంటనే తమ అమూల్య అభిప్రాయములను అందజేసిన - శ్రీమలయాళ సద్గురు యతీంద్రుల శిష్యులు, తిరుమల - తిరుపతి దేవస్థాన దర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికీ, కవి, రచయిత, వక్త అయిన శ్రీ అన్నవరం ఆదిశేషయ్య, రిటైర్డ్ ఆడిటర్, Local funds గారికీ, శ్రేయోభిలాషులూ, ఆప్త బంధువులూ అపూర్వ సహోదరులూ అయిన శ్రీ పులిజాల రామమూర్తి, శ్రీ మద్దాలి కృష్ణ మూర్తి గార్లకూ, ఈ గ్రంథమునకు "కలివర్తన దర్పణ"మని నామకరణము చేసి, దానిపై తన అమూల్య అభిప్రాయమును వ్రాసి యిచ్చిన నా మిత్రులు శ్రీ నైనారు అప్పాసామి గారికీ, ఈ గ్రంథ వ్రాత ప్రతిని వ్రాసిపెట్టిన వక్త, గాయకురాలు, శ్రీ విద్యోపాసకురాలు అయిన శ్రీమతి ఎ.ఎస్. జ్ఞాన ప్రసూనాంబకూ, ఈ గ్రంథమును ఆసక్తితో, శ్రద్ధతో గ్రాఫిక్స్ తయారుచేసిన చి॥ మునిబాలకుమార్ (వాసవి గ్రాఫిక్స్‌కూ) ఎంతో ఓర్పుతో, నేర్పుతో, స్వకార్యముగా భావించి ఈ గ్రంథాన్ని, కలికావతారునీ, ఎంతో సుందరంగా ముద్రించిన స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ ప్రొప్రయిటర్ శ్రీ సి.ఎస్. సుధాకర్, బి.టెక్ గారికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు. వీరికి "కలియుగ ప్రత్యక్ష దైవము శ్రీవేంకటేశ్వరుడు" ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చు గాక!

బుధజన విధేయుడు

**పవని వేణుగోపాల్**

# కలివర్తన దర్పణము

## విషయ సూచిక

# శ్రీ నీలకంఠ దీక్షితులు

శ్రీ నీలకంఠ దీక్షితులు క్రీ.శ. 1613లో దక్షిణార్కాటు జిల్లాలోని ఆరణి సమీపంలోని ఆదయపాళెంలో నారాయణ దీక్షితులకు జన్మించాడు. నారాయణ దీక్షితుల తండ్రి అచ్చన్న దీక్షితులు. అచ్చన్న దీక్షితులున్నూ జగద్విఖ్యాతి గాంచిన అప్పయ్య దీక్షితులవారున్నూ సోదరులు. నీలకంఠ దీక్షితులు తన చిన్నతనంలోనే పెద్ద తాతగారి ఆశీస్సులు పొందాడు. సర్వశాస్త్రములనూ అభ్యసించాడు. రాజనీతిలోనూ ప్రావీణ్యం సంపాదించినాడు. మధురను పాలించిన పాండ్యనాయక రాజులవద్ద ఎన్నో ఉన్నత పదవులందుకొనినాడు. తిరుమల నాయకునికి ప్రధాన మంత్రి అయెను. ఆ ప్రభువుల పద్ధతుల ఎడ విసుగుచెంది, ఆయన తామ్రపర్ణి వద్దనున్న పట్టామడి (తిరునల్వేలి జిల్లా) అనే ఒక కుగ్రామంలో చేరి తన శేష జీవితాన్ని అక్కడే గడిపెను. ఆయన వ్రాసిన మహా కావ్యములలో ''నీలకంఠ విజయము'', ''శివలీలార్ణవము''లు చాలా ప్రఖ్యాతి గాంచినవి. ఆయన చాలా లఘు గ్రంథములు వ్రాసెను. కలి విడంబన శతకము, వైరాగ్య శతకము, అన్యాపదేశ శతకము, ఆనంద సాగరస్తవము, సభారంజన శతకములు ముఖ్యమైనవి.

కాళిదాసు, భారవి, దండి వంటి మహాకవుల కావ్యాలలోని, పద లాలిత్యము, అలంకారములు, అర్థ గౌరవములనేగాక ''వక్రోక్తి''ని చెప్పడంలో అందెవేసిన చేయి.

నీలకంఠ దీక్షితులకు దాదాపు సమకాలీనులైన వేమన, బసవేశ్వరుడు, పోతులూరి వీరబ్రహ్మం, అన్నమయ్య లాంటి కాల జ్ఞానులు, తత్త్వవేత్తలు, త్యాగ పురుషులు, సంఘ సంస్కర్తలు, మహా భక్తులవలె నీలకంఠ దీక్షితులు కూడా, సమాజంలోని మూఢాచారాలను దురాచారాలను తీవ్రంగా తన వక్రోక్తితో ఖండించాడు.

రాజులను, క్రొత్త మహారాజులను (నడమంత్రపు సిరిగలవారిని), సన్న్యాసులను, పండితులను, జ్యోతిష్కులను, వైద్యులను ముఖ్యంగా కవులను, లోభులను, తీవ్రంగా విమర్శించినాడు. అంతటి ఆవేశంతోనే జగద్భ్రాంతిని, ఐహిక భోగాలను విమర్శించాడు. వైరాగ్యం అంటే ఏమిటి, ఎందుకు అనే పరమహితాన్ని ఉపదేశించారు.

నీలకంఠ దీక్షితులు ఆనాటి సామాజిక పరిస్థితులను బాగా అవగాహన చేసుకొనిన సంస్కర్త. గొప్ప దార్శనికుడు, తత్త్వవేత్త. పైగా ఆర్థిక విధానంలోని దోపిడీని గుర్తించినవాడు. ధనము యొక్క అవసరాన్నీ, అది తెచ్చిపెట్టే సమస్యలను వివరించాడు. భక్తి తప్పక ఉండవలసిందే, కానీ భక్తి పేరుతో వంచన ఉండరాదు. అన్నింటిలోని మంచి చెడుగులను తన పాండిత్యంతో, కవిత్వంతో, వక్రోక్తితో, తర్కంతో చెప్పిన మహామనీషి.

ఉపమాకాళిదాసస్య భారవేరర్థ గౌరవం/దండినః పదలాలిత్యం మాఘేసన్తి త్రయోగుణాః/భూమ్నాభవంతి యత్రైతే గుణాః సర్వే తథాపరే నీలకంఠస్య వక్రోక్తిః సాముద్రేందు కళానిభా.

# కలి వర్తన దర్పణము

''కలియుగంలోని మానవులందరూ సోమరిపోతులు - మందబుద్ధులు మంద భాగ్యులు - అల్పాయుష్కులు - భయంకర వ్యాధిగ్రస్తులు - వారు సత్కార్యాలను చేయరు. వారికి శాంతి మార్గాన్ని అనుగ్రహించు'' అని భాగవత పురాణావిర్భావానికి కారకులైన మునీంద్రులు సూత మహర్షిని వేడుకొంటారు.

అధ్యాత్మ రామాయణ మాహాత్మ్యాన్ని వివరించుతూ సూతుడు - ''భయంకరమగు కలియుగమందు నరులు పుణ్యకార్యములు చేయరు. అసత్యాలను చెప్పెదరు - పరదూషణ చేస్తుంటారు. పరుల ధనమందాసక్తి గలవారై యుంటారు. దేహమే ఆత్మ అనే నమ్మకం కలిగియుంటారు. ఆ మూఢులు తామసాసక్తులై తల్లి దండ్రులను ద్వేషిస్తారు. వర్ణాశ్రమ ధర్మములను పాటించరు. స్త్రీలు తమ భర్తలను గౌరవించరు. అటువంటి వీరికి పరమ సౌఖ్యమెట్లు కలుగును? దాదాపు అన్ని పురాణాలూ, కలికాలంలోని సమాజాన్ని గూర్చి ఆందోళన చెందినవి. వారికి మోక్షోపాయాల్ని కూడా అందులోనే తెలిపినవి.''

- కృత, త్రేత, ద్వాపర యుగాలకంటే ఒకరకంగా కలియుగమే మేలు - మొదటి మూడు యుగములలో బ్రహ్మజ్ఞానము, యోగము, వైరాగ్యముతో కూడిన తపస్సు మోక్షసాధనములు. ''కలౌతు కేవలా భక్తిర్బ్రహ్మసాయుజ్య కారిణీ'' - ''హరేర్నామైకమ ప్యత్ర కలౌ వదతి యోనరః కలిర్నబాధతే తంచ సత్యం సత్యం న సంశయః'' హరినామస్మరణ వల్ల కలియుగంలో వారికి కలి దోషము బాధించదు. ఇది సత్యము - ఇది సత్యము - దీని యందు దోషము లేదు. ఒకవైపు ఆటవిక సమాజము - మరోవైపు ఋషి ధర్మసమాజము రెండూ అన్ని యుగాలలో యున్నవి.

ఆ యుగాలలో హిరణ్యాక్ష హిరణ్య కశిపులు, రావణ కుంభ కర్ణాదులు, శిశుపాల దంత వక్త్రులు మున్నగు మహాక్రూరులుంటే ఈ కలియుగంలో ఆ రాక్షసులకంటే మించిన సీజర్లు, చెంఘిస్కానులు, హిట్లర్లు, స్టాలిన్లు వంటి కర్కోటకులున్నారు.

ఆనాటి రాక్షసులనెదుర్కొనిన అవతార పురుషులవలె, ఈ యుగంలో కూడా ఎందరో యుగపురుషులుగా ప్రఖ్యాతిగాంచినవారూ యున్నారు. విభీషణుడు, ప్రహ్లాదుడు, కుచేలుడు, అక్రూరుడు, వసుదేవుడు మున్నగువారు ఆ యుగాలలో వుంటే కలి యుగంలో, సోక్రటీసు, ఏసుక్రీస్తు, బుద్ధ భగవానుడు, శంకర, రామానుజ, మధ్వ వంటి ఆచార్యులు, అళ్వారులు, పండరి భక్తులు, నైనార్లు మున్నగు మానవోత్తములు కలరు.

ఎక్కడ అధర్మం వుంటుందో దానిని పడగొట్టడానికి ధర్మం కూడా ఉంటుంది. భగవద్గీతలో దైవాసుర సంపదల గూర్చి చక్కగా వివరింపబడినది. అరాచకము, అశాంతి, అవినీతి, అసుర స్వభావాలు స్వైర విహారం చేసినపుడల్లా, మతాచార్యులు, సంఘ సంస్కర్తలు, త్యాగపురుషులు వాటిని ఎదుర్కొని, సుఖశాంతులను నెలకొల్పినారు.

ఇదొక చక్రం లాంటిది. ధర్మాధర్మాలు పైకి క్రిందికీ వస్తున్నట్లుంటాయి. ఎప్పటికప్పుడు క్రొత్త నిరంకుశులు, క్రొత్త ప్రవక్తలూ జన్మిస్తూనే యుంటారు.

పదిహేడవ శతాబ్దము నందు ఒక వైపు ముస్లిముల దురాగతాలు, హిందూ రాజుల అనైక్యత, నీతిబాహ్య పరిపాలన, మరొక ప్రక్క చాప క్రింద నీళ్లలాగా ఫ్రెంచి, జర్మనీ, ఆంగ్ల వ్యాపారుల దురాక్రమణలు జరుగుతున్న కాలం.

దేశమంతటా ఒకేసారి ఒకే రీతిగా అనుకోకుండా ప్రజలలో ఒక మహోద్యమం జరిగింది. పోతులూరి వీరబ్రహ్మంగార్ఖు, వేమన, కర్నాటకలో సర్వజ్ఞుడు, కొద్ది కాలం తేడాతో అన్నమయ్య రామదాసు వంటి మహాత్ములు ఆ ఉద్యమానికి సైద్ధాంతిక స్ఫూర్తి దాతలు. వీరిలో ముఖ్యులు శ్రీ నీలకంఠ దీక్షితులు – వీరు తమ త్యాగంతో, వైరాగ్య జీవితంతో, ప్రజ్ఞాపాటవంతో, పాండిత్యంతో, కవిత్వంతో ఆనాటి సామాజిక రుగ్మతలను ఎత్తి చూపి, వాటికి చికిత్సా విధానాలను చూపించిన మహామనీషి – అవి ఈ నాటి సమాజాన్ని అద్దంలో పట్టి చూపినట్లుంటుంది.

నీలకంఠ దీక్షితులవారు అద్వైతి, శివభక్తుడు, పైగా సంస్కర్త. ఆయన తన వక్రోక్తితో చక్కటి బోధ చేశారు.

వారి గ్రంథములను ఫ్రెంచివారు, ఆంగ్లేయులు సేకరించి అచ్చు వేయించారు. భారతీయ భాషలన్నియునూ, వారి గ్రంథములను శ్లాఘించుచూ వ్యాఖ్యలు వ్రాసినాయి. ప్రస్తుతము తెలుగులో ఇవి లభ్యమగుటలేదు.

నేను శ్రీ దీక్షితులవారి కలివిడంబన శతకాన్ని, వైరాగ్యశతకాన్ని, సంస్కృత లిపిలో యుండు వాటిని సేకరించి, సంస్కృత పండితులనాశ్రయించిన వారి వద్ద అర్థ తాత్పర్యములను చెప్పించుకొని, వాటితోపాటు, చాటువులను, ధర్మమునకు సంబంధించిన శ్లోకములను చేర్చి ఈ గ్రంథమును కూర్చుడమైనది.

దీనికి శ్రీ నైనారు అప్పా స్వామిగారు కలివర్తన దర్పణమని నామకరణం చేశారు.

ఈ గ్రంథమును ప్రచురించుటకు తోడ్పడిన మాన్యులు

శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడిగారి నీలకంఠ దీక్షితుల లఘు కృతులు, శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యంగారి వ్రాత ప్రతులు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, సి. హెచ్. సత్యనారాయణగారు, డి. సత్యనారాయణగారు, సంస్కృత విద్యాపీఠ, ''ఆచార్య'' తరగతి విద్యార్థులు మున్నగువారు – వీరికి నా నమస్కారములు.

ఈ గ్రంథమునకు వ్రాత ప్రతిని తయారు చేయుటలోనూ, ముద్రించుటలోనూ సాయపడిన చిరంజీవి ఎ.జి. ప్రసూనకు ఆశీస్సులు.

బుధ జన విధేయుడు

పవని వేణుగోపాల్

# శ్రీ నీలకంఠ దీక్షిత విరచిత కలివిడమ్బనమ్

**నభేతవ్యం నబోద్ధవ్యం నశ్రావ్యం వాది నోవచః**
**ఝటితి ప్రతివక్తవ్యం సభాసు విజిగీషుభిః ॥ (1)**

విజిగీషుభిః = జయించదలచిన వారిచేత (వారు); సభాసు = సభలలో; నభేతవ్యం = భయపడకూడదు; నబోద్ధవ్యం = తెలుసుకోకూడదు; వాదినః = ప్రతివాది యొక్క; వచః = వాక్కు; నశ్రావ్యం = వినబడదగదు; ఝటితి = వెంటనే; ప్రతివక్తవ్యం = సమాధానము చెప్పవలెను.

సభలలో జయం పొందాలంటే నదురూ బెదురూ వుండకూడదు. ఏంవాదించాలనే నిర్బంధం లేదు. ఎదుటి మనిషి వాదించేదేమిటో వినాల్సిన అవసరం అసలే లేదు. అయితే మరేం కావాలి? తడుముకోకుండా వెంటనే ఏదో ఒకటి చెప్పడం.

**అసంభ్రమో విలజ్జత్వ మవజ్ఞా ప్రతివాదిని**
**హాసోరాజ్ఞః స్తవశ్చేతి పఞ్చైతే జయహేతవః (2)**

అసంభ్రమః = తత్తరపాటు లేకుండుట; విలజ్జత్వం = సిగ్గుపడకుండుట; ప్రతివాదిని = ప్రతివాది విషయంలో; అవజ్ఞా = లెక్క చేయకుండుట; హాసః = నవ్వడము; రాజ్ఞఃస్తవశ్చ = రాజును స్తోత్రము చేయడం; ఇతి = ఈ విధముగా; ఏతే = ఈ; పఞ్చ = ఐదున్ను; జయహేతవః = జయానికి కారణములు.

రాజు అధ్యక్షత వహించిన సభలలో ఏ మాత్రము తత్తరపాటు లేకుండుట; సిగ్గుపడకుండుట; ఎదుటి వ్యక్తిని లెక్క చేయకపోవుట; చిరునవ్వులొలికిస్తూండుట; సభాపతిని స్తుతించుట – ఈ ఐదున్నూ జయానికి రాజబాటలు.

**ఉచ్చైరుద్ఘోష్య జేతవ్యం మధ్యస్థశ్చే దపండితః**
**పండితోయది తత్రైవ పక్షపాతోఽ ధిరోప్యతామ్॥ (3)**

మధ్యస్థః = మధ్యవర్తి; అపండితః చేత్ = పండితుడు కాకపోతే; ఉచ్చైః గట్టిగా; ఉద్ఘోష్య= గోలచేసి; జేతవ్యం = జయించవలెను; పండితోయది = పండితుడైతే; తత్రైవ=వాని యందే; పక్షపాతః= పక్షపాతము; అధిరోప్యతాం = ఆరోపింపబడవలెను.

పూర్వకాలంలో పండితులు శాస్త్ర విషయముల మీద చర్చలు జరిపేవారు. వాదోప వాదములు జరుగుచుండెడివి. ఆ సభకు ఒక మధ్యస్థుని నియమించుకొనేవారు. అతడు పండితుడుగాక, మిడి మిడి జ్ఞానం కలవాడైతే, నీవు నోరుపెట్టుకొని గట్టిగా బల్లగుద్ది వాదించి జయించు. ఒకవేళ అతడు పండితుడే అయితే, అతనికి నీ ప్రత్యర్థి అంటే పక్షపాతమని ప్రచారము చేయి. నిందకు భయపడి నీవైపే మొగ్గుతాడు.

**లాభోహేతుః ధనంసాధ్యం దృష్టాన్త స్తుపురోహితః**
**ఆత్మోత్కర్షో నిగమనం, అనుమానేష్వయం విధిః ॥ (4)**

లాభః=లాభము; హేతుః=హేతువు; ధనం=ధనము; సాధ్యం = సాధ్యము; పురోహితః తు=పురోహితుడైతే; దృష్టాన్తః=దృష్టాన్తము; ఆత్మోత్కర్షః=తన గొప్పతనము; నిగమనం=నిగమనము; అనుమానేషు=అనుమానాలతో; అయం=ఇదే; విధిః =పద్ధతి.

ప్రమాణాలలో అనుమాన ప్రమాణం ఒకటి. దూరంగా ఎక్కడో అగ్ని మనకు కనిపించకపోయినా అక్కడ కనబడే పొగనుబట్టి అగ్ని వున్నదని నిర్ధారణ చేసుకొంటాము. ''అనుమాన '' ప్రయోగం ఇలా వుంటుంది; పర్వతోవహ్నిమాన్= పర్వతం మీద అగ్ని ఉన్నది.

ధూమతే = పొగవున్నది గనుక; యధామహానసః = (వంట ఇంట్లోవలె) = ఇక్కడ ధూమం హేతువు; ఈ హేతువునుబట్టి అగ్ని వున్నదని సాధిస్తున్నాము. కనుక అగ్ని సాధ్యము. వంట యిల్లు దృష్టాంతము. ఈవిధంగా పర్వతం మీద అగ్ని వున్నదని ధూమం వలన తెలుసుకొన్నవాడు, ఆ విషయాన్ని తెలుపుటకై ఐదు అవయవాలున్న వాక్యాన్ని ప్రయోగిస్తాడు. దానికి ''పంచావయవ వాక్యం'' అని పేరు. వాటికి 1. ప్రతిజ్ఞ, 2. హేతువు, 3. దృష్టాంతము, 4. ఉపనయము, 5. నిగమనము అని పేర్లు. పర్వతో అగ్నిమాన్ = పర్వతం మీద అగ్ని వున్నది. ఇది ప్రతిజ్ఞ.

ధూమవత్వాత్ = దాని మీద పొగవుంది కాబట్టి ఇది హేతువు; యోయోధూమవాన్ ససోऽగ్నిమాన్ యధామహానసః = ఏదేదేది ధూమంకలదో అది అగ్ని కలది (వంట ఇల్లువలె). ఇది దృష్టాంతము; ''తథాచాయం = ఈ పర్వతం కూడా ఆ వంట ఇల్లువలెనే అగ్ని కలది. ఇది ఉపనయము తస్మాత్తథా = అందుచేత ఇది కూడా దాని వలెనే అగ్ని కలది. ఇది నిగమనం. ఇదంతయూ న్యాయ శాస్త్రాదులలో మంచి ప్రావీణ్యం కావాలని బాధపడేవాళ్లకేగానీ, ఎవరినో ఒకరిని ఆశ్రయించి, ఏదో విధంగా డబ్బు సంపాదించుకొని గొప్పగా వుండాలనుకొనే వాళ్లకు ఈ బాధలేనే లేదు. కానీ వాళ్లు కూడా పండితులుగా చెలామణి అయిపోతున్నారు.''

హేతువు=(వీళ్లు ఏ పని చేయడానికైనా కారణం) లాభం; సాధ్యం=(సాధించవలసినది) ధనం; దీని ఉదాహరణ పురోహితుడు (ఈ కాలంలో పురోహహితులే కాదు, పూజారి, కేంద్ర మంత్రి, డాక్టరు, ఇంజనీరు, పోలీసు – నూటికి 99 మంది ఈ కోవకు చెందినవారే). ఇదంతా చేసి చివరకు సంపాదించవలసినది (నిగమనం) తన గొప్పతనం, వీళ్ల అనుమాన ప్రయోగాలు ఇలానే ఉంటాయి. ఏదో ఒక లాభం లేని ఏ పనినీ పురోహితుడు ముట్టడు. ఒకవేళ ముట్టినాడంటే రెండు చేతులా సంపాదించే పనినే ప్రారంభిస్తాడు. లోకం ఎట్లా పోయినా వానికి విచారం లేదు. అతని ధ్యేయమంతా తను సిరిసంపదలను చేకూర్చుకొనడమే.

**అభ్యాస్యం లజ్జమానేన తత్త్వం జిజ్ఞాసు నాచిరమ్**
**జిగీషుణా హ్రియం త్యక్త్వా కార్యః కోలాహలోమహాన్ ॥ (5)**

(పాఠాం)

1. అలభ్యం లిప్స్యమానేన; 2. కార్యం కోలాహల మహాన్ తత్త్వం జిజ్ఞాసునా = తత్త్వం తెలుసు కోవాలనే కోరిక కలవాడు; లజ్జమానేన = సిగ్గుతో (అణకువతో వుండి); చిరం = చిరకాలము; అభ్యాస్యం = అభ్యాసము చేయవలెను. (భావార్థక యత్ప్రత్యయము) - కర్మార్థకమనే పక్షంలో జిజ్ఞాసువుచేత శాస్త్రాదికము అభ్యసించ తగినదని చెప్పుకోవలెను)

జిగీషుణా=ఏదోవిధంగా ఎదుటివానిని జయించాలనే ఆశగలవాని చేత; హ్రియం= సిగ్గును; త్యక్త్వా=విడిచి; మహాన్=గొప్ప; కోలాహలః=గందరగోళము; కార్యః=చేయతగినది

1. శాస్త్రంలోని తత్త్వాన్ని తెలుసుకోవలెనని అనుకొనేవాడు, అణకువతో చాలాకాలంపాటు అభ్యాసం చెయ్యాలి. అహంకారం పనికిరాదు. ఏదోవిధంగా ప్రతివాడినీ ఓడించాలని అనుకొనేవాడు పెద్దగా ఆర్భాటం చెయ్యాలి. 2. పొందరాని వస్తువును పొంద దలచినవాడూ, సత్యాన్ని అన్వేషించే వాడూ, జయించాలని ఉవ్విళ్ళూరేవాడూ, సిగ్గువిడిచి పెద్దగా గందరగోళం చేయాలి. ఈ కాలంలో టి.వి.లు, పత్రికలు, అభిమాన సంఘాలు ఎన్నో వున్నవి. ప్రచారానికి ఎన్నో ఉపాయాలున్నాయి. వాళ్లకే గుర్తింపు. ఎందరెందరో మహా పండితులు పరిశోధకులు ఏ గుర్తింపు కోరకుండా, తమ లక్ష్య సాధన కోసం మహాత్యాగాలను చేస్తున్నారు.

**పాఠనైర్గ్రంథ నిర్మాణైః ప్రతిష్ఠాతావదాప్యతే**
**ఏవంచ తథ్యవ్యుత్పత్తి రాయుషోఽన్తే భవేన్నవా ॥ (6)**

పాఠనైః = చదివించడం చేతను; గ్రంథ నిర్మాణైః = గ్రంథ రచనలచేతను, ప్రతిష్ఠా = గౌరవము; అప్యతే తావత్ = పొందబడవచ్చును; ఏవంచ = ఇంత చేసినా; తథ్యవ్యుత్పత్తిః = నిజమైన శాస్త్రజ్ఞానము; ఆయుషః అన్తే = జీవితాంతానికైనా; భవేత్ = కలుగునో, నవా = కలగదో.

పుస్తకాలను చదవడం వల్లా (లేక) శిష్యులకు బోధించడం వల్లా, కావ్యాలను వ్రాయడం వల్లా ప్రతిష్ఠ కలుగవచ్చు. కానీ నిజమైన శాస్త్ర జ్ఞానము పొందినాడనుటకు వీలులేదు. అది ఆయుస్సు తీరేలోగా లభిస్తుందో లేదో సందేహమే.

**స్తోతారఃకే భవిష్యన్తి మూర్ఖస్య జగతీతలే**
**నస్తౌతి చే త్స్వయంచ స్వం కదా తస్యాస్తు నిర్వృతిః ॥ (7)**

జగతీతలే = ఈ లోకంలో; మూర్ఖస్య = మూర్ఖుని (కి); స్తోతారః = స్తోత్రం చేసేవారు; కేభవిష్యన్తి = ఎవరుంటారు ?; స్వయంచ = స్వయంగానే; స్వం = తనను; నస్తౌతిచేత్ = స్తుతించక పోయినట్లైతే; తస్య = వానికి; నిర్వృతిః = ఆనందము; కదా = ఎపుడు; అస్తు = కలుగవలెను?

ఈ భూమండలంలో మూర్ఖుణ్ణి పొగడేవాడెవడుంటాడు ? అందుచేత కనీసం తనను తానైనా పొగడుకోకపోతే వానికి సంతోషం లభించేమార్గమేది ? - ఎవణ్ణైనా కదిలించండి. వాడు తన గొప్పతనాన్ని రాసులకొద్దీ త్రవ్వి మన నెత్తిన పోస్తాడు. ఎంతసేపైనా ఆత్మస్తుతి.

**వాచ్యతాం సమయోஉతీతః స్పష్టమగ్రే భవిష్యతి**
**ఇతిపాఠయతాం గ్రన్థేకాఠిన్యం కుత్రవర్తతే ॥ (8)**

వాచ్యతాం = చదువుకో; సమయః అతీతః = కాలమయిపోతూంది; అగ్రే = ముందు ముందు; స్పష్టం భవిష్యతి = స్పష్టమవుతుంది; ఇతి = ఈ పద్ధతిలో; పాఠయతాం = పాఠం చెప్పేవారికి; కుత్ర = ఏ; శాస్త్రే = శాస్త్రమునందు; కాఠిన్యం = కష్టము; వర్తతే = ఉండును.

గురువుగారు చెప్పేది శిష్యుడికి బోధపడటంలేదు. సందేహాలు తెలుపుకొంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు. అపుడు గురువుగారు "తరువాత వాక్యం చదువు. ఇప్పటికే సమయ మయిపోతుంది. ముందు ముందు నీకే చక్కగా తెలుస్తుంది" అని చెప్పే గురువుగారికి, ఏ శాస్త్రమైతేనేం కష్టమే లేదు.

విశ్వవిద్యాలయాలలోనూ, ఉన్నత పాఠశాలల్లోనూ అంతా ఇదే తంతు. ముఖ్యంగా కళాశాలల్లో ఇటువంటి అధ్యాపకులు ఎక్కువగా వున్నారు.

**అగతిత్వమతి శ్రద్ధా జ్ఞానా భాసేన నిర్వృతిః**
**త్రయః శిష్యగుణాహ్యేతే మూర్ఖా చార్యస్య భాగ్యజాః ॥ (9)**

అగతిత్వం = వేరేగతి లేకపోవడం; అతిశ్రద్ధా = మితిమీరిన శ్రద్ధ; జ్ఞానాభాసేన = జ్ఞానంవలె కనిపించే అల్పజ్ఞానం చేత; తృప్తతా = తృప్తి చెందడము; ఏతే = ఈ; త్రయః = మూడు; శిష్యగుణాః = శిష్యులలో వుండే గుణాలు; మూర్ఖాచార్యస్య = మూర్ఖుడైన ఆచార్యుని యొక్క; భాగ్యజాః = అదృష్టం వల్ల కలిగేవి.

శిష్యుడికి మరొక గురువు దొరక్కపోవడం, గురువుపైన వల్లమాలిన శ్రద్ధ, గురువు చెప్పింది అర్థమైనా కాకపోయినా, తెలిసినట్లు నటిస్తూ సంతుష్టుడై యుండుట - ఈ మూడు గుణాలు గల శిష్యులు లభించడం నిజంగా 'బండ' గురువుగారి అదృష్టమే. ఏదో పాసుమార్కులు వస్తేచాలు- ఆ గురువుగారు కూడా ఇటువంటి శిష్యుడే అయివుంటాడు.

**యదినక్వాపి విద్యాయాం సర్వథా క్రమతే మతిః**
**మాన్త్రికాస్తు భవిష్యామో యోగినోయతయోஉపివా॥ (10)**

క్వ + అపి విద్యాయాం = ఏ విద్యలో కూడ; మతిః = బుద్ధి; సర్వథా = అన్నివిధాలా (ఏ విధంగాను కూడ); నక్రమతేయది = ప్రవేశించకపోయినట్లయితే; మాంత్రికాః = మాంత్రికులుగా కానీ; యోగినః = యోగులుగాకానీ; యతయోపివా = యతీశ్వరులుగా కానీ; భవిష్యామః = అయెదము.

చదువేమాత్రమూ అబ్బకపోతే బ్రతుకు తెరువుకు చింతింపపనిలేదు. మాంత్రికులం అవుతాం, యోగులో యతీశ్వరులో అవుతాం; పూట గడిచి పోవడమే కాదు పూజలు కూడా అందుకొంటాం.

**అవిలంబేన సంసిద్ధౌ మాన్త్రికై రాప్యతే యశః**
**విలంబే కార్యబాహుళ్యం విఖ్యాప్యావాప్యతే ధనమ్ ॥ (11)**
**(పాఠాం ॥) అవిలంభ్యే కృత్యసిద్ధౌ**

అవి లంబేన = ఆలస్యం లేకుండా; సంసిద్ధౌ = కార్యసిద్ధి అయ్యే పక్షంలో; మాంత్రికైః = మాంత్రికులచేత; యశః = కీర్తి; అప్యతే = పొందబడును; విలంబే = ఆలస్యమైన పక్షంలో; కార్య బాహుళ్యం = చేయవలసిన పనుల బాహుళ్యాన్ని; విఖ్యాప్య = చెప్పి; ధనం = ధనము; అవాప్యతే = పొందబడును.

మాంత్రికుడు చేబట్టిన పని వెంటనే సిద్ధిస్తే మాంత్రికుని పేరు మారు మ్రోగుతుంది. అలాకాక ఆలస్యం జరిగిందా, ఆ హోమం చేయాలి, ఈ జపం చేయాలి అని అంటూ రెండు చేతులా డబ్బు గుంజాకోవచ్చు.

**సుఖం సుఖిషు దుఃఖంచ జీవనం దుఃఖ శాలిషు**
**అనుగ్రహాయతే యేషాం తేధన్యాః ఖలుమాన్త్రికాః ॥ (12)**

సుఖిషు = సుఖంగాయున్నవారి విషయంలో; సుఖం = సుఖమైన; జీవనం = జీవనమూ; దుఃఖ శాలిషు = దుఃఖంతో బాధపడేవారి విషయంలో; దుఃఖంచ = దుఃఖమైన జీవనమూ, యేషాం = ఈ మాన్త్రికుల; అనుగ్రహాయతే = అనుగ్రహమూ అగుచున్నదో; తే=అట్టి; మాన్త్రికాః=మాంత్రికులు; ధన్యాఃఖలు=అదృష్టవంతులుకదా!

సుఖవంతులు సుఖమైన జీవితం సాగిస్తున్నారంటే, ఇదంతా మా అనుగ్రహమని మాంత్రికులు చెప్పుకొంటారు. దుఃఖవంతులు దుఃఖమయమైన జీవితం గడుపుతున్నారంటే అది మా ఆగ్రహానికి గురి అయ్యాడు కాబట్టే అని చెప్పుకుంటారు. ఈ విధంగా రెండు రకాలుగానూ తాము గొప్ప అని చాటుకొనే మాంత్రికులు అదృష్టవంతులు కాదా ! (లేక) హాయిగా కాలక్షేపం చేసేవారి సుఖమూ, ఏడుస్తూ జీవించేవారి దుఃఖమూ, రెండూ మాంత్రికుడికి అనుకూలమే ఆహా ! మాంత్రికులెంత ధన్యులు !

**యావదజ్ఞానతో మౌన మాచారో వా విలక్షణః**
**తావన్మాహాత్మ్య రూపేణ పర్యవస్యతి మాన్త్రికే ॥ (13)**

అజ్ఞానతః =అజ్ఞానము వలన; యావత్=ఎంత; మౌనం=మౌనం గ్రహింపబడుతుందో; విలక్షణః = లోక విలక్షణమైన; ఆచారోవా = ఆచారము కాని (ఎంత చేయబడునో); తావత్ = అది అంతయు; మాన్త్రికో = మాంత్రికునిలో; మహాత్మ్యరూపేణ = మాహాత్మ్యంగా; పర్యవస్యతి = పర్యవసించును.

మాంత్రికుడు తెలియక, ఎవరేమి అడిగినా బదులు చెప్పలేక మౌనంగా వుండిపోయినా, తెలిసి అట్టహాసం చేసినా, (లేక) లోక విలక్షణమైన ఆచారాలేవో చేసినా, అంతా ఆయన మహిమలు కలవాడనే అనుకొంటారు. ఇదంతా ఆయన మాహాత్మ్యమేనంటారు.

**చారాన్విచార్య దైవజ్ఞైర్వక్తవ్యం భూభుజాంఫలమ్**
**గ్రహచార పరిజ్ఞానం తేషామావశ్యకం యతః ॥ (14)**

చారాన్ = గూఢచారులు; విచార్య = విచారించి (సంప్రదించి తెలుసుకొని); దైవజ్ఞైః = జ్యోతిష్కుల చేత; రాజ్ఞాం = రాజుల; ఫలం = ఫలము; వక్తవ్యం = చెప్పదగినది; యతః = ఎందుకనగా; తేషాం = వారికి; గ్రహచార పరిజ్ఞానం = గ్రహచారం (గ్రహాల సంచారం) యొక్క జ్ఞానం; అవశ్యకం = అవసరము.

జ్యోతిష్కులు రాజులకు, మంత్రులకు జోస్యం చెప్పే ముందు గూఢచారులద్వారా అసలు విషయం సేకరించాలి. గ్రహచారం చాలకపోతే (గ్రహగతి తెలియకపోతే) వారి ఆగ్రహానికి గురికావలసి వుంటుంది. ఎందుచేతనంటే జ్యోతిష్కులకు గ్రహచార పరిజ్ఞానం బాగా వుండాలికదా ! లేకపోతే వారి ప్రాణానికే ముప్పు.

**పుత్ర ఇత్యేవ పితరి కన్యకే త్యేవ మాతరి**
**గర్భ ప్రశ్నేషు కథయన్ దైవజ్ఞో విజయీభవేత్ ॥ (15)**

గర్భప్రశ్నేషు = గర్భానికి సంబంధించిన ప్రశ్నలలో; పితరి = తండ్రికి; పుత్ర ఇత్యేవ = కుమారుడనీ; మాతరి = తల్లికి; కన్యకేత్యేవ = కూతురనీ; కథయన్ = చెప్పే; దైవజ్ఞః = జ్యోతిష్కుడు; విజయీభవేత్ = విజయ వంతుడగును.

గర్భవతి, నాకు పుత్రుడు కలుగుతాడా లేక పుత్రిక పుడుతుందా అని అడిగితే ఆమెకు కూతురే పుడుతుందనీ, ఆమె భర్తే వచ్చి అడిగితే కొడుకు కలుగుతాడనీ చెప్పే జ్యోతిష్కుడు విజయం పొందుతాడు. కట్నాలు బాగా వస్తాయి.

**ఆయుః ప్రశ్నే దీర్ఘమాయుర్వాచ్యం మౌహూర్తి కైర్జనైః**
**జీవన్తో బహుమన్యన్తే మృతాః ప్రక్ష్యన్తికం పునః ॥ (16)**

ఆయుః ప్రశ్నే = ఆయుర్దాయాన్ని గూర్చి ప్రశ్నించినపుడు; మౌహూర్తికైః జనైః = జ్యోతిష్కుల చేత; దీర్ఘం ఆయుః = దీర్ఘాయుర్దాయము; వాచ్యం = చెప్పదగినది; జీవన్తః = జీవించిన వారు; బహుమన్యన్తే = గౌరవిస్తారు; మృతాఃపునః =మరణించిన వారైతే; కం = ఎవనిని; ప్రక్ష్యన్తి = అడుగుదురు ?

నాకు ఆయుస్సె మాత్రమని ఎవరైనా అడిగితే జ్యోతిష్కుడు వానితో నిస్సందేహంగా నూరేళ్లు బ్రతుకుతాడని చెప్పాలి. నిజంగా నూరేళ్లు జీవించాడా బ్రతికినంత కాలమూ పొగుడుతారు. చచ్చాడా ఇంక అడిగే దెవరిని ?

**సర్వం కోటిద్వయోపేత, సర్వం కాలద్వయావధి**
**సర్వం వ్యామిశ్రమివచ వక్తవ్యం దైవ చిన్తకైః ॥ (17)**

దైవచిన్తకైః = జ్యోతిష్కులచేత; సర్వం = అన్నియు; కోటి ద్వయోపేతం = రెండు కోటులు (పక్షాలు) వుండే విధంగాను; సర్వం = ప్రతీది; కాలద్వయావధి = రెండు కాలాలు అవధి కలదిగాను; సర్వం = ప్రతీది; వ్యామిశ్రమివచ = తికమకలతో కూడినదిగాను; వక్తవ్యం = చెప్పదగినది.

జ్యోతిష్కుడు ఏది కూడా నిశ్చయంగా చెప్పకూడదు. ఇట్లా కావచ్చు, అట్లా కావచ్చు, ఇలా జరగవచ్చు లేక అలా జరగవచ్చు అన్నట్లు ప్రతీది రెండు పక్షాలుగా వుండేట్లు చెప్పాలి. రెండు కాలాలు (అప్పుడూ లేక ఇప్పుడూ) వుండేట్లు చెప్పాలి. అడిగినవాడు అయోమయంలో పడిపోవాలి. కర్ర విరగ కూడదు. పాము చావకూడదు అన్నట్లు చెప్పి తప్పించుకోవాలి.

ఉదా॥ ''ఈ నక్షత్రం మంచిది కాబట్టి పని కావచ్చు. గ్రహ దృష్టి బాగా లేదు కాబట్టి పని చెడి పోవచ్చు. ఇప్పట్లో కావచ్చు లేక కొంతకాలం పట్టవచ్చు'' అని చెప్పాలి.

**నిర్ధనానాం ధనావాప్తిం ధనినామ ధికం ధనమ్**
**బ్రువాణాః సర్వథాగ్రాహ్యాలోకై ర్జ్యోతి షికా జనాః ॥ (18)**

నిర్ధనానాం=ధనంలేని వారికి; ధనావాప్తిం=ధనప్రాప్తిని; ధనినాం=ధనవంతులకు; అధికం ధనం=ఎక్కువ ధనాన్ని; బ్రువాణాః = చెప్పే; జ్యోతిషికాజనాః= జ్యోతిష్కులు; లోకైః = జనులచే; సర్వథా = అన్ని విధాలా; గ్రాహ్యాః = గ్రహింప దగినవారు

డబ్బులేనివానికి డబ్బు వస్తుందనీ, ధనికుడైతే కోటికి పడగలెత్తుతాడనీ చెప్పే జ్యోతిష్కులను లోకులు బాగా పోషించి, గౌరవించి, ఆదరిస్తారు.

**శతస్యలాభే తాంబూలం సహస్రస్యతు భోజనమ్**
**దైవజ్ఞానా ముపాలంభో నిత్యః కార్యవిపర్యయే ॥ (19)**

శతస్యలాభే=నూరు లాభంవస్తే; దైవజ్ఞానాం=జ్యోతిష్కులకు; తాంబూలం= తాంబూలము; సహస్రస్య లాభేతు = వేయి లాభం వస్తే మాత్రం; భోజనం= భోజనమూ (దొరుకుతుంది); కార్య విపర్యయే = పని చెడిపోయినట్లైతే; ఉపాలంభః= నింద; నిత్యః = నిత్యమైనది.

జోస్యం చెప్పించుకొన్న వారికి నూరు లాభిస్తే జ్యోతిష్కుడికి ఒక తాంబూలం ఇస్తారు. వెయ్యి లాభం వస్తే ఒక పూట భోజనం పెట్టిస్తారు. జోస్యం ఎదురు తిరిగి ఫలించక పోయిందో వానికి నిత్యమూ తిట్లు తప్పవు.

**అపిసాగర పర్యంతా విచేతవ్యా వసుంధరా**
**దేశోహ్యరత్ని మాత్రోఽపి నాస్తి దైవజ్ఞ వర్జితః ॥ (20)**

వసుంధరా=భూమి; సాగరపర్యంతాఽపి=సముద్రం వరకుకూడా; అరత్నిమాత్రోఽపి = జానెడైననూ; విచేతవ్యా = వెదకదగినది; దైవజ్ఞ వర్జితః = జ్యోతిష్కులులేని; దేశ = ప్రదేశము; నాస్తి = లేదు.

సముద్రం వరకూ భూమండలాన్నంతా గాలించి చూడు. జ్యోతిష్కుడు లేని చోటు జానెడు ప్రదేశము కూడా లేదు. (పశ్చిమ, పాశ్చాత్య, అరబ్, ఆఫ్రికాదేశాలలో కూడా ఏదో ఒక విధంగా ఈ జ్యోతిష్కులు ప్రతి వీధిలో ఒకడుంటున్నాడు).

**వారాన్ కేచి ద్గ్రహాన్ కేచిత్కే చి దృక్షాణి జానతే**
**త్రితయుం యేవిజానన్తి తే వాచస్పతయః స్వయమ్ ॥ (21)**

కేచిత్ = కొందరు; వారాన్ = వారాలను; కేచిత్ = కొందరు; గ్రహాన్ = గ్రహాలను; కేచిత్ = కొందరు; ఋక్షాణి = నక్షత్రాలను; జానతే = ఎరుగుదురు; త్రితయం = ఈ మూడింటిని కూడా; యే = ఎవరు; విజానన్తి = ఎరుగుదురో; తే = వారు; స్వయం = స్వయముగా; వాచస్పతయః = బృహస్పతులే.

కొందరు వారఫలాలు చెప్పడంలో సిద్ధహస్తులు; మరి కొందరు గ్రహఫలాలను చెప్పడంలో నేర్పరులు, మరి కొందరికి నక్షత్ర ఫలం చెప్పడం సులువు. ఈ మూడూ తెలిసిన జ్యోతిష్కులు స్వయంగా బృహస్పతులే – (అనాలి గదా).

**నైమిత్తికాః స్వప్న దృశో దేవతో పాసకా ఇతి**
**నిసర్గ శత్రవః సృష్టా దైవజ్ఞ నామమీ త్రయః ॥ (22)**

నైమిత్తికాః = శకునాలు చెప్పేవాళ్లు; స్వప్నదృశః = స్వప్నాలకు అర్థాలు చెప్పేవాళ్లు; దేవతోపాసకాః ఇతి = దేవతలను ఉపాసించే వాళ్ల అనీ, అమీత్రయః = ఈ ముగ్గురుని; దైవజ్ఞానాం = జ్యోతిష్కులకు; నిసర్గశత్రవః = సహజ శత్రువులుగా; సృష్టాః =సృష్టింపబడినారు

శకునాల బట్టి (పిల్లి ఎదురయింది, గుడ్లగూబ వాలింది, కన్ను అదిరింది), మొదలగు వాటిని బట్టి భవిష్యత్తు చెప్పేవారూ, కలల్ని బట్టి ఫలితములు చెప్పేవారూ, దేవతా ఉపాసకులు – ఈ ముగ్గురూ జ్యోతిష్కుడికి సహజ శత్రువులు. (వీరితోబాటు వాస్తు శాస్త్ర ప్రవీణులు, హస్త సాముద్రికాలు, నాడీ గ్రంథాలను చూచి చెప్పేవారలను కూడా చేర్చుకోవచ్చు).

**స్వస్థైర సాధ్యరోగశ్చ జన్తు భిర్నాస్తి కించన**
**కాతరా దీర్ఘ రోగాశ్చ భిషజాం భాగ్యహేతవః ॥ (23)**

స్వస్థైః = ఆరోగ్యవంతులైన; జన్తుభిః = జనులచేతను; అసాధ్య రోగైశ్చ = అసాధ్యమైన రోగాలు కలవారిచేతను; కించన నాస్తి = ప్రయోజనమేమీ లేదు; కాతరాః = భయస్వభావం కలవారు; దీర్ఘ రోగాశ్చ = దీర్ఘ రోగం కలవారు; భిషజాం = వైద్యుల; భాగ్యహేతవః = భాగ్యానికి కారణ భూతులు.

ఆరోగ్యవంతులకు మందులు పని లేదు. మొండి రోగాలపై కూడా అవి పని చేయవు. కనుక వైద్యులకు వీరితో పని లేదు. జలుబుకు, జ్వరానికి ప్రాణం పోతుందని భయపడేవారూ, దీర్ఘ రోగులూ దొరికారంటే వైద్యుల అదృష్టమే. (వైద్య పరీక్షలు, క్లినిక్కులు, మందుల పట్టీలు, బోలెడంత ఆదాయం).

**నాతి ధైర్యం ప్రదాతవ్యం నాతి భీతిశ్చ రోగిణి**
**నైశ్చిన్త్యాన్నాదిమే దానం నైరాశ్యాదేవ నాన్తిమే॥ (24)**

రోగిణి=రోగి విషయంలో; అతి ధైర్యం=ఎక్కువ ధైర్యము; నప్రదాతవ్యం=ఇవ్వదగినది కాదు; అతి భీతిశ్చ = ఎక్కువ భయం కూడా; న = ఇవ్వదగినది కాదు; ఆదిమే = మొదటి పక్షంలో; నైశ్చిన్త్యాత్ = భయం లేకపోవడం వల్ల; దానం న=వైద్యునికి దానం రాదు; అంతిమే = రెండవ దానిలో; నైరాశ్యాదేవ = నిరాశ వలన; న = ఉండదు.

రోగితో ''నీకేం ఫర్వాలేదు'' అని అమిత ధైర్యం కానీ; ''నీ సంగతి ఏమీ చెప్పజాలనని'' భయం కలిగించే విధంగానూ మాట్లాడరాదు. దీనివల్ల వైద్యునికి ఆదాయం సున్నాయే. ఎందుకంటే మొదటివాడికి చావననే ధీమా, రెండోవానికి చస్తాననే భయం –అతి భయాన్ని, అతి ధైర్యాన్ని రోగికి వైద్యుడు కలిగించరాదు – న్యాయవాదులు, కొన్ని వ్యాపారాలు చేసే వారికి కూడా ఈ సలహా బాగా పని చేస్తుంది.

**భైషజ్యంతు యథాకామం పథ్యంతు కఠినం వదేత్**
**ఆరోగ్యం వైద్యమాహాత్మ్యాత్, అన్యథాత్వమ పథ్యత ॥ (25)**

భైషజ్యంతు = వైద్యమైతే, యథాకామం = తన ఇష్టం వచ్చినట్లు చెయ్యాలి; పథ్యంతు = పథ్యమైతే; కఠినం = అతికఠినమైన దానిని చెప్పవలెను; ఆరోగ్యం = ఆరోగ్యము; వైద్యమాహాత్మ్యాత్ = వైద్యం యొక్క మాహాత్మ్యం వలన; అన్యథాత్వం = రోగం కుదరకపోతే; అది అపథ్యం = అపథ్యం చేయడం వలన.

వైద్యం నీ ఇష్టం వచ్చినట్లు చెయ్. కానీ కఠిన పథ్యం చెప్పు. రోగం కుదిరిందా అది నీ మహిమ. కుదరక పోయిందా అందుకు అపథ్యం చేశావని దబాయించు.

**నిదానం రోగనామాని సామ్యాసామ్యే చికిత్సితమ్**
**సర్వమప్యుపదేక్ష్యన్తి రోగిణః సదనే స్త్రియః ॥ (26)**

నిదానం=రోగ కారణాన్ని; రోగనామాని=రోగాలపేర్లను; సామ్యాసామ్యే=సామ్యమును అసామ్యమును; చికిత్సితం = చికిత్సను; సర్వమపి = అంతయూకూడా; రోగిణః= రోగి యొక్క; సదనే=గృహంలోని; స్త్రియః= స్త్రీలు; ఉపదేక్ష్యన్తి = ఉపదేశించగలరు.

రోజూ వినడం వల్ల రోగి ఇంట్లోని స్త్రీలు కూడా రోగకారణాలు రోగాల పేర్లు, ఏది పథ్యమో, ఏ వ్యాధికి ఏ మందో, ఇవన్నీ చెప్పగలరు. అందుచేత కొంతమంది వైద్యులకంటే రోగి ఇంటిలోని ఆడవారే మెరుగు. (ఆయుర్వేదం ప్రకారం శరీరంలో వాతం, పిత్తం, కఫం అనే దోషాలుంటాయి. అవి సమంగా వుంటే ఆరోగ్యంగా వుంటాడు. వాటిలో వైషమ్యం, హెచ్చు తగ్గులు ఏర్పడితే రోగాలు వస్తాయి).

**జృంభమాణేషు రోగేషు మ్రియమాణేషు జన్తుషు**
**రోగతత్త్వేషు శనకై ర్వ్యుత్పద్యన్తే చికిత్సకాః ॥ (27)**

రోగేషు = రోగములు; జృంభమానేషు = విజృంభించు చుండగా; జన్తుషు = ప్రజలు; మ్రియమాణేషు = మరణించుచుండగా, చికిత్సకాః =వైద్యులు; శనకైః = మెల్లగా; రోగతత్త్వేషు = రోగాల స్వరూపం విషయంలో; వ్యుత్పద్యన్తే = జ్ఞానం కలవారవుతారు.

రోగాలు విజృంభించి, జనం చస్తున్న కొద్దీ, మెల్ల మెల్లగా వైద్య విద్యలో ఆరితేరగలరు. (పదిమందిని చంపితే కానీ వైద్యుడవడు).

**ప్రవర్తనార్థమారంభే మధ్యేత్వౌషధ హేతవే**
**బహుమానార్థ మన్తేచ జిహీర్షన్తి చికిత్సకాః ॥ (28)**

చికిత్సకాః = వైద్యులు; ఆరంభే = వైద్యారంభంలో; ప్రవర్తనార్థం = వైద్యం చేపట్టుడానికి (Consultation fees); మధ్యే=మధ్యలో; ఔషధ హేతవే=ఔషధం కొరకు; అన్తే=చివర; బహూమానార్థంచ=పారితోషికం కొరకు; జిహీర్షన్తి=హరించుటకు ప్రయత్నిస్తూ వుంటారు.

రోగ నిర్ధారణ చేయుటకు తొలిగా వైద్యం మొదలు పెట్టాలనీ, మధ్య ఔషదాలకోసం, చివరకు రోగం కుదిరితే బహుమానమంటూ వైద్యులు రోగుల ధనాన్ని లాగటానికి ప్రయత్నిస్తారు.

**లిప్సమానేషు వైద్యేషు చిరాదాసాద్య రోగిణం**
**దాయాదాః సంప్రరోహన్తి దైవజ్ఞాః మాంత్రికా అపి ॥ (29)**

చిరాత్=చాలాకాలానికి; రోగిణం=రోగిని; ఆసాద్య=పొంది; వైద్యేషు=వైద్యులు; లిప్సమానేషు=ధనం పొందాలని అనుకొంటూండగా; దైవజ్ఞాః =జ్యోతిష్కులు; మాన్త్రికాఅపి =మాంత్రికులు కూడా; దాయాదాః=దాయాదులుగా; సంప్రరోహన్తి=మొలుచుకొని వస్తారు.

ఇంత కాలానికి ఈ రోగి దొరికాడు. అంతో ఇంతో రాబట్టుకోవచ్చని వైద్యుడు అనుకొంటూండగానే, జ్యోతిష్కులూ, మాంత్రికులూ అనే దాయాదులు ఎక్కడి నుంచో హఠాత్తుగా మొలుచుకొని వస్తారు. (వైద్యుడి కడుపు కొడుతారు).

**రోగ స్యోపక్రమే సాంత్వం మధ్యేకించిద్ధన వ్యయం**
**శనైరనాదరః శాన్తౌ, స్నాతోవైద్యం నపశ్యతి ॥ (30)**

రోగస్య = రోగము యొక్క; ఉపక్రమే = ప్రారంభంలో; సాన్త్వం = (వైద్యుణ్ణి) బ్రతిమాలు కోవడము; మధ్యే = మధ్యలో; కించిద్ధన వ్యయం = కొంచెం డబ్బు ఖర్చు; శాన్తౌ = తగ్గుతూంటే; శనైః = మెల్లగా; అనాదరః = అనాదరము; స్నాతః స్నానం చేసినవాడు; వైద్యం = వైద్యుణ్ణి; నపశ్యతి =చూడడు.

రోగం రావడంతోనే, రోగి వైద్యుణ్ణి రోగం బాగు చేయమని ప్రాధేయపడతాడు. వైద్యం ప్రారంభించాక నాలుగు డబ్బులు కర్చు పెడతాడు. రోగం తగ్గు ముఖం పట్టిందంటే వైద్యుణ్ణి లెక్క చేయడు. పూర్తిగా తగ్గి స్నానం చేశాడో ఆపై వైద్యుడి ముఖం చూడడు. (స్నానం చేసి అంత అన్నం తింటే రోగం పోయినట్లే కదా! ఇక వైద్యుడెందుకు?)

**దైవజ్ఞత్వం మాన్త్రికతా, భైషజ్యం చాటుకౌశలమ్**
**ఏకైక మర్థ లాభాయ ద్విత్రియోగస్తు దుర్లభః ॥ (31)**

దైవజ్ఞత్వం = జ్యోతిషం; మాన్త్రికతా = మాంత్రికత్వము; భైషజ్యం = వైద్యమూ; చాటు కౌశలమ్ = మంచి మాటలు చెప్పటంలో నేర్పు; ఏకైకం = వీటిలో ఒక్కొక్కటి కూడా; అర్థలాభాయ = ధనార్జనకు పనికి వస్తుంది; ద్విత్రి యోగస్తు = రెండు మూడింటి కలయిక మాత్రం; దుర్లభః = దుర్లభమైనది.

జ్యోతిష్కుడు కావటం, మాంత్రికుడైవుండుట, వైద్యం తెలియడము, ముఖస్తుతి చేయడము – వీనిలో ఏ ఒక్కటి వున్నా బాగా సంపాదించు కోవచ్చు. అయితే రెండు మూడు లక్షణాలు కలవడం చాలా కష్టం.

**అనృతం చాటు వాదశ్చ ధనయోగో మహానయమ్**
**సత్యం వైదుష్య మిత్యేష యోగో దారిద్ర్య కారకః ॥ (32)**

అనృతం=అబద్ధాలాడటం; చాటు వాదశ్చ=తియ్యగామాట్లాడటం; అయం=అది; మహాన్ =గొప్ప; ధనయోగః = ధనయోగము; సత్యం = సత్యాన్ని చెప్పడం; వైదుష్యం =పాండిత్యము; ఇతిఏషః=అనేది; దారిద్ర్య కారకః యోగః=దారిద్ర్యాన్ని కలిగించేయోగము.

అబద్ధాలాడటం, తియ్యగా మాట్లాడటం గొప్ప ధనయోగం. నిజం చెప్పడం, పాండిత్యం అనేది దారిద్ర్యయోగము. అబద్ధాలతో, పొగడ్తలవల్ల బాగా ధనం సంపాదించవచ్చు. యదార్థ వాదులు లోక విరోధులు. పండితులు పిచ్చివాళ్లు.

**కాతర్యం దుర్వినీతత్వం కార్పణ్య మవివేకితామ్**
**సర్వం మార్జన్తి కవయః శాలీనాం ముష్టికింకరాః ॥ (33)**

శాలీనాం ముష్టికింకరాః =పిడికెడు ధాన్యం కోసం కింకరులుగా పడివుండే; కవయః = కవులు; కాతర్యం = పిరికితనాన్ని; దుర్వినీతత్వం = దుష్టత్వాన్ని; కార్పణ్యం = పిసినారితనాన్ని; అవివేకితాం = వివేకరాహిత్యాన్ని; సర్వం = అన్ని దోషాలనూ; మార్జంతి = తుడిచివేస్తారు.

పిడికెడు ముష్టికోసం ఆశపడి, కవులు ఎదుటివారిలోని పిరికితనం, చెడ్డతనం, పిసినారితనం, తెలివితక్కువతనం వంటి అన్ని దుర్గుణాలను త్రోసిపుచ్చి, వాళ్లకు దాసులై, వారిని వీరులు, విక్రమార్కులనీ, మహాత్ములనీ పొగిడేస్తుంటారు.

**న కారణమపేక్షన్తే కవయః స్తోతు ముద్యతాః**
**కించిదస్తు వతాంతేషాం జిహ్వాపుర పురాయతే ॥ (34)**

స్తోతుం=స్తోత్రము చేయుటకు; ఉద్యతాః = ఉద్యుక్తులైన; కవయః =కవులు; కారణం= కారణమును; న అపేక్షన్తే=అపేక్షింపరు; కించిత్=ఏదో ఒకటి; అస్తువతాం = స్తోత్రం చెయ్యని; తేషాం = వారి యొక్క; జిహ్వా=నాలుక; పురపురాయతే= గులగులపెట్టును.

కవులు స్తోత్రం చేయడం ప్రారంభించారంటే అందుకు ఏ కారణమూ వుండవలసిన పని లేదు. ఏదో ఒకటి స్తోత్రం చెయ్యకపోతే వాళ్ల నాలుక ''పుర పుర''మంటుంది.

**స్తుతం స్తువన్తి కవయో న స్వతో గుణదర్శినః**
**కీటః కశ్చిదలిర్నామ కీయతీ తత్రవర్ణనా ॥ (కీదృశీ) (35)**

కవయః = కవులు; స్తుతం = ఇతరులచే స్తుతింప బడినవారిని; స్తువన్తి = స్తుతించు తుంటారు; స్వతః = స్వంతంగా; గుణదర్శినః = గుణములను చూచువారు; న = కాదు; కశ్చిత్ = ఒకానొక; కీటః = పురుగు; అలిఃనామ = తుమ్మెద అనేది; తత్ర = దాని విషయమై; కీయతీ, (కీ దృశీ) = ఎంత; వర్ణనా = వర్ణన చేయబడుతుంది.

ఎవరైనా ఒకరు ఒకణ్ణి స్తోత్రం చేస్తే, వానినే తిరిగి కవులు స్తోత్రం చేస్తుంటారు. స్వయంగా వారి గుణగణాలను పరిశీలించి కానీ స్తుతించాలని లేదు వాళ్లకు. తుమ్మెద అనేది ఒక పురుగు. దాన్ని గూర్చి ఎంతెంత వర్ణనలున్నాయో చూడండి.

**ఏకైవ కవితా పుంసాం గ్రామాయాశ్వాయ హస్తినే**
**అంతతో అన్నాయ వస్త్రాయ తాంబూలాయచ కల్పతే ॥ (36)**

ఏకా = ఒక్క; కవితైవ = కవిత్వమే; పుంసాం = పురుషులకు; గ్రామాయ = గ్రామం సంపాదించి పెట్టడానికీ; అశ్వాయ = గుఱ్ఱాన్ని; హస్తినే = ఏనుగకు; అన్తతః = తుదకు; అన్నాయ = అన్నానికి; వస్త్రాయ = గుడ్డకు; తాంబూలాయచ = తాంబూలానికి కూడ; కల్పతే = సమర్థం అగుచున్నది.

కవిత్వం, కొందరికి అగ్రహారాలు, గుఱ్ఱాలు, ఏనుగులు సంపాదించి పెడితే, అదేకవిత్వం కొందరికి ఒక పూట అన్నం, కొందరికి వస్త్రం, మరికొందరికి తాంబూలం సంపాదించి పెడుతుంది. (లేక) ఒక కవి మంచి ఔదార్యవంతుడి దగ్గరికి వెళ్ళి కవిత్వం చెప్పి గ్రామాదులు సంపాదించుకుంటే; అదే కవిత్వం మరొకరి దగ్గర చెప్పినపుడు ఒక్క పూట భోజనమో, వస్త్రమో, తాంబూలమో లభించవచ్చును.

**శబ్దాఖ్యమపరంబ్రహ్మ సందర్భేణ పరిష్కృతమ్**
**విక్రీయతే కతిపయై ర్వృథాన్యైర్వినియుజ్యతే ॥ (37)**

సందర్భేణ=ఒక క్రమంలో కూర్చడంచేత; పరిష్కృతం=పరిష్కరింపబడిన; శబ్దాఖ్యం=శబ్దమనే పేరుగల; అపరం బ్రహ్మ=అపర బ్రహ్మ; కతిపయైః = కొందరిచే; విక్రీయతే =అమ్మబడు చున్నది; అన్యైః = ఇతరులచే; వృథా = వ్యర్థంగా; వినియుజ్యతే =వినియోగింపబడు చున్నది.

శబ్ద బ్రహ్మమునే ఒక క్రమంలో కూర్చి పరిష్కరిస్తే అది ఒక కావ్యమవుతుంది. (వేదమే అవుతుంది). అటువంటి శబ్ద బ్రహ్మమును కొందరు అమ్ముకొంటున్నారు. కొందరు ఆ శబ్ద బ్రహ్మమును దుర్వినియోగం చేస్తున్నారు.

**వర్ణయంతి నరాభాసాన్వాణీం లబ్ధ్వాపి యేజనాః**
**లబ్ధ్వాపి కామధేనుంతే లాఙ్గలే వినియుఞ్జతే ॥ (38)**

యే = ఏ; జనాః = మనుష్యలు (కవులు); వాణీం = సరస్వతిని; లబ్ధ్వాపి = పొంది కూడా; నరాభాసాన్ = ముష్యలవలె కనబడేవారిని; వర్ణయంతి = వర్ణించు చున్నారో; తే = వారు; కామధేనుః, కామధేనువును; లబ్ధ్వాపి = పొందికూడ; లాఙ్గలే = నాగలియందు; వినియుఞ్జతే = వినియోగించు చున్నారు.

వాగ్దేవి అనుగ్రహాన్ని పొంది, ఆ కవితా శక్తితో నరాధములను వర్ణించేవారు ఎటువంటి వారంటే, అన్ని కోర్కెలను తీర్చే కామధేనువు లభ్యమైతే, దానిని నాగలికి కట్టి భూమి దున్నే దౌర్భాగ్యుల వంటివారు.

**ప్రశంసంతో నరాభాసాన్ ప్రలపన్తోఽన్యథాన్యథా**
**కథం తరన్తు కవయః కామపారమ్య వాదినః ॥ (39)**

నరాభాసాన్ = మనుష్యులవలె కనబడేవారిని; ప్రశంసన్తః = పొగడుచూ; అన్యథా అన్యథా = ఏమేమో; ప్రలపన్తి = వాగుచూ; కామపారమ్యవాదినః = కామానికే ప్రాధాన్యాన్ని చెప్పే; కవయః = కవులు; కథం = ఎట్లు; తరన్తు = తరించాలి.

పశుసమానులైన నరులను కీర్తిస్తూ, వాళ్లనూ, వీళ్లనూ గూర్చి, ఏమేమో వాగడం చేత తమ కోరికలను లక్ష్యంగా పెట్టుకొన్న కవులు ఎట్లు తరించెదరు ?

**యత్సందర్భే యదుల్లేఖే, యద్వ్యంగ్యే నిభృతం మనః**
**సమాధేరపి తజ్జ్యాయః శఙ్కరోయది వర్ణ్యతే ॥ (40)**

సందర్భే=శబ్దాలను కూర్చడంలో; మనః=మనస్సు; నిభృతం ఇతియత్=నిశ్చలంగా వుంటుంది అనేది ఏది కలదో; ఉల్లేఖే=వర్ణించడంలో; నిభృతం ఇతియత్=నిశ్చలంగా వుంటుంది అనేది ఏది కలదో; వ్యంగ్యే=వ్యంగ్యార్థాన్ని కూర్చే సందర్భంలో; నిభృతం ఇతియత్=నిశ్చలంగా వుంటుంది అనేది ఏది కలదో; తత్=ఆ నిశ్చలంగా ఉండడం; శఙ్కరః వర్ణ్యతేయది=శంకరుడు వర్ణింపబడితే; సమాధేరపి=సమాధి కంటే కూడా; జ్యాయః = గొప్పది.

పదాలను కూర్చడంలోనూ, వర్ణించడంలోనూ, వ్యంగ్యార్థాన్ని గూర్చి ఊహించడం లోనూ మనస్సు చాలా నిశ్చలంగా వుంటుంది. ఇలా నిశ్చలమైన మనస్సుతో వర్ణింపబడేది శంకరుడైతే, ఆ నిశ్చలత్వం సమాధికంటె కూడా గొప్పది. ఏకాగ్ర చిత్తంతో ధ్యానించడం సమాధి. దాని కంటే శంకరుని గూర్చి కవిత్వం, వ్యంగ్యంగా చెప్పినా (తస్కరాయుచ, వంచతే, పరివంచతే, అగ్రేవధాయుచ) = శ్మశానవాసి, దిగంబరుడు, తోలు గుడ్డలు కట్టుకునేవాడు) అది సమాది స్థితికంటే కూడా గొప్పది.

**గృహిణీ భగినీ తస్యాః శ్వశురౌ శ్యాల ఇత్యపి**
**ప్రాణినాం కలినాస్పృష్టాః పంచప్రాణా ఇమేఽపరే ॥ (41)**

గృహిణీ = భార్య; తస్యాః = ఆమె యొక్క; భగినీ = సోదరి; శ్వశురౌ= అత్తమామలు; శ్యాలః ఇత్యపి = బావమరది అని; ఇమే = వీరు; కలినా = కలిచేత; సృష్టాః = సృజింపబడిన; అపరే = మామూలు ప్రాణాలకంటే భిన్నమైన; ప్రాణినాం = మానవుల; పఞ్చప్రాణాః = ఐదు ప్రాణాలు.

ప్రాణాపాన వ్యానోదాన సమానాలనే ఐదు ప్రాణాలే కాకుండా, మనుష్యులకు కలి మరొక విధమైన పంచ ప్రాణాలను కూడా సృష్టించి ఇచ్చాడు. అవి ఏవనగా భార్య, ఆమె సోదరి, అత్త, మామ, బావమరది.

**జామాతారో, భాగినేయా మాతులాదార బాన్ధవాః**
**అజ్ఞాతా ఏవగృహిణాం భక్షయన్త్యా ఖువద్గృహే॥ (42)**

గృహిణాం=గృహస్థుల; గృహే =గృహమునందు; జామాతరః = అల్లుళ్లు; భాగినేయాః= సోదరీ పుత్రులు; మాతులాః=మేనమామలు; దారబాన్ధవాః=భార్యవైపు బంధువులు; అజ్ఞాతా ఏవ = తెలియకుండానే; అఖువత్ = ఎలుకవలె; భక్షయన్తి = తినేస్తూవుంటారు.

గృహస్థుల ఇళ్ళల్లో చేరి అల్లుళ్ళు, మేనల్లుళ్ళు, మేనమామలు, భార్యవైపు బంధువులు, గాది క్రింది పందికొక్కుల్లాగా తెలీకుండానే తినేస్తూఉంటారు.

**మాతులస్యబలం మాతా జామాతుర్దుహితాబలమ్**
**శ్వశురస్యబలం భార్యాస్వయమేవాతి థేర్బలమ్॥ (43)**

మాతులస్య = మేనమామకు; బలం = బలం; మాతా = తల్లి; జామాతుః= అల్లునికి; బలం=బలము; దుహితా=కూతురు; శ్వశురస్య=మామగారికి; బలం=బలము; భార్యా =భార్య; అతిథే = అతిధికి ; స్వయమేవ = తానే; బలం = బలము.

మామగారినీ, మేనమామనీ, అల్లుడినీ చూచుకునేదానికి అదరికీ అందరున్నారు. అతిథి అయినవాడు ఆ యింటిలోకి పోవడానికి తన ఆత్మబలంతోనే పోవాలి. ఆదరింపబడాలి.

**జామాతుర్వక్రతా తావద్యావ చ్ఛ్యాలస్య బాలతా**
**ప్రబుధ్యమానే సారళ్యం ప్రబుద్ధేఽస్మిన్ పలాయనమ్॥ (44)**

శ్యాలస్య = బావ మరదికి; యావత్ = ఎంతవరకు; బాలతా = బాల్యమో; జామాతుః = అల్లుని; వక్రతా = వక్రత్వము; తావత్ = అంతవరకే; అస్మిన్ = ఆ బావమరిది; ప్రబుధ్యమానే = అవుతుండగా; సారళ్యం = సరళత్వము; ప్రబుద్ధే = జ్ఞానవంతుడైన తరువాత; పలాయనం = పలాయనం చిత్తగించ వల్సిందే.

అల్లుడి వంకర చేష్టలన్నీ బావమరది చిన్నవాడుగా వున్నంత వరకే. అతడు కొంచెం కొంచెంగా జ్ఞానవంతుడవుతూ వుంటే, వక్రత్వం పోయి చక్కగా తీరుతాడు. అతనికి పూర్తిగా లోకజ్ఞానం వచ్చిందా, ఆపై అల్లుడు పారిపోవడమే గతి.

**భార్యాజ్యేష్ఠా, శిశుః శ్యాలః శ్వశ్రూః స్వాతంత్ర్యవర్తినీ**
**శ్వశురస్తు ప్రవాసీతి జామాతుర్భాగ్య ధోరణీ ॥ (45)**

భార్యా = భార్య; జ్యేష్ఠా = అందరికంటె పెద్దది; శ్యాలః = బావమరది; శిశుః = చాలా చిన్నవాడు; శ్వశ్రూః = అత్తగారు; స్వాతంత్ర్యవర్తినీ = స్వతంత్రంగా ప్రవర్తించేది; శ్వశురః = మామగారు; ప్రవాసీ = దేశాంతరగతుడు; ఇతి = ఇట్టి పరిస్థితి; జామాతుః = అల్లుని; భాగ్యధోరణి = అదృష్ట క్రమము.

భార్య, ఆయింటి సంతానంలో అందరికంటే పెద్దదై వుండి, బావమరది అంతరికంటే చిన్నవాడై వుండి, అత్తగారిదే అంతా పెత్తనం అయి, మామ దేశాలు తిరిగేవాడు అయితే, ఇదంతా అల్లుడి అదృష్ట విశేషం. వాడి పంట పండిందే.

**భూషణైర్వసనైః పాత్రైః పుత్రాణాముపలాలనైః**
**సకృదాగత్య గచ్ఛన్తీ కన్యా నిర్మార్ష్టి మందిరమ్ ॥ (46)**

సకృత్ = ఒకమారు; ఆగత్య = (పుట్టింటికి) వచ్చి; గచ్ఛన్తీ = వెళ్లుతూండే; కన్యా = కూతురు; భూషణైః = అలంకారాలతో; వసనైః = గుడ్డలతో; పాత్రై = పాత్రలతోటి; పుత్రాణాం = పుత్రుల; ఉపలాలనైః = ముద్దు ముచ్చటలతోటి; మన్దిరం = (పుట్టింటివారి) ఇంటిని; నిర్మార్ష్టి = తుడిచి వేస్తుంది.

కూతురు పుట్టింటికి ఎప్పుడైనా ఒక మాటు వచ్చి వెళ్లిందంటే; ఇక చూడండి – తన ఇంటికి ఈ పాత్రలు బాగుంటాయనీ, అలంకారాలు, నగలు కావాలనీ, వస్త్రాలు కావాలనీ, బిడ్డల ముద్దూ ముచ్చట కోసమనీ – పుట్టింటిని తుడిచి పెట్టి పోతుంది.

**గృహిణీ స్వజనం వక్తి శుష్కాహారం మితాశనమ్**
**పతిపక్ష్యాంస్తు బహ్వాశీన్ క్షీరపాంస్త స్కరానపి ॥ (47)**

గృహిణీ = భార్య; స్వజనం = తనవైపు వారిని గూర్చి; శుష్కాహారం = శుష్కమైన ఆహారాన్ని తింటారనీ; మితాశనం = మితంగా తింటారనీ, వక్తి = చెబుతుంది; పతి పక్ష్యాంతు = భర్త వైపు వాళ్లను గూర్చి అయితే; బహ్వాశీన్ = తిండిపోతులనీ; క్షీరపాన్ = పాలే తాగుతారనీ; తస్కరానపి = దొంగలు కూడా అని చెపుతుంది.

గృహిణి, తనవైపు నుంచీ వచ్చే వాళ్లందరూ, ఎండినకూడు, అదీ ఒక మెతుకో అర మెతుకో తినే వాళ్లేననీ చెపుతుంది. అదే భర్తవైపు వాళ్లు ఒఠ్ఠి తిండిపోతులనీ, పాలుకూడా మిగల్చరనీ, చేతికి అందినంత దాటేస్తారనీ కూడా చెపుతుంది (ఇది ఇంటింటి రామాయణం).

**భార్యైద్వే పుత్ర శాలిన్యౌ భగినీపతి వర్జితా**
**అశ్రాన్తకలహోనామ యోగోఽయం గృహమేధినామ్ ॥ (48)**

పుత్ర శాలిన్యౌ = పెద్ద సంతుగలిగిన; ద్వే = ఇద్దరు; భార్యే =భార్యలు; పతివర్జితా = మగడు వదలిపెట్టిన; భగినీ = సోదరి; అయం = ఇది; గృహమేధినాం = గృహస్థులకు; అశ్రాన్తకలహోనామ = ''ఎడతెరపి లేని కలహం వుంటుంది'' అనే; యోగః = (జాతకంలోని) యోగము.

ఇద్దరు భార్యలు, వాళ్లిద్దరికీ గంపెడు సంసారం. ఇల్లు చేరిన తోబుట్టువు. ఇది గృహస్థులకు ''నిరంతర కలహయోగము'' అనే యోగం. ఆ యింటి యజమానికి వారితో తగువులాడటం, వారి తగువులు తీర్చటం, రాత్రింబగళ్లు ఇంటిలోని పోరు - దానితో వాడి బ్రతుకు సరిపోతుంది. ఇది కూడా యోగమే.

**భార్యేద్వే బహవః పుత్రాః దారిద్ర్యం రోగ సంభవః**
141(50)
**జీర్ణౌచమాతా పితరావే కైకం నరకాధికమ్ ॥ (49)**

ద్వే=ఇద్దరు; భార్యే=భార్యలు; బహవః =చాలామంది; పుత్రాః =పుత్రులు; దారిద్ర్యం= దారిద్ర్యము; రోగ సంభవః =రోగం రావడం; జీర్ణౌ =బాగా వృద్ధులైన; మాతాపితరౌ= తల్లి దండ్రులు; ఏకైకం=(ఒకొక్క) ఒక్కొక్కటి; నరకాధికమ్=నరకం కంటె పెద్దది.

ఇద్దరు భార్యలు, చాలామంది కొడుకులు, దారిద్ర్యం, ఇంట్లో రోగాలు రావటం, ముదుసలి తలిదండ్రులు - వీటిలో ఏ ఒక్కటి సంభవించినా, నరకానికి మించి వుంటుంది.

**స్మృతేసీదన్తిగాత్రాణి దృష్టే ప్రజ్ఞా వినశ్యతి**
**అహో! మహదిదం భూతముత్తమర్ణాభి శబ్దితమ్ ॥ (50)**

ఉత్తమర్ణాభిశబ్దితం = ఉత్తమర్ణుడు (అప్పు ఇచ్చినవాడు) అని పేరుపెట్టిన; ఇదం = ఇది; మహత్ = గొప్ప; భూతం = పిశాచము; స్మృతే = స్మరింపబడగానే; గాత్రాణి = అవయవాలు; సీదన్తి = దుర్బలమౌతాయి; దృష్టే = చూడగానే; ప్రజ్ఞా = బుద్ధి; వినశ్యతి = నశించిపోవును; అహో = ఏమి ఆశ్చర్యము.

అప్పుల వాడనేవాడు ఎలాంటి మహాభూతమోకానీ వానిని స్మరించగానే కాళ్ళూ చేతులూ ఆడటం మానేస్తాయి. వాడు కంటబడగానే బుద్ధి పనిచేయదు.

**అన్తకోఽపిహి జన్తూనా మన్తకాల మపేక్షతే**
**నకాలనియమః కశ్చిదుత్త మర్ణస్య విద్యతే ॥ (51)**

అన్తకోఽపి = యముడు కూడా; జన్తూనాం = ప్రాణుల యొక్క; అన్తకాలం = మరణకాలాన్ని; అపేక్షతే = అపేక్షిస్తాడు; ఉత్తమర్ణస్య = అప్పిచ్చినవానికి; కాలనియమః = కాలనియమము; కశ్చిత్ = ఏదీ; నవిద్యతే = లేదు.

యముడు కూడా ప్రాణుల మరణకాలం వచ్చే వరకూ వాళ్ల జోలికి వెళ్లడు. అప్పుల వాడికి కాల నియమమంటూ ఏదీ లేదు. ఋణభారం మోయలేక ఎందరు

రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు ? వీధికొక ఫైనాన్సు కంపెనీ కార్లు మొదలుకొని అప్పిస్తారు. వీళ్లు అప్పులు తీసుకుంటారు. తీరా వాయిదాలు కట్టే సమయం వస్తే వారికి యముళ్లు కనబడతారు.

**నపశ్యామో ముఖేదంష్ట్రాం నపాశంవా కరాఞ్చలే**
**ఉత్తర్ణమవేక్ష్యైవ తథాప్యుద్విజతే మనః ॥ (52)**

ముఖే = ముఖంలో; దంష్ట్రాం = కోరను; నపశ్యామః = చూడము; కరాఞ్చలే = చేతిలో; పాశం వా = పాశాన్ని కాని; న = చూడము; తథాపి = అట్లైనను; ఉత్తమర్ణం = అప్పులవానిని; అవేక్ష్యైవ = చూడగానే; మనః =మనస్సు; ఉద్విజతే = ఉద్వేగం పొందుతుంది.

అప్పులవాడి నోట్లో యమభటుడికున్నట్లు కోఱలుకానీ, చేతిలో పాశంకానీ వుండవు. అయినా వానిని చూడగానే మనస్సు ఉద్వేగం పొందుతుంది. మరీ ముఖ్యంగా గ్రామాలలోనూ, పర్వత ప్రాంతాలలోనూ, ఈ ఋణ బాధకు తట్టుకోలేక ఆ ప్రజలు పడే బాధలు వర్ణనాతీతము.

**శత్రౌ సాన్త్వం ప్రతీకారః సర్వరోగేషు భేషజమ్**
**మృత్యోర్మృత్యుం జయధ్యానం, దారిద్ర్యేతు నకించన ॥ (53)**

శత్రౌ = శత్రువు విషయంలో; సాన్త్వం = బ్రతిమాలుకోవడం (సామం); ప్రతీకారం = ప్రతిక్రియ; సర్వరోగేషు = అన్ని రోగాలలోను; భేషజం = మందు (ప్రతిక్రియ); మృత్యోః = మృత్యువునకు; మృత్యుంజయధ్యానం = ఈశ్వర ధ్యానము (ప్రతిక్రియ); దారిద్ర్యేతు = దారిద్ర్యం విషయంలో మాత్రం; కించనన = ఏ ప్రతిక్రియ లేదు.

క్షమాభిక్ష పెట్టుమని విరోధి కాళ్ల మీదపడి శత్రుబాధ తొలగించుకోవచ్చును. ఔషధ సేవతో అన్ని రోగాల్ని పోగొట్టుకోవచ్చు. మృత్యుంజయుడైన పరమేశ్వరధ్యానం వలన మృత్యువు నుండి తప్పించుకోవచ్చు. దారిద్ర్యానికి ఏ ప్రతిక్రియా లేదు. (దారిద్ర్యమంటే తృప్తి లేక పోవడమే వాని కెన్ని వున్నా ఇంకా ఎన్నో కావాలని, అవి లేవని ఏడుస్తూ వుంటాడు. అటువంటి దరిద్రునికి మందే లేదు).

**శక్తిం కరోతిసఞ్చారే శీతోష్ణే మర్షయత్యపి**
**దీపయత్యుదరే వహ్నిం దారిద్ర్యం పరమౌషధమ్ ॥ (54)**

దారిద్ర్యం=దారిద్ర్యమనే; పరమౌషధమ్=గొప్ప ఔషధము; సంచారే=సంచరించడంలో; శక్తింకరోతి = శక్తినిస్తుంది; శీతోష్ణే అపి = శీతోష్ణాలను కూడా; మర్షయతి = సహించేట్లు చేస్తుంది; ఉదరే వహ్నిం = జఠరాగ్నిని; దీపయతి = ప్రదీపింప జేస్తుంది.

అయితే దారిద్ర్యాన్ని మించిన ఔషధం లేదు. ఇది దేశ సంచారం చేసే శక్తినిస్తుంది. శీతోష్ణాలను సహించే శరీర బలాన్ని ఇస్తుంది. జీర్ణ శక్తిని పెంపొందిస్తుంది.

**గిరం స్ఖలన్తీం మీలన్తీం దృష్టిం పాదౌ విసంష్ఠు(తా) లౌ**
**ప్రోత్సాహయతి యా ఞ్చాయాం రాజాజ్ఞేవ దరిద్రతా ॥ (55)**

దరిద్రతా = దారిద్ర్యము; రాజాజ్ఞేన = రాజాజ్ఞవలె; స్ఖలన్తీం = తొట్రుపడుచున్న; గిరం = వాక్కును; మీలన్తీం = మూసుకుపోతున్న; దృష్టిం = చూపునూ; విసంష్ఠుతా = వంకరగా పడుతున్న; పాదౌ = పాదాలను; యాఞ్చాయాం = యాచించుట యందు (కు); ప్రోత్సాహయతి = ప్రోత్సహింప చేయును.

మాట తడబడుతూ వుంటుంది; చూపు సగం మూసుకుపోతూ వుంటుంది; పాదాలు ఎగుడు దిగుడుగా పడుతుంటాయి; ఇలాటి పరిస్థితులలో వున్న మనిషిని రాజాజ్ఞవలె దారిద్ర్యం యాచించటానికి ప్రోత్సాహిస్తుంది.

**జీర్యంతి రాజ విద్వేషా జీర్యన్తి విహితాన్యపి**
**ఆకించిన్యబలా ఢ్యానా మన్తతోఽశ్మాపి జీర్యతి ॥ (56)**

ఆకించిన్య బలాఢ్యానాం=దారిద్ర్యమనే బలం కలవారికి; రాజవిద్వేషాః = రాజ ద్వేషములు; జీర్యంతి = జీర్ణించిపోవును (యేమీ చేయలేవు); అవిహిత్యానపి = చేయబడినికర్తవ్యాలు కూడ; జీర్యంతి=జీర్ణించిపోతాయి; అన్తతః=చివరకు; అశ్మాపి=రాయికూడా; జీర్యతి=జీర్ణించిపోతుంది.

దారిద్ర్యం అనే మహాబలం వుంది వాళ్లకు, వాళ్లను రాజద్వేషం ఏమీ చేయలేదు. చేవలసిన పనులు చేయక పోయినా సమసిపోతాయి. అయినా ఏమీ కాదు. సహించాల్సిందే. చివరకు రాళ్ళు తిన్నా జీర్ణం అయిపోతాయి. వాళ్లకు ఒకే ధైర్యం. గోచికి మించిన దరిద్రం- శిరస్సుకు మించిన శిక్షా ఉండదుకదా! అన్నింటినీ సహించగలరు.

**నాస్యచోరా నపిశునా నదాయాదా నపార్థివాః**
**దైన్యం రాజ్యాదపి జ్యాయోయది తత్త్వం ప్రబుధ్యతే ॥ (57)**

అస్య=ఈ దైన్యం కలవానికి; చోరాః = దొంగలు; న = ఉండరు; పిశునాః = చాడీలు చెప్పేవారు; న=వుండరు; దాయాదాః=దాయాదులు; న=వుండరు; పార్థివాః=రాజులు; న = ఉండరు; తత్త్వం = ఇందులోని సత్యం; ప్రబుద్ధతేయది = తెలియబడినట్లైతే; దైన్యం = దారిద్ర్యము; రాజ్యాదపి = రాజ్యం కంటె కూడ; జ్యాయః = గొప్పది.

సత్యం తెలుసుకొంటే దారిద్ర్యం రాజ్యాధిపత్యం కంటె గొప్పది. ఎందుకనగా ఇది వున్నవాళ్లను దొంగలు కానీ, కొండెములు చెప్పే వారుకానీ, దాయాదులుకానీ, రాజులుగానీ పీడించజాలరు. ఇంకోరకంగా చెప్పాల్సి వస్తే కౌపీనవంతః ఖలుభాగ్యవంతః = వాళ్ళకు దొంగల వల్లా, శత్రువులవల్లా, ఏ ఇతరుల వల్ల కూడా బాధలు లేవు. వాళ్లను ఎవరూ ఏమీ చేయలేరు.

**ప్రకాశయత్యహంకారం ప్రవర్తయతి తస్కరాన్**
**ప్రోత్సాహయతి దాయాదాన్ లక్ష్మీః కించిదుపస్థితా ॥ (58)**

కించిత్ = కొంచెము; ఉపస్థితా = చేరిన; లక్ష్మీః = ఐశ్వర్యము; అహంకారం = అహంకారాన్ని; ప్రకాశయతి = బైటికి తీసుకువస్తుంది; తస్కరాన్ = దొంగలను; ప్రవర్తయతి = ప్రేరేపిస్తుంది; దాయాదాన్ = దాయాదులను; ప్రోత్సాహయతి = ప్రోత్సహిస్తుంది; (ప్రోత్సహింప జేస్తుంది).

లక్ష్మి కొంచెం చేరిందంటే అహంకారాన్ని బైటికి తెస్తుంది. (ధనమెచ్చిన మదమెచ్చును). దొంగలను ప్రేరేపిస్తుంది. దాయాదులకు ప్రోత్సాహం ఇస్తుంది. (అందువల్ల దరిద్రమే మేలు కదా!).

**విడమ్బయన్తి యే నిత్యం విదగ్ధాన్ ధనినో జనాః**
**త ఏవతు విడమ్బ్యన్తే శ్రియా కించిదుపేక్షితాః ॥ (59)**

యే = ఏ; ధనినః జనాః = ధనికులు; నిత్యం = ఎల్లప్పుడును; విదగ్ధాన్ = బుద్ధివంతులను; విడమ్బయన్తి = అవమానిస్తారో; కించిత్ ఉపేక్షితాః = (బుద్ధిమంతుల చేత లేదా కొంత కాలానికి లక్ష్మిచేత) కొంచెము ఉపేక్షింపబడినవారై; తే ఏవ = అధనికులే; శ్రియా = లక్ష్మిచేత; విడమ్బన్తే = అవమానింపబడుదురు.

ధనికులైనవారు మహా పండితులను అవమానిస్తారు. ఆ లక్ష్మి వారిని కొంచెం ఉపేక్షిస్తే చాలు – అందరూ వానిని అపహాస్యం పాలు చేస్తారు.

**ప్రామాణ్యబుద్ధిః స్తోత్రేషు దేవతా బుద్ధిరాత్మని**
**కీటబుద్ధిర్మనుష్యేషు నూతనాయాః శ్రియః ఫలమ్ ॥ (60)**

స్తోత్రేషు=స్తోత్రాలయందు; ప్రామాణ్యబుద్ధిః =ప్రామాణ్యబుద్ధి, ఆత్మని = తనయందు; దేవతాబుద్ధిః=దేవతననే బుద్ధి; మనుష్యేషు=మనుష్యుల విషయంలో; కీట బుద్ధిః = పురుగులనే బుద్ధి; నూతనాయాః=క్రొత్తగా వచ్చిన; శ్రియః = లక్ష్మికి; ఫలం = ఫలము.

తనను ఇతరులు చేసే స్తోత్రాలన్నీ వాస్తవమేనని అనుకోవడం, తనలో దేవతాంశ వున్నదను కోవడం, చుట్టు ప్రక్కల వున్న మనుష్యులందరూ పురుగులను కోవడం, ఇదంతా క్రొత్తగా చేరిన ఐశ్వర్యానికి ఫలం – అసుర సంపద కలిగిన వారి భావాలు ఇలాగే ఉంటాయని భగవద్గీత 16వ అధ్యాయంలో భగవానుడు చక్కగా వర్ణిస్తాడు.

**శృణ్వన్త ఏవపృచ్ఛన్తి పశ్యన్తోఽపి న జానతే**
**విడమ్బనాని ధనికాః స్తోత్రాణీ త్యేవ మన్వతే ॥ (61)**

ధనికాః = ధనికులు; శృణ్వన్తః ఏవ = వింటూనే; పృచ్ఛన్తి = ప్రశ్నిస్తూ ఉంటారు; పశ్యన్తోఽపి = చూస్తున్నను; నజానతే = గుర్తుపట్టరు; విడమ్బనాని = పరిహాసాలను; స్తోత్రాణీత్యేవ = స్తోత్రాలే అని; మన్యతే = భావిస్తారు.

వంది మాగధులు పొగడుతూ వుంటే ''ఏదీ ఇంకోసారి చెప్పు'' అని మళ్లీ మళ్లీ అడిగి పొగడబడి ఆనందిస్తూ వుంటారు. వాళ్లు ఎదుట కనబడే వాస్తవాలను నమ్మరు. పరిచయస్తులను కూడా పరాయి వాళ్లను చూచినట్లే చూస్తారు. నెత్తికి కళ్లు వస్తాయి. (ఎదటివారు చేసే పరిహాసాలను కూడా స్తోత్రాలను కొంటూంటారు).

**ఆ వృత్య శ్రీమదేనాన్ధాన న్యోన్యకృత సంవిదః**
**స్వైరం హసన్తి పార్శ్వస్థా బాలోన్మత్త పిశాచవత్ ॥ (62)**

శ్రీమదేన=ధనమదం చేత; అన్ధాన్ = అంధులైన ధనికులను; పార్శ్వస్థాః = ప్రక్కనున్న వాళ్లు; ఆవృతః =చుట్టూచేరి; అన్యోన్యకృత సంవిదః = ఒకరికొకరు చెప్పుకొని; బాలోన్మత్త పిశాచవత్ = బాలురను, ఉన్మత్తులను, పిశాచాలను చూచి నవ్వినట్లుగా) లేదా (బాలోన్మత్తపిశాచములవలె); స్వైరం=స్వేచ్ఛగా; హసన్తి=నవ్వుతారు.

తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలు చేరినట్లు అందరూ ధనమదాంధుని చుట్టూ చేరుతారు. ముందుగానే కూడ బలుకుకొని బాలోన్మత్త పిశాచాలవలె ఆనందిస్తుంటారు. ధనికుల దరిజేరిన వాళ్ల ప్రవర్తన పిశాచాల చేష్టలు, బాలుర అర్థరహితమైన చిలిపి చేష్టలుగా ఉంటాయి. వాళ్లే రౌడీలు, గూండాలు.

**స్తోతవ్యైః స్తూయతే నిత్యం సేవనీయైశ్చ సేవ్యతే**
**నబిభేతి న జిహ్రేతి తథాపి ధనికో జనః ॥ (63)**

స్తోతవ్యైః = స్తోత్రం చేయతగినవారిచేత; స్తూయతే = స్తుతింప బడుతాడు; సేవనీయైః =సేవించతగినవారిచేత; నిత్యం=ఎల్లప్పుడూ; సేవ్యతే=సేవింపబడతాడు; తథాపి= అట్లైనను; ధనికః జనః =ధనికుడు; నబిభేతి = భయపడడు; నజిహ్రేతి = సిగ్గుపడడు.

తాను ఎవరినిస్తుతించాలో అలాంటి పూజ్యులు తనను స్తుతిస్తున్నా, తాను ఎవరికి సేవలు చేయాలో అలాంటి మాన్యులు తనకు సేవచేస్తున్నా, ధనికుడు ఆ పాపానికి భయపడడు, సిగ్గు చెందడు.

**క్షణమాత్రం గ్రహావేశో యామమాత్రం సురామదః**
**లక్ష్మీమదస్తు మూర్ఖాణా మాదేహమనువర్తతే ॥ (64)**

గ్రహావేశః = భూతావేశం; క్షణమాత్రం = ఒక్క క్షణకాలంపాటు మాత్రమే వుంటుంది; సురామదః = కల్లు త్రాగినమదం; యామమాత్రం = ఒక్క జాము వరకు వుంటుంది; మూర్ఖాణాం = మూర్ఖుల; లక్ష్మీమదస్తు = ఐశ్వర్యమదమైతే; ఆ దేహం = దేహమున్నంతవరకు; అనువర్తతే = అనువర్తిస్తుంది.

గ్రహావేశం ఒకక్షణ కాలంపాటూ, కల్లుతాగిన మదం మూడు గంటలపాటూవుంటే, మూర్ఖుల ఐశ్వర్య మదం మాత్రం వాళ్ల శరీరం వున్నంత వరకూ అనువర్తిస్తూనే వుంటుంది.

**శ్రీర్మాసమర్ధమాసం వాచేష్టిత్వా వినివర్తతే**
**వికారస్తు తదారబ్ధో నిత్యం లశునగన్ధవత్ ॥ (65)**

శ్రీః =లక్ష్మి; మాసం = ఒక మాసం కాని; అర్ధమాసం=అర్ధమాసంకాని; చేష్టిత్వా = పనిచేసి (ఉండి); వినివర్తతే=తప్పుకుంటుంది; తదారబ్ధః దానితో మొదలైన; వికారస్తు = వికారమైతే; లశునగన్ధవత్ = వెల్లుల్లివాసనవలె; నిత్యం = ఎప్పటికీ; అనువర్తతే = అనువర్తించును.

సంపదవుంటే ఒకమాసంపాటో లేక ఒక పక్షం వరకో వుండి తర్వాత తప్పుకొంటుంది. కానీ ఆ సంపదవల్ల కలిగిన మదమాత్సర్యాది వికారములు వానిని ఎప్పటికీ వదలకుండా అంటిపెట్టుకొని వుంటాయి.

**కణ్ఠేమదః కోద్రవజోహృది తామ్బూలజోమదః**
**లక్ష్మి మదస్తు సర్వాఙ్గే పుత్రదార ముఖేష్వపి (66)**

కోద్రవజః = కోఱ్ఱలు తినడం వలన కలిగే; మదః = మదం; కణ్ఠే = కంఠంలోవుండును; తామ్బూలజః మదః = తాంబూలం వలనకలిగే మదము; హృది = హృదయంలోవుండును; లక్ష్మిమదస్తు = లక్ష్మిమదమైతే; సర్వాఙ్గే = సమస్త శరీరమునందు; పుత్రదారముఖేష్వపి = పుత్రులముఖాలమీద, భార్యల ముఖాల మీద కూడా కనబడును. (పుత్ర దార ముఖేషు అనేదానికి పుత్రులు, భార్య మొదలైన వారిలోకూడా అని అర్థంచెప్పవచ్చును.)

కొఱ్ఱలు తినడం వలన కలిగేమదం కంఠంలోనూ, తాంబూల చర్వణం వల్ల కలిగేమదం హృదయములోనూ కనబడుతుంది. ఐశ్వర్యమదము ఐశ్వర్యవంతుని అన్ని అవయువాలమీదనే కాకుండా, (అనగా పదివేళ్లకు ఉంగరాలు, హారాలు, కర్ణాభరణాలు, కంఠాభరణాలు, బంగారు పొన్ను, రత్నములు పొదిగిన చేతికర్ర మొదలగునవి). అతని భార్యాపుత్రాదుల ముఖాలలో కూడా దంభము, దర్పము, ఠీవి, దర్జాలు ప్రస్ఫుటిస్తాయి.

**యత్రాసీదస్తి వాలక్ష్మీస్తత్రోన్మాదః ప్రవర్తతామ్**
**కులేఽప్యవతర త్యేష కుష్ఠాపస్మార వత్కథమ్॥ (67)**

యత్ర=ఎవనియందు (ఎవనికి); లక్ష్మిః=ఐశ్వర్యము; అసీత్=(ఒకానొక కాలంలో) ఉండెనో; అస్తివా=లేక ఇప్పుడు వున్నదో; తత్ర=వానియందు; ఉన్మాదః =ధనోన్మాదం; ప్రవర్తతాం =ప్రవర్తించుగాక; ఏషః= ఈ ఉన్మాదం; కుష్ఠాపస్మారవత్=కుష్ఠురోగమూ, అపస్మార రోగము వలె; కులేఽపి = వంశంలో కూడా; కథం = ఎట్లు; అవతరతి = సంక్రమించు చున్నదో

ఎప్పుడో ఒకప్పుడు ఐశ్వర్యం వున్నవానికీ, లేదా, ఇప్పుడు ఐశ్వర్యం వున్నవానికీ ధనోన్మాదం వున్నదంటే అర్థం చేసుకోవచ్చు. అలాకాక ఆ ధనోన్మాదం ఐశ్వర్యం వున్నా లేక పోయినా, కుష్టు రోగమూ, అపస్మార రోగములవలె ఆ తర్వాత వచ్చే వాళ్లకు కూడా సంక్రమిస్తుంది. అదే ఆశ్చర్యం. ఆ డబ్బు పిచ్చి వంశపారంపర్యంగా వస్తుందేమో!

**అధ్యాపయన్తి శాస్త్రాణి తృణీకుర్వన్తి పణ్డితాన్**
**విస్మారయన్తి జాతిం స్వాం వరాటాం పఞ్చషాఃకరే ॥ (68)**

కరే = చేతిలో; పఞ్చషాః = ఐదారు; వరాటాః = గవ్వలు; శాస్త్రాణి = శాస్త్రాలను; అధ్యాపయన్తి = చదివిస్తాయి; పణ్డితాన్ = పండితులను; తృణీకుర్వన్తి = తృణీకరిస్తాయి; స్వాం జాతిం = తన జాతిని; విస్మారయన్తి = మరచునట్లు చేస్తాయి.

చేతిలోనికి ఐదారు చిల్లి గవ్వలు (పూర్వం ఈ గవ్వలు నాణేలుగా పరిగణింపబడేవి) చేరటంతోటే, అవి శాస్త్రాలన్నిటినీ చదివించి, తామే పండితులను కునేటట్లు చేస్తాయి. పండితులను తృణీకరించేటట్లు చేస్తాయి. చివరకు తమ జాతినే మరపింప చేస్తాయి.

**బిభర్తు భృత్యాన్ ధనికోదత్తాం వాదేయ మర్థిషు**
**యావద్యాచక సాధర్మ్యం తావల్లోకో నమృష్యతి ॥ (69)**

ధనికః =ధనవంతుడు; భృత్యాన్ = పోషింపదగినవారినందరినీ, బిభర్తు = పోషించుగాక; దేయం = ఇవ్వదగినంత ధనాన్ని; అర్థిషు = యాచకులకు; దత్తాంవా = ఇచ్చుగాక; యావత్ యాచక సాధర్మ్యం = యాచకునితో సమానత్వం ఎపుడు కలుగునో; తావత్ = అంతవరకూ; లోకః = లోకము; నమృష్యతి = సహించదు.

ధనికుడు తన పోషక వర్గాన్ని జాగ్రత్తగా పోషిస్తున్నా, యథాశక్తి లేనివారికి సహాయం చేస్తున్నా, లోకులు అసూయాపరులై అతనిని నిందిస్తూనే వుంటారు. అతడు కూడా సర్వం కోల్పోయి (దానం చేసి) యాచకులతో సమానుడయే వరకూ వారు సంతోషించరు.

**ధన భారోహిలోకస్య పిశునైరేవ ధార్యతే**
**కథంతేతం లఘూకర్తుం యతన్తేఽపరథా స్వతః ॥ (70)**

లోకస్య = లోకముయొక్క; ధనభారః = ధనభారము; పిశునైరేవ = (చాడీలు చెప్పే వారి చేతనే) లోభులచే; ధార్యతే =మోయబడుచున్నది; అపరథా = అలాకానిపక్షంలో; తే = వారు; స్వతః = స్వయంగానే; తం = ఆ ధనభారాన్ని; లఘూకర్తుం = తేలిక చేయడానికి; కథం = ఎందుకు; యతన్తే = ప్రయత్నము చేయుదురు.

రాజులకు రాజులకు మధ్య తంటాలు పెట్టేవారు, అన్నదమ్ముల మధ్య కలహాలు పెట్టే వారు, కులాల మధ్య తగరార్లు రేపేవారూ అయిన చాడీలు చెప్పేవారు, పరవ-

లోభులు, ధన భారాన్ని మోస్తూ వుంటారు. ఈ చాడీలు చెప్పేవాళ్ళు ఆ ధనవంతుల భారాన్ని తగ్గించ డానికి తంటాలు పెట్టి ఎవరికి తోచిన విధంగా వారు ఏదో విధంగా ప్రయత్నిస్తుంటారు. ఈ తంటాలు పెట్టేవాళ్లే ఇన్‌కంటాక్సు వాళ్లు, దోపిడీ దొంగలు, గూండాలు, ఎందరెందరో వాళ్లకు తోచిన విధంగా ఈ ధన భారాన్ని మోసేవాళ్ల భారాన్ని తగ్గించటానికి ప్రయత్నిస్తుంటారు. విప్లవ సంఘాలంటూ బయల్దేరి వారి భారాన్ని తగ్గించ చూస్తారు. శూర్పణఖ చాడీలు చెప్పియే, ఖరదూషణుల వినాశానికి రావణరాజ్యం కూలిపోవడానికీ కారణమైనది.

**శ్రమాను రూపం పిశునే కి ముపక్రియతే నృపైః**
**ద్విగుణం త్రిగుణంచైవ కృతాన్తో లాలయిష్యతి ॥ (71)**

శ్రమానురూపం = (పిశునుని) శ్రమకు తగిన విధంగా; నృపైః = రాజులచేత; పిశునే = పిశునుని విషయంలో; కిముపక్రియతే = ఏమి ఉపకారము చేయబడును; ద్విగుణం = రెండు రెట్లు; త్రిగుణం చైవ = మూడు రెట్లు; కృతాన్తతః = యముడు; లాలయిష్యతి = లాలన చేయగలడు?

ఈ కొండెగాళ్లు పడిన శ్రమకు సరియైన సన్మానాలను రాజులు చేయలేరు. అంటే వీళ్ళు రాజ్యానికి చేసిన ద్రోహానికి ఏ శిక్ష విధించినా సరిపోదు. ఒక వేళ ఉరి తీసిననూ చాలదు. యముడే వీరికి ఇంకో రెండురెట్లో, మూడురెట్లో బహుమానం ఇవ్వగలడు. యమ లోకంలోని బాధలు పడితే తప్ప వీరికి సరైన శిక్ష (సన్మానం) జరుగదు.

**గోకర్ణే భద్ర కర్ణేచ జపో దుష్కర్మ నాశనః**
**రాజకర్ణే జపః సద్యః సర్వకర్మ వినాశనః ॥ (72)**

గోకర్ణే = గోకర్ణ క్షేత్రంలోనూ; భద్రకర్ణే = భద్రకర్ణ క్షేత్రంలోనూ; జపః = మంత్ర జపము; దుష్కర్మ నాశనః =పాపకర్మలను నాశనము చేయును; రాజకర్ణే జపః = రాజు చెవిలో రహస్యాలు చెప్పడం; సద్యః =వెంటనే; సర్వ కర్మవినాశనః = అన్ని కర్మలను నశింప చేయును.

గోకర్ణంలోనూ, భద్ర కర్ణంలోనూ చేసిన జపం దుష్కర్మలను మాత్రం నాశనం చేస్తుంది. కానీ రాజుగారి చెవిలో జపం చేస్తే, వాడి పనులన్నీ నశింపబడుతాయి. రాజుల ''చెవి కొరకడం'' ఉన్నవీ, లేనివీ చెప్పడం, ఒక నాటికి వాడి ప్రాణాలకే ముప్పు వస్తుంది.

**నస్వార్థం కిఞ్చిదిచ్ఛన్తి న ప్రేర్యన్తే చకేనచిత్**
**పరార్థేషు ప్రవర్తన్తే శఠాః సన్తశ్చ తుల్యవత్ ॥ (73)**

శఠాః = శఠులును; సన్తశ్చ = సత్పురుషులును; తుల్యవత్ = సమంగానే; స్వార్థం = స్వలాభమును; కించిత్ = కొంచెమైనను; న ఇచ్ఛన్తి = కోరుకొనరు; కేనచిత్ =

ఎవరిచేతనూ; నప్రేర్యన్తే =ప్రేరేపింపబడరు; పరార్థేషు=పరుల కార్యాలలో; ప్రవర్తన్తే = ప్రవర్తించు చుందురు.

దుష్టులూ, సత్పురుషులూ కూడా ఇంచుమించు సమానంగానే ఇతరుల పనుల్లో జోక్యం కలిగించుకొంటారు. ఇద్దరూ స్వార్థాన్ని కోరరు. (దుష్టుడు తనకే ప్రయోజనం లేక పోయినా, ఇతరుల పనిపాడు చేస్తాడు. సజ్జనుడు ఇతరుల వల్ల ఏ లాభాన్నీ ఆశించక నిస్స్వార్థంగా వారి పనులు చక్కబెడతాడు). ఇద్దరికీ నీవీపని పాడు చేయమనిగానీ, నీవీపని బాగు చేయమనిగానీ ఎవరూ ప్రోత్సహించనక్కరలేదు.

**కాలాంతరేహ్యనర్థాయ గృధ్రోగేహోపరిస్థితః**
**ఖలోగృహ సమీపస్థః సద్యోఽనర్థాయ దేహినామ్ ॥ (74)**

గేహోపరిస్థితః=ఇంటి మీదవున్న; గృధ్రః=గ్రద్ధ; కాలాన్తరే=రాబోవు కాలంలో; అనర్థాయహి =అనర్థకరమవును కదా!; గృహ సమీపస్థః=గృహ సమీపమందున్న; ఖలః=దుర్మార్గుడు; సద్యః = వెంటనే; దేహినాం = మానవుల; అనర్థాయ = అనర్థ హేతువగును.

గ్రద్ధ ఇంటి మీద వాలడం భవిష్యత్తులో మాత్రమే కీడును సూచిస్తుంది. దుష్టుడు ఇంటి దరిదాపుల్లో వున్నాడో, ఇంటి దగ్గరలో వుండే వారికి వెంటనే కీడు వాటిల్లుతుంది.

**దుష్కోపవాసోధర్మేషు భైషజ్యేషుచలఙ్ఘనమ్**
**జపయజ్ఞశ్చ యజ్ఞేషు రోచతే లోభ శాలినామ్ ॥ (75)**

లోభశాలినామ్ = లోభులకు; ధర్మేషు = ధర్మాలలో; శుష్కోపవాసః = శుష్కోపవాసము; భైషజ్యేషు = వైద్యాలలో; లఙ్ఘనమ్ = లంఘణము; యజ్ఞేషు = యజ్ఞాలలో; జపయజ్ఞశ్చ = జపయజ్ఞమూ, రోచతే= ఇష్టమగును

లోభులకు ధర్మాలన్నింటిలోనూ శుష్కోపవాసము, వైద్యాలలోకెల్లా లంఖణమూ, యజ్ఞాలలోకెల్లా జపయజ్ఞమూ నచ్చుతాయి. వీని వల్ల కానీ కూడా ఖర్చులేదుకదా !

**కిం వక్ష్యతీతి ధనికో యావదుద్విజతే మనః**
**కిం ప్రక్ష్యతీతి లుబ్ధోఽపి తావదు ద్విజతే తతః ॥ (76)**

ధనికః =(ఈ) ధనవంతుడు; కింవక్ష్యతి = ఏమి అంటాడో; ఇతి = అని; మనః = (యాచించేవాని) మనస్సు; యావత్ = ఎంత; ఉద్విజతో = బాధపడుతుందో; కిం ప్రక్ష్యతీతి = ఏమి అడుగుతాడో అని; లుబ్ధోఽపి = లుబ్ధుడు కూడ; తావత్ = అంతగా; తతః = ఆయాచకుని వలన; ఉద్విజత్ = భయపడతాడు.

ధనికుడెటువంటి సమాధానమిస్తాడోనని యాచకుడు ఉద్వేగం చెందుతూంటే, యాచకుడు ఏమి అడుగుతాడోనని లోభియైన ధనవంతుడు మనస్సులో కలవరపడుతుంటాడు.

**సర్వమాతిథ్యశాస్త్రార్థం సాక్షాత్కుర్వన్తి లోభినః**
**భిక్షాక బలమేకైకం యేహి పశ్యన్తి మేరువత్ ॥ (77)**

యే=ఎవళ్లు; ఏకైకం=ఒక్కొక్క; భిక్షా కబలం=భిక్షాకబలాన్ని; మేరువత్=మేరు పర్వతమంత దానినిగా; పశ్యన్తి =చూస్తారో; లోభినః=అట్టి లోభులు; సర్వం = సమస్తమైన; ఆతిథ్య శాస్త్రార్థం=ఆదిథ్యశాస్త్రం యొక్క అర్థాన్ని; సాక్షాత్కుర్వన్తి= ప్రత్యక్షంగా చూడగలుగుతాడు.

ఆకలిగొన్న అతిథికి పెట్టిన ఒక్క కబలం పరలోకంలో మేరుపర్వతమంత పెద్దదిగా అయి, దాత గొప్ప ఫలితాన్ని పొందుతాడు అని అతిథి పూజా విధాయక శాస్త్రం చెపుతూంది. ఈ శాస్త్రం చెప్పిన విషయాన్ని లోభి ప్రత్యక్షంగానే చూడగలుగుతున్నాడు. ఎందుచేతనంటే ఎవరికైనా ఒక చిన్న కబలం (దానం) యిచ్చినాకూడా, పెద్ద మేరు పర్వతాన్నే యిచ్చేస్తున్నట్లుగా భావిస్తాడు.

**ధనపాలః పిశాచోహి దత్తే స్వామిన్యుపస్థితే**
**ధనలుబ్ధః పిశాచస్తు న కస్మైచన దిత్సతి ॥ (78)**

ధనపాలః = ధనాన్ని రక్షించే; పిశాచః = పిశాచము; స్వామిని=యజమాని; ఉపస్థితే = వచ్చిన వాడగుచుండగా; దత్తే = ఇచ్చివేయును; ధనలుబ్ధః = ధనలుబ్ధుడనే; పిశాచస్తు = పిశాచమైతే; కస్మైచన = ఎవరిని; నదిత్సతి = ఇవ్వడానికి ఇచ్ఛగించడు.

మంత్ర శక్తి చేత ఆవాహన చేయబడిన పిశాచము ధన రక్షణ చేస్తూ, ఇతరులకెవ్వరికీ ఇవ్వక పోయినా, దాని యజమాని వచ్చినపుడు ఆ ధనాన్ని ఇచ్చి వేస్తుంది. ధన లుబ్ధుడనే పిశాచము మాత్రం ఎవ్వరికీ కూడా ఇవ్వడు.

**దాతారోఽర్థి భిరర్థ్యన్తే దాతృభిః పునరర్థినః**
**కర్తృ కర్మవ్యతీ హారా దహో నిమ్నోన్నతం కియత్ ॥ (79)**

దాతారః = దాతలు; అర్థిభిః = యాచకుల చేత, అర్థ్యన్తే = అర్థింప బడెదను (యాచింప బడుదురు), పునః =తిరిగి (మళ్లీ); అర్థినః = యాచకులు; దాతృభిః = దాతలచేత; అర్థ్యన్తే = అర్థులుగా చేయబడుదురు; కర్తృ కర్మ వ్యతీహారాతత్ = కర్త యొక్క, కర్మ యొక్క మార్పిడి వలన; కియత్ = ఎంత; నిమ్నోన్నత = హెచ్చు తగ్గులు (క్రింద మీదగుట) వచ్చినవో; అహో = ఆశ్చర్యము.

ఇక్కడ కవి ఒక వ్యాకరణాంశాన్ని బట్టి చమత్కరించాడు. ''అర్థన్త్యే'' అనే పదానికి ''యాచింపబడుతున్నారు'', ''అర్థులుగా'' అనగా ధనవంతులుగా చేయబడుతున్నారు - అనే రెండు అర్థాలు చెప్పవచ్చు. ''దాతార అర్థిభిః అర్థ్యన్తే'', ''దాతృభి అర్థినః అర్థ్యన్తే'' అనే రెండు వాక్యాలలో, పైకి చూడటానికి - యాచకుల చేత దాతలు యాచింపబడు చున్నారు; దాతలచేత యాచులు యాచింపబడుచున్నారు - అనే రెండు విరుద్ధార్థాలు చెప్పబడుతున్నట్లు వున్నా, ''యాచకులచే దాతలు

యాచింపబడుచున్నారు''. ''దాతలచే యాచకులు ధనవంతులుగా చేయబడు చున్నారు'' అని అర్థం చెప్పుకోవాలి. ''అర్థిభిః దాతారః అర్థ్యన్తే'' అన్నప్పుడు ''అర్థ్యన్తే'' అనేది యాచించుట అనే అర్థం గల ''అర్థ'' ధాతువు యొక్క కర్మణి ప్రయోగం. యాచకులు కర్త, దాతలు కర్మ ''దాతృభి అర్థినః అర్థ్యన్తే'' అన్నప్పుడు కూడా, ''అర్థ్యన్తే'' అనేది కర్మణి ప్రయోగమే కాని, ఇది ''అర్థ'' ధాతువుకు సంబంధించినది కాదు. ''అర్థిన్'' అనే నామవాచకమునుండి ఏర్పడిన నామ ధాతువునకు సంబంధించినది. ''అర్థినం కరోతి అర్థయతి'' – ''ప్రాతిపదికాద్ధాత్వర్థే బహులమిష్టవచ్చ'', ''తత్కరోతి తదా చష్టే'' అనే గణ సూత్రాలచేత, ''అర్థిన్'' అనే దానికి ''ణిచ్'' చేర్చగా ''అర్థయతి'' అనే రూపం కలుగుతుంది. దీనికి 'ప్రార్థించుచున్నాడు' అని అర్థం కాదు. అర్థం (ధనం) కలవానినిగా చేస్తున్నాడు అని అర్థం. దాని కర్మణి ప్రయోగం ''అర్థ్యతే'' – ధనం కలవాడుగా చేయబడుతున్నాడు. ఈ రెండవ వాక్యంలో దాతలు కర్త, యాచకులు కర్మ. ఈ కర్తృత్వ కర్మత్వాలు మారిపోవడంతో మనుష్యుల గౌరవా గౌరవాలు ఎట్లా మారిపోతాయో కదా అని భావము. మొదట అప్పు అడిగేవాడు అప్పు యిచ్చేవాడిని ప్రార్థిస్తాడు. అప్పు పుచ్చుకొన్న తర్వాత దాతలే పుచ్చుకొన్నవారిని ప్రార్థించ వలసి వస్తుంది. ఈ విధంగా వారు వీరూ, వీరు వారూ అవటం చిత్రంగా లేదూ!

**స్వస్మిన్నసతి నార్థస్య రక్షక సంభవేదితి**
**నిశ్చిత్యైవ స్వయమపి భుఙ్క్తే లుబ్ధః కథంచన ॥ (80)**

స్వస్మిన్ = తాను; అసతి = లేనపుడు (మరణించిన తరువాత); అర్థస్య = ధనమునకు; రక్షకః = సంరక్షణ చేయువాడు; న సంభవేదితి = వుండడు అని; నిశ్చిత్యైవ = నిశ్చయించుకొనియే; లుబ్ధః = లోభి; స్వయమపి = తానుకూడా; కథంచన =అతికష్టముగా; భుఙ్క్తే = అనుభవించును.

తాను మరణించిన తర్వాత, తన ధనాన్ని రక్షించేవాళ్ళు ఎవ్వరూ వుండరని నిశ్చయముగా తెలిసి కూడా, లోభి అతి కష్టం మీద తన ధనాన్ని అనుభవిస్తాడు (తినలేక తినలేక తిని తనువు నిలుపుకుంటాడు).

**ప్రస్థాస్యమానః ప్రవిశేత్ ప్రతిష్ఠేతి దినే దినే**
**విచిత్రానుల్లేఖేద్విఘ్నాంస్తిష్ఠాసు రతి థిశ్చిరమ్ ॥ (81)**

చిరః = చిరకాలము; తిష్ఠాసు = వుండదలచిన; అతిథిః = అతిథి; దినేదినే = ప్రతి దినమూ; ప్రతిష్ఠేతి = ప్రయాణమవుతూ వుండాలి; ప్రస్థాస్యమానః = ప్రయాణం కాబోతూ; ప్రవిశేత్ = లోనికి రావలెను; విచిత్రాని = విచిత్రములైన; అనేక విధాలైన; విఘ్నాన్ = విఘ్నాలను; ఉల్లేఖేత్ = చెప్పుచుండవలెను.

కొంతకాలము తిష్ఠవేయగోరే అతిథి ''ఇదిగో బయలుదేరుతున్నాను'' అంటూనే తిరిగి ఇంట్లోకి ప్రవేశిస్తాడు. రోజూ బయల్దేరుతున్నానంటూనే వుంటాడు. మళ్లీ శకునం బాగులేదనో, ఏదో ఒక చిత్ర విచిత్రములైన విఘ్నాలను వల్లె వేస్తాడు.

**ప్రదీయతే విదుష్యేకం కవౌ దశ నటే శతమ్**
**సహస్రం డామ్భికే లోకే శ్రోత్రియే తు న కించన ॥ (82)**

లోకే = లోకంలో; విదుషి = విద్వాంసుని విషయంలో (విద్వాంసునికి); ఏకం = ఒక్కటి; కవౌ = కవికి; దశ = పది; నటే = నటునికి; శతం = నూరు; డామ్భికే = డాంబికము గలవానికి; సహస్రం = వెయ్యి; ప్రదీయతే = ఇవ్వబడును; శ్రోత్రియేతు = శ్రోత్రియునకైతే; కించన = ఏమియు; న = ఇవ్వబడదు.

లోకంలో పండితున కొకేరూక, కవికి పది, నటునకు వంద, డాంబికునకు వెయ్యి ఇచ్చెదరు. కానీ వేదాధ్యయనం చేసినవానికి ఏమీ ఇవ్వరు.

**ఘటకం సమ్యగారాధ్య వైరాగ్యం పరమం వహేత్**
**తావదర్థాః ప్రసిధ్యన్తి యావచ్చాపల మావృతమ్ ॥ (83)**

ఘటకం = కార్యం సమకూర్చగలవానిని; సమ్యక్ = బాగుగా; ఆరాధ్య = ఆరాధించి; పరమం = గొప్ప; వైరాగ్యం = వైరాగ్యమును; వహేత్ = వహించవలెను; యావత్ = ఎంత వరకూ; చాపలం = చపలత్వము; ఆవృతం = కప్పిపుచ్చబడినదో; తావత్ = అంతవరకూ; అర్థాః = పనులు; ప్రసిధ్యన్తి = సిద్ధించును.

తనకార్యం సాధించి పెట్టగలవానిని సేవించి ఆశ్రయించాలి. పైకి మాత్రం ఏ ఆసక్తీ లేనట్లుగా కనబడాలి. చపల స్వభావాన్ని కప్పి పుచ్చుకొని, పరమ వైరాగ్యాన్ని ప్రదర్శిస్తూ, నీ కార్యం సఫలం అయ్యేవరకూ వుండాలి.

**ఏకతః సర్వశాస్త్రాణి తులసీకాష్ఠమేకతః**
**వక్తవ్యం కించిదిత్యుక్తం వస్తుతస్తులసీ పరా ॥ (84)**

సర్వశాస్త్రాణి = శాస్త్రాలన్నిటిని; ఏకతః = ఒక ప్రక్క; తులసీకాష్ఠం = తులసి కట్టె (తులసీ పూసలతో చేసిన జపమాల); ఏకతః = మరొకపక్క; కించిత్ = ఏదో ఒకటి; వక్తవ్యం = చెప్ప దగినది; ఇతి = అని; ఉక్తం = చెప్పబడినది; వస్తుతః = నిజానికి; తులసీ = తులసి; పరా = గొప్పది.

ఒకవైపు సర్వశాస్త్రాలూ, మరొక వైపు తులసి కట్టె. ఈ రెంటిలో శ్రేష్ఠమైనదేదీ అంటే, తులసి అనే చెప్పాలి. (తులసీ మాల ధరించే డాంబికునికి వుండే గౌరవం, సకల శాస్త్ర పారంగతునికి కూడా లభించదు).

**విస్మృతం వాగ్భటేనేదం తులస్యాః పఠతాగుణాన్**
**విశ్వసం మోహినీ విత్తదాయి నీతి గుణద్వయమ్ ॥ (85)**

తులస్యాః = తులసి యొక్క; గుణాన్ = గుణాలను; పఠతా = చెప్పిన; వాగ్భటేన = వాగ్భటుని చేత; విశ్వసం మోహినీ = అందరినీ సమ్మోహితులను చేసేదీ; విత్తదాయినీ = ధనాన్ని సంపాదించేదీ; ఇతి = అని; ఇదం = ఈ; గుణద్వయం = రెండు గుణములు; విస్మృతం = మరవబడినది.

వాగ్భటుడు వైద్య గ్రంథంలో తులసి గుణాలను వర్ణిస్తూ, ఇది ధరించేవారికి ప్రపంచాన్నే వశం చేస్తుందనీ, ధనాన్ని ఇస్తుందనీ రెండు గుణాలను వ్రాయడం మరచిపోయాడు. లేకుంటే తులసి మాల అంటే జనానికెంత విశ్వాసం! ఏమి ఆదరం!

**కౌపీనం భసితాలేపో దర్భా రుద్రాక్ష మాలికా**
**మౌనమేకాసికా చేతి మూర్ఖ సంజీవనానిషట్ ॥ (86)**

కౌపీనం = కౌపీనమూ; భసితాలేపః = విభూతి పూసుకోవడమూ; దర్భా = దర్భలు; రుద్రాక్ష మాలికా=రుద్రాక్షమాల; మౌనం=మౌనము; ఏకాసికా=ఏకాంతంలో ఒంటరిగా కూర్చోవడము; ఇతిషట్=ఈ ఆరూ; మూర్ఖసంజీవనాని=మూర్ఖులకు జీవనోపాయాలు.

గోచీ పెట్టుకోవడం, విభూతి పూసుకోవడం, దర్భలు ధరించడం, రుద్రాక్షలు త్రిప్పడం, మాట్లాడకపోవడం, చోటు కదలకుండా ఒంటరిగా కూర్చోవడం – ఈ ఆరూ మూర్ఖుణ్ణి బ్రతికించే ఉపాయాలు.

**వాసః పుణ్యేషు తీర్థేషు ప్రసిద్ధశ్చ మృతో గురుః**
**అధ్యాపనావృత్తయశ్చ కీర్తనీయా ధనార్థిభిః ॥ (87)**

ధనార్థిభిః = ధనం కోరేవారి చేత; పుణ్యేషు తీర్థేషు = పుణ్య తీర్థ క్షేత్రాలలో; వాసః= నివాసమూ; మృతః=మరణించిన; ప్రసిద్ధః=లోకప్రసిద్ధుడైన; గురుః=గురువు; అధ్యాపనా వృతయశ్చ = అధ్యాపనము యొక్క ఆవృత్తులూ, కీర్తనీయా = చెప్పుకోదగినవి.

ధనం సంపాదింపగోరేవారు, తాము ఎన్నో పుణ్యక్షేత్రాలలో నివసించేవారమని, మరణించిన ఒక ప్రసిద్ధ వ్యక్తి పేరు చెప్పి, ఆయన తమ గురువుగారనీ, చాలామంది ప్రసిద్ధులకు అధ్యాపనం చేశామని, తమ్ము గూర్చి తాము ప్రచారం చేసుకోవాలి.

**మన్త్ర భ్రంశే సంప్రదాయః ప్రయోగశ్చ్యుత సంస్కృతౌ**
**దేశధర్మస్త్వనాచారే పృచ్ఛతాం సిద్ధముత్తరమ్ ॥ (88)**

మన్త్రభ్రంశే=మంత్రంలో తప్పు వచ్చినప్పుడు; పృచ్ఛతాం =అడిగేవారికి; సంప్రదాయం= సంప్రదాయమనీ; చ్యుత సంస్కృతౌ=వ్యాకరణ విరుద్ధమైన పదం విషయంలో అడిగేవారికి; ప్రయోగః = ప్రాచీనకవి ప్రయోగం వున్నదనీ; అనాచారే = అనాచారాన్ని గూర్చి అడిగేవారికి; దేశధర్మః = దేశధర్మమనీ; సిద్ధమ్ ఉత్తరం = సిద్ధంగా చెప్పదగిన జవాబు.

మంత్రాన్ని తప్పుగా చెపుతున్నారేమయ్యా అంటే – ఇదే మా సంప్రదాయం అనాలి. అపశబ్దం చెపుతున్నారంటే అది పూర్వ కవి ప్రయోగమనాలి. అనాచారం చేస్తున్నారంటే అది మా దేశాచారమని అనాలి.

**యథాజానన్తి బహవో యథావక్ష్యన్తి దాతః**
**తథాధర్మం చరేత్సర్వం నవృథా కిఞ్చిదాచరేత్ ॥ (89)**

బహవః = చాలామంది; యథా = ఏ విధంగా; జానన్తి = తెలుసుకుంటారో; యథా = ఏ విధంగా; దాతరి = దాతకు; వక్ష్యన్తి = చెప్పుతారో; తథా ఆ విధంగా; సర్వధర్మం = ధర్మాన్నంతటినీ; చరేత్ = ఆచరించవలెను; వృధా = వ్యర్థంగా; కించిత్ = కొంచెము ధర్మం కూడా; న ఆచరేత్ = చేయకూడదు.

ధర్మమంటూ చేయాల్సి వస్తే పదిమందికీ తెలిసేటట్లు, పదిమందీ దాతను చెప్పుకొనేటట్లు చేయాలి. కాని వృధాగా ధర్మం చెయ్యకూడదు.

**సదాజపపటోహస్తే మధ్యే మధ్యే ఉక్షి మీలనమ్**
**సర్వం బ్రహ్మేతి వాదశ్చ సద్యః ప్రత్యయ హేతవః ॥ (90)**

సదా = ఎల్లప్పుడు; హస్తే = చేతిలో; జపపటః = జపవస్త్రమూ; మధ్యే మధ్యే = మధ్య మధ్య; అక్షినిమీలనమ్ = కళ్లుమూసుకుంటూ వుండటం; సర్వం బ్రహ్మఇతి = సర్వమూ బ్రహ్మమయమని; వాదశ్చ = వాదిస్తూ వుండటమూ; ఇవి, సద్యః ప్రత్యయహేతవః = వెంటనే విశ్వాసం కుదరటానికి హేతువులు.

చేతిలో ఎప్పుడూ జపమాల త్రిప్పుతూ, మధ్య మధ్య కళ్లు మూసుకుంటూ, ''సర్వం బ్రహ్మ'' అని అంటూ వుంటారో, వెంటనే జనం విశ్వసించి చేరుతారు వారి దగ్గర.

**ఆ మధ్యాహ్నం నదీవాసః సమాజే దేవతార్చనమ్**
**సతతం శుచి వేషశ్చే త్యేతద్దమ్భస్య జీవితమ్ ॥ (91)**

ఆ మధ్యాహ్నం = మధ్యాహ్నం వరకూ; నదీవాసః = నది దగ్గరనే వుండి పోవడం; సమాజే = పదిమందిలో; దేవతార్చనా = దేవతార్చన చేయడం; సతతం = ఎల్లప్పుడు; శుచివేషశ్చ=మడిగావుండడము; ఏతత్=ఇది; దమ్భస్య=డాంబికానికి; జీవితమ్=జీవితము.

మధ్యాహ్నం వరకూ నదిలో జపం చేయటం, పదిమంది మధ్యలో దేవతార్చన చేయటం, సదాస్వచ్ఛ వస్త్రము ధరించడం (మడిబట్టలు ధరించడం) డాంబికుని జీవితము.

**తావద్దీర్ఘం నిత్యకర్మ యావత్ స్యాద్ద్రష్టు మేలనమ్ ।**
**తావత్ సంక్షిప్యతే సర్వం యావద్ద్రష్టా నవిద్యతే ॥ (92)**

ద్రష్టుమేలనమ్ =చూచేవాళ్ల గుంపు; యావత్ స్యాత్ =ఎంతవరకూ వుంటుందోతావత్ = అంతవరకూ; దీర్ఘం = దీర్ఘంగా; నిత్యకర్మ = నిత్య కర్మ జరపాలి; ద్రష్టా = చూచేవాడు; యావత్ నవిద్యతే = ఎప్పుడు వుండదో; తావత్ = అప్పుడు; సర్వం = అంతా; సంక్షిప్యతే = సంక్షిప్తం చేయబడుతుంది.

నిత్యానుష్ఠానాన్ని ఆయా పరిస్థితులను బట్టి సరిపెట్టుకోవాలి. చూచేవాళ్లు వున్నంత వరకూ అనుష్ఠానం పొడిగించాలి. చూచేవాళ్లు లేకపోతే సంక్షేపించుకోవాలి (టూకీగా కానిచ్చేయాలి).

**ఆనందభాష్ప రోమాంచౌ యస్యస్వేచ్ఛా వశంవదౌ**
**కిం తస్య సాధనైరన్యైః కింకరాః సర్వపార్థివాః ॥ (93)**

ఆనంద భాష్పరోమాంచౌ = ఆనంద భాష్పము, రోమాంచము; యస్య = ఎవనికి; స్వేచ్ఛావశం వదౌ = తన ఇచ్ఛననుసరించి స్వాధీనంలో వుంటాయో; తస్య = వానికి; అన్యైః =ఇతరమైన; సాధనైః = సాధనములచేత; కిం = ఏమిపని; సర్వపార్థివాః = అందరు రాజులూ; కింకరాః = సేవకులే.

ఆనంద భాష్పాలూ, గగుర్పాటూ ఎవరికి తలుచుకుంటే (వెంటనే) వచ్చి పడతాయో, వారికింక వేరే సాధనములతో పనేముంది ? రాజులంతా వారికి దాసులే.

**దణ్డ్యమానా వికుర్వన్తి లాల్యమానాస్తతస్తరామ్**
**దుర్జనా నామతో న్యాయ్యం దూరాదేవ విసర్జనమ్ ॥ (94)**

దణ్డ్యమానాః = దండింపబడినవారై; వికుర్వన్తి = వికారము చెందుతారు; లాల్యమానాః = లాలన చేయబడినవారై; తతస్తరాం = అంతకంటె ఎక్కువగా వికారము చెందుతారు; అతః = ఆ కారణము వలన; దూరాదేవ = దూరం నుంచే; దుర్జనానాం = దుర్జనుల యొక్క; విసర్జనం = విడచుట; న్యాయ్యం = యుక్తము.

దుష్టులను శిక్షించేకొద్దీ ఎదురు తిరుగుతారు. పోనీ అని లాలించామో ఇక చెప్పే పని చేదు. విఱ్ఱవీగుతారు. కాబట్టి దుర్జనుల్ని దూరంగా విడిచిపెట్టడమే న్యాయం, యుక్తము.

**అదాన మీషద్దానం చ కించి త్కోపాయ దుర్ధియామ్**
**సంపూర్ణదానం ప్రకృతి ర్విరామో వైర కారణమ్ ॥ (95)**

అదానం = దానం చేయకపోవడం; ఈషద్దానంచ = కొంచెము దానము చేయడము; దుర్ధియాం = దుష్టబుద్ధులకు; కించిత్ కోపాయ = కొంచెము కోపానికి హేతువగును; సంపూర్ణ దానం = పూర్తిగా దానం చేయడము; ప్రకృతిః = స్వభావము; విరామః = ఆపి వేయడము; వైర కారణం = తగవుకు మూలము.

అసలే ఇవ్వకపోవడమూ, కొంచెం ఇవ్వడమూ, దుష్టులకు కొంచెం కోపాన్ని కలిగిస్తుంది. పూర్తిగా ఇస్తే వారూరుకొంటారు. అడిగినప్పుడల్లా ఇస్తూ వుండాలి. ఇవ్వక పోతే వైరానికి కారణం ఇన్నాళ్లూ ఇచ్చింది మరచిపోయి పైగా పగబడతారు. ఇప్పుడు వీధికొక రౌడీ, దాదా లేక గూండా తయారయ్యారు.

**జ్యాయాన సంస్తవోదుష్టై రీర్ష్యాయై సంస్తవః పునః**
**అపత్య సంబంధ విధిస్త్వనర్థాయైవ కేవలమ్ ॥ (96)**

దుష్టులతో పరిచయమే కూడదు. ఎందుకంటే ఆ పరిచయం వల్ల కేవలం అసూయయే. ఇక వారి బిడ్డలతో సంబంధం పెట్టుకున్నామా (వారితో వియ్యం పొందితే) అది పూర్తిగా అనర్థాన్ని కొని తెచ్చుకోవడమే – గీతలు, పురాణాలు, నారద భక్తి

సూత్రాలు, నీతి చంద్రికలు – అన్నియూ దుష్టులకు దూరంగా వుండమని బోధిస్తాయి. ప్రతి దినమూ మనము చూస్తున్నాము – ఎందరో మంచివారు దుష్టుల సావాసం వల్ల సర్వ నాశనం అయి పొయ్యారు. అటువంటి వారితో వియ్యం చేయడం ఎన్నో అనర్థాలకు, తుదకు ఆత్మ హత్యలకు, హత్యలకు, ముఠా తగాదాలకు దారితీస్తాయి.

**జ్ఞాతేయం జ్ఞాన హీనత్వం పిశునత్వం దరిద్రతా**
**మిలన్తియది చత్వారి తద్దిశేఽపి నమోనమః ॥ (97)**

జ్ఞాతేయం = జ్ఞాతి వైరమూ; జ్ఞాన హీనత్వం = జ్ఞానము లేకపోవడము; పిశునత్వం = చాడీలు చెప్పడం; దరిద్రతా = దారిద్ర్యము; చత్వారి = ఈ నాలుగూ; మిలన్తియది =ఒక చోట కలిసినట్లైతే; తద్దిశేఽపి=ఆ దిక్కుకు కూడా; నమోనమః=నమస్కారము.

నమస్కారము జ్ఞాతి భావము (వైరము), మూర్ఖత్వము (పిశునత్వము), చాడీలు చెప్పుట, పేదరికం – ఈ నాలుగూ కలిసి ఎక్కడైనా వుంటే ఆ దిక్కుకు ఒక నమస్కారం.

**పరచ్ఛిద్రేషు హృదయం, పరవార్తాసుచశ్రవః**
**పరమర్మసు వాచంచ ఖలానామ సృజ ద్విధిః ॥ (98)**

విధిః = బ్రహ్మ; ఖలానాం = దుష్టుల యొక్క; హృదయం =హృదయాన్ని; పరచ్ఛిద్రేషు = ఇతరులలోపాలతోను; శ్రవః =చెవిని; పరావారాసు = ఇతర విషయాలతోను; వాచం = వాక్కును; పరమర్మసు = ఇతరుల మర్మాలతోను; అసృజత్ = సృష్టించెను.

ఇతరులలోపాలపై మనసు కలిగియుండుట, ఇతరులకు సంబంధించిన వార్తలకు చెవులప్పగించుట, నోరు ఇతరుల రహస్యాలను బైట పెట్టడంలో వుపయోగపడేటట్టు బ్రహ్మ దేవుఁడు దుష్టులకు సృజించి ఇచ్చాడు.

**విషేణ పుచ్ఛలగ్నేన వృశ్చికః ప్రాణినామివ**
**కలినాదశమాంశేన సర్వం కాలోఽపిదారుణః ॥ (99)**

పుచ్ఛలగ్నేన = తోకలో వున్న; విషేణ = విషము చేత; వృశ్చికః = తేలు; ప్రాణినామివ = ఇతర ప్రాణులకు బాధాకరమగునట్లు; దశమాంశేన = పదో అంశగావున్న; కలినా = కలిచేత; సర్వః అపి = సర్వకాలము కూడా; దారుణః = దారుణమైనది.

తోక కొసన ఎక్కడో వున్న విషంతో, తేలు, ఇతర ప్రాణులకు అన్నింటికీ ఎట్లా బాధ కలిగిస్తుందో, అట్లే, మహా యుగంలో పదవ భాగాన్ని ఆశ్రయించుకొన్న కలిలో మహాయుగ మంతా దారుణమైపోయింది.

**యత్రభార్యాగిరోవేదాః యత్రధర్మోఽర్థసాధనమ్**
**యత్రస్వ ప్రతిభావానం, తస్మైశ్రీ కలయేనమః ॥ (100)**

యత్ర = ఎక్కడైతే (దేనియందు); భార్యాగిరః = భార్యల మాటలు; వేదాః = వేదములో; యత్ర = దేనియందు; ధర్మః = ధర్మము; ధనసాధనం = ధనార్జనకు సాధనమో; యత్ర = దేనియందు; స్వప్రతిభా = తన బుద్ధియే; మానం = ప్రమాణమో; తస్మై = అట్టి; శ్రీకలయే = శ్రీ కలికి; నమః = నమస్కారము.

ఏ కలి యుగంలో భార్యల మాటలే వేదాలో, ఏ కలి యుగంలో ధర్మం అంటే ధన సంపాదనకు వుపయోగపడుతుందో, ఏ కలి యుగంలో తన తెలివే పరమ ప్రమాణమో, అటువంటి శ్రీ కలియుగానికి ఒక్క నమస్కారం.

**కామమస్తు జగత్సర్వం కాలస్యాస్య వశంవదమ్**
**కాలకాల ప్రపన్నానాం కాలః కిం నః కరిష్యతి ॥ (101)**

సర్వజగత్ = జగత్తంతా; అస్య = ఈ; కాలస్య = కాలానికి; వశంవదం = వశమైనదై; అస్తు కామం = అయితే అగుగాక; కాలకాలం = మృత్యువుకు కూడా మృత్యువైన (కాలకాలుడు) శివుని; ప్రపన్నానాం = ఆశ్రయించిన; నః = మనకు; కాలః = కాలము; కింకరిష్యతి = ఏమి చేయగలదు.

ఈ ప్రపంచమంతా కాలానికి కట్టుబడి వుంటే వుండనీ, మేము కాల కాలుణ్ణి (కాల నాశకుడైన శివుని) భక్తులం. మమ్మల్ని కాలమేం జేస్తుంది.

**కవినా నీలకంఠేన కలేరేత ద్విడంబనమ్**
**రచితం విదుషాం ప్రీత్యైరాజాస్థానాను మోదనమ్ (102)**

ఇతి శ్రీ నీలకంఠ దీక్షిత విరచితం కలివిడమ్బనం సమాప్తమ్.

రాజాస్థానానుమోదనం = రాజాస్థానాలలో ఆనందకరమైన; ఏతత్ = ఈ; కలిపిడంబనం = కలివడంబనము; (విడంబనం = పరిహాసము); నీలకంఠేన కవినా = నీలకంఠ కవి చేత; విదుషాం ప్రీత్యై = విద్వాంసుల ఆనందం కొరకు; రచితం = రచింపబడినది.

పండితులకు ఆనందం కలిగించేందుకు, రాజాస్థానాల్ని రంజింపజేసే ఈ కలివిడంబనం నీలకంఠ కవిచే రచింపబడినది.

కలివిడమ్బనం సమాప్తము - ఓం తత్సత్.

⌘ ⌘ ⌘

# శ్రీ నీలకంఠ దీక్షిత విరచిత వైరాగ్య శతకము

**అస్తేకశ్చన భిక్షుః సంగృహ్ణన్నవ్యయాని దశ ।**
**నమమేత్యవ్యయ యుగలం యాచామస్తం కిమస్త్యన్యత్ ॥ (1)**

కశ్చన = ఒకానొక; భిక్షుః = భిక్షుడు (పరమేశ్వరుడు) దశ = పది; అవ్యయాని = అవ్యయాలను; సంగృహ్ణన్ = సంగ్రహించుకొని; అస్తే = ఉన్నాడు; నమమ = నాదికాదు; ఇది =అనే; అవ్యయయుగలఠ= రెండు అవ్యయాలను; తం= అతనిని: యాచామః యాచించెదము; అన్యత్= అన్యమైనది; కిమస్తి = ఏమి ఉంది? - ఒకానొక భిక్షువు -పరమేశ్వరుడు - ఉన్నాడు - అతడు జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, తపస్సు, సత్యము,క్షమ; ధైర్యము సృష్టించేశక్తి, ఆత్మసంబోధము, సర్వజగదధిష్ఠాతృత్వము - అనేఎన్నటికీ నశించని ధర్మాలను తనవద్ద ఉంచుకొన్నాడు - అవి అవ్యయములు;నాకు, నమమ = నాదికాదు అనేరెండే అవ్యయాలు ఇస్తే చాలును - మమకారం పోతేవైరాగ్యం కలుగుతుంది. నమమఅనిఅనుకోవడమే మోక్షం; మమఅని అనుకొనుట మరణంః-

**ధీసచివం ధైర్యబలం సంకల్పవిరోధి శాన్తిధనమ్ ।**
**విశ్వత్రయ విషయ మిదం వైరాగ్యం నామ సామ్రాజ్యమ్ ॥ (2)**

ఇదంవైరాగ్యనామసామ్రాజ్యం = ఈ వైరాగ్యమనబడే సామ్రాజ్యము ధీసచివం = బుద్ధియేమంత్రి; ధైర్యబలం=ధైర్యమనేసేన; సంకల్పవిరోధి=. సంకల్పాలనే శత్రువులు కలది; శాంతిధనం= శాంతిఅనేధనముకలది; విశ్వత్రయ విషయం = ముల్లోకాలు విషయముగాకలది.

వైరాగ్యమన బడునది ఒక మహాసామ్రాజ్యం; ముల్లోకాలు దానికి విషయములు, దానికి ముఖ్యమంత్రి బుద్ధి. ధైర్యమే దానిసైన్యము సంకల్పాలు = కోరికలే దాని శత్రువులు. శాంతిఅనేదిధనము :-

**రాజ్ఞోబిభ్యతిలోకా రాజానః పునరితో2పి వైరిభ్యః ।**
**ఆబ్రహ్మణః కృతాన్తాదకుతోభయ మస్పృహా రాజ్యమ్ ॥ (3)**

రాజానః=రాజువలన; లోకాః=లోకులు; బిభ్యతి=భయపడుదురు; రాజానః పునః =మళ్లీఆరాజులే; వైరిభ్యః=విరోధులవలన, ఇతో2పి=ఇంతకన్నను ఎక్కువగా; (భయపడుదురు) ; ఆబ్రహ్మణః=బ్రహ్మనుండి; ఆకృతాన్తాత్=యమునివరకూ;

అస్పృహారాజ్యం=వైరాగ్యరాజ్యము=అకుతోభయం=భయమేలేనిది.

రాజుకు ప్రజలు భయపడుతారు; కానీ ఆరాజేతన శత్రువులకు భయపడుతాడు - వైరాగ్యమనే సామ్రాజ్యంలో సృష్టించిన బ్రహ్మనుచూచికానీ, ప్రాణాలు తీసేయముణ్ణి చూచికానీ, ఎవరూ భయపడవలసిన పనిలేదు.

**భిక్ష ప్రదాజనన్యః పితారోగురవః కుమారకాః శిష్యాః !**
**ఏకాన్తరమణ హేతు ః శాన్తిర్దయితా విరక్తస్య - !! (4)**

విరక్తస్య ః విరక్తునికి; భిక్షప్రదా = భిక్షపెట్టేవారే; జనన్యః = తల్లులు; గురవః గురువులు; పితరః = తండ్రులు; శిష్యాః = శిష్యులు; కుమారకాః = కుమారులు; శాంతిః = శాంతియే ఏకాన్తరమణహేతు ః = ఏకాంత ప్రదేశంలో రమించుటకు హేతువైన; దయితా = ప్రియురాలు;

తాత్పర్యము ః- విరక్తుడుకి భిక్షపెట్టేవారే తల్లులు, గురువులే తండ్రులు - శిష్యులే కుమారులు - ఏకాంత ప్రదేశంలో ఆనందం ఇచ్చే శాంతియే ప్రియురాలు.

**కిమపినయే చేష్టన్తే కార్యప్రతి కార్యయోర్విరహాత్ ।**
**సన్తస్త ఏవముక్తాః సన్దేహేగౌతమః సాక్షీః ॥ (5)**

కార్యప్రతి కార్యయో ః విరహాత్ = క్రియ,దానికి ప్రతి క్రియ, అనేవిలేకపోవడంచేత; యే=ఎవరు, కిమపి = ఏమియు, నచేష్టన్తే = పని చేయరో; తే= అటువంటి; సన్తః ఏవ=సజ్జనులే; ముక్తాః= ముక్తులు; సందేహే = సందేహముంటే గౌతమః = గౌతముడే; సాక్షీ =సాక్షి.

క్రియ, ప్రతిక్రియ అనునవిలేని నైష్కర్మ్యసిద్ధిపొందిన సత్పురుషులే నిజమైన ముక్తులు. ఈ విషయంలో ఎవరికైనా సందేహముంటే గౌతముణ్ణే అడగండి - అతడే సాక్షి గౌతముని న్యాయశాస్త్రం ప్రకారం ఆత్మ అచలము; ఆత్మకు మనస్సుతో సంయోగం కలిగినప్పుడే అదిచైతన్య వంతమవుతుంది. నిర్వికల్ప సమాధి స్థితిలో జడచైతన్యాలకు తావులేదు - అట్టి నైష్కర్మ్యసిద్ధి పొందినవారే ముక్తులుః-

**పతతునభ ః స్ఫుటతు మహీచలన్తు గిరయోమిలన్తు వారిధయః ।**
**అధరోత్తరమస్తు జగత్కా హానిర్వీత, రాగస్య ॥ (6)**

నభః = అకాశము. పతతు = పడుగాక; మహీ=భూమిస్ఫుటతు=బ్రద్దులగుగాక; గిరయః =పర్వతాలు; చలన్తు = కదలిపోవుగాక; వారిధయః సముద్రాలు; మిలన్తు = కలసిపోవుగాక; జగత్=జగత్; అధరోత్తరమస్తు= క్రిందనుంచి పైకిపోవుగాక; వీతరాగస్య= విరాగికి; కాహానిః= ఏమిహాని ? =

ఆకాశం క్రిందపడ్డా, భూమి బ్రద్దలైపోయినా, పర్వతాలు చలించినా, సముద్రాలన్నీ

ఏకమైపోయినా,భూమి తలక్రిందులైనా - వైరాగ్యవంతునికి పొయ్యేది ఏమిలేదు -

**కేచోరా ః - కేపిశునా ః కేరిపవః కేచదాయాదాః ।**
**జగదఖిలంతస్యవశేయస్యవశేహతమిదంచేతః ॥ (7)**

కేచోరాః=దొంగలెవరు? కేపిశునాః=చాడీలు చెప్పేవారెవరు? కేరిపవః=విరోధులెవరు? కేదాయాదాః=దాయాదులెవరు? ఇదం=ఈ, హతం చేతః=పాడు మనస్సు; యస్య=ఎవనికి; వశే=వశమైయుండునో; తస్య=వానికి; అఖిలంజగత్=అఖిలజగత్తు; వశే=వశమై యుండును.

ఈపాపిష్టిమనస్సును ఎవడైతే వశం చేసుకొంటాడో,వానికి ఈజగత్తంతాలోబడి యుంటుంది; వానికి దొంగలులేరు=చాడీలు చెప్పేవారులేరు- శత్రువుల్లేరు. దాయాదుల్లేరుః-

**విషయాఉపతిష్ఠన్తాం విషయైర్వా సమవయన్తు కరణాని ।**
**అన్తరమేకం కరణం శాన్తం యది కాతతశ్చిన్తా॥ (8)**

విషయాః భోగ్యవిషయములు; ఉపతిష్ఠన్తాం=తమంతటతాముగా వస్తేవచ్చుగాక; వా=లేక; కరణాని=ఇంద్రియాలు విషయైః=భోగ్యవిషయాలపై; సమవయన్తు=కలిస్తే కలియుగాక, ఏకం=ఒక్క; అన్తర కరణం=అంతః కరణమైన మనస్సు; శాంతంయది=ప్రశాంతంగా ఉంటే; తతః=తర్వాత; చిన్తా=విచారము; కా=ఏమిటి ? -

భోగ్యవిషయాలు వాటంతట అవిగా వచ్చిపడినా; లేదా ఇంద్రియాలే విషయాలతోచేరినా పరవాలేదు. కానీ చిత్తంమాత్రం ప్రశాంతంగా ఉంటేచాలు - వాటితో ఇది చేరరాదు. ఆపై చింతేలేదు.

**కిం విషయాన్ పరిహర్తుం వస్తవ్యం మేరుకన్దరేష్వబుధైః ।**
**నహ్యద్భిరనాసంతుం పాంసుషు రోహన్తి పద్మాని ॥ (9)**

అబుధైః=అపండితులు; మేరుకన్దరేషు=మేరుపర్వత గుహలలో; విషయాన్= విషయాలను; పరిహర్తుం=పరిహరించుటకై వస్తవ్యంకిం=వసించవలెనా ఏమి? అద్భి ః నీటితో; అనాసంతుం=సంగం లేకుండుటకై; పద్మాని=పద్మములు; పాంసుషు= దుమ్ములో; నరోహన్తిహి=మొలవవుకదా !

శబ్దస్పర్శరూప రసగంధాదులకు దూరంగా ఉండాలని మేరు పర్వత గుహలలో వసిస్తా. మనేవాళ్లు పరమ మూర్ఖులు-నీళ్లకు అంటకుండావుండాలని పద్మాలు బూడిదలో మొలవవు కదా! (తామరాకువలె నీటిలో నే ఉంటూ దానికి అంటకుండావుండుటే యోగము) ః-

**అజ్ఞాన మిహనిదానం ప్రాగ్రూపం జననమేవభవరోగే ।**
**పరిపాకః సంసరణం భైషజ్యం నైష్ఠకీ శాంతిః ॥ (10)**

ఇహ=ఇక్కడ; భవరోగే=సంసారమనే రోగానికి; నిదానం=అసలుకారణం; అజ్ఞానం= అజ్ఞానమేః- జననమేవ=పుట్టడమే; దానికి, ప్రాగ్రూపం=మొదటిదశ, సంసరణం= జననమరణరూపమైన పరిభ్రమణమే; పరిపాకః=పరిపక్వావస్థ; నైష్ఠికీ= నిష్ఠతోకూడిన; శాంతిః =శాంతియే; భైషజ్యం=ఔషధము ః-

ఈలోకంలో ప్రతిరోగానికీ ఏదోఒక కారణముంటుంది దానికొక ప్రారంభదశ, పరిపక్వావస్థఅని ఉంటాయి. ఈ భవరోగానికి మొదటి కారణం అజ్ఞానం - అంటే స్వస్వరూప జ్ఞానం లేకపోవటం. ప్రారంభదశ- జన్మించటమే - అతర్వాత పరిపక్వావస్థ, మరణించడం-తిరిగేపుట్టడం. సంసారం.దీనికి మందు ఏమిటంటే నిష్ఠతోకూడిన శాంతి; స్వస్వరూపాను సంధానమే పరమశాంతిః-

**స్వేనైవభుక్తమర్థం సూకరజాతిస్మరోమనుష్యఇవ ।**
**దూరే జుగుప్సమానోధీరో వైరాగ్యమాద్రియతే ॥ (11)**

సూకరజాతిస్మరః=(తన) పందిజన్మను స్మరించగల మనుష్యఇవ=మానవునివలె; ధీరః=ధీరుడు; స్వనేనైవ=తన చేతనే; భుక్తం=భుజించబడిన; అర్థం=వస్తువును; దూరే=దూరం నుంచే; జుగుప్సమానః=అసహ్యించుకొంటూ; వైరాగ్యం=వైరాగ్యమును; ఆద్రియతే=అదరించును.

ఎవడికైనా పూర్వజన్మస్మృతియుండి, వెనుకటిజన్మలో తానుపందిగా యున్నవిషయం జ్ఞప్తికి వస్తే,వాడుతినే అహారము అమేధ్యమువలెరోత పుట్టిస్తుంది. వానికివలె ధీరుడైన వాడుకూడా తాను అనుభవించిన విషయసుఖాలన్నింటినీ, ఇపుడుతన అందుబాటులో యున్ననూ ఏవగించుకుంటూ వైరాగ్యాన్నేకోరుకుంటాడుః-

ధీరుడు "వికారహేతౌనతి విక్రియంతే షపాంనచేతాంసిత ఏవంధీరాః" అందగత్తెలను, రుచిగలవస్తువులను చూచి ఎవరి మనసుచలించదోవారుధీరులుఅని కాళిదాసుమహాకవి అంటారు.

**శైశవమివకౌమారే తత్తరుణిమ్నివసవృద్ధత్వే ।**
**నస్వదతే ధీరాణాం కామస్యవిచేష్టితం శాన్తె ॥ (12)**

కౌమారే=కౌమారావస్థవచ్చిన తర్వాత; శైశవమివ=శైశవంవలె; తరుణిమ్ని=యౌవనంలో; తత్ఇవ=అ కౌమారమువలె; వృద్ధత్వే=వార్ధక్యంలో; సఇవ=అయౌవనంవలె; ధీరాణాం=ధీరులకు; శాన్తే=శాన్తికలుగగానే, కామస్యవిచేష్టితం=కామప్రవృత్తి; నస్వదతే= రుచింపదు-

తాను శైశవా వస్థలో చెసిన పనులను తలచుకొని కౌమారావ్యస్థలో నచ్చడు. యౌవనం వచ్చేప్పటికి కామారావస్థలో చేసిన కార్యాలను ఏవగించుకొంటాడు. వార్ధక్యం వచ్చేసరికి యౌవనంలో చేసిన పనులనునచ్చడు. వైరాగ్యస్థితిలోకివచ్చి, పరమశాంతి స్థితిని చేరుకొనిన ధీరులకు కామ ప్రవృత్తులన్నింటినీ ఏవగించుకొంటాడు. " ధీరాస్తు ధైర్యేణతరన్తిమృత్యుం". ఇంద్రియనిగ్రహముగల ధీరులు మృత్యువును ధైర్యంగా దాటెదరు సనత్సుజాతీయము.

**శతశః పరీక్ష్యవిషయాన్ సద్యోజహతిక్వచిత్క్వచిద్ధన్యాః ।**
**కాకాఇవ వాన్తాశనమన్యేతానేవ సేవన్తే ॥ (13)**

క్వచిత్క్వచిత్= అక్కడక్కడ ఉండే; ధన్యాః ధన్యాత్ములు; విషయాన్=విషయ సుఖములను; శతశః అనేకవిధములుగా పరీక్ష్య= పరీక్షించి; సద్యః=వెంటనే; జహతి= వదలిపెడతారు. కాకాఃకాకులు; వాన్తాశనమివ=వాంతిచేసిన ఆహారాన్నివలె; అన్యే=మరి కొందరు; తానేవ=అవిషయాలనే; సేవన్తే=సేవిస్తారు.

నూటికో, కోటికోబహుఅరుదుగా ఉండేకొందరు ధన్యాత్ములు విషయాలను అనేక విధాలుగా పరీక్షించి వెంటనే పరిత్యజిస్తారు. విషయాలు విషమువంటివని తెలుసుకొంటారు.అయితే ఇతరులు మాత్రం - క్రక్కిన కూటినితినేకాకులవలె - అవిషయాలను అనుభవిస్తూంటారు.

**చరమౌమాతాపితరౌ చరమాగృహిణీసుతాశ్చరమా ః ।**
**కర్తవ్యే2 తిప్రేమణి కథమిహధీరావిరజ్యన్తే ॥ (14)**

మాతాపితారౌ=తల్లితండ్రులే; చరమౌ=చివరివారు; గృహిణీ=భార్య; చరమా=చివరిది; సుతాః=కొడుకులు కూతుళ్లు; చరమాః=చివరివారు; అతిప్రేమణి=మిక్కిలి ప్రేమ; కర్తవ్యే= చేయదగినదైయుండగా; ధీరాః=ధీరులు; ఇహ=వీరివిషయంలో; కథం=ఎట్లు; విరజ్యన్తే=వైరాగ్యంపొందగలుగుచున్నారు?

శ్రేయస్సు ప్రేయస్సు అనురెంటిలోనూ. ధీరులైనవారు శ్రేయస్సునేకోరుకొంటారు. అనికఠోపనిషత్తు చెప్పుచున్నది. ధీరులైనవారికిది తుదిజన్మయే. ఈచివరి జన్మదాతలైన తల్లిదండ్రులూ, చివరిదైనభార్య, కొడుకులు కూతుళ్లూ-వీరినందరిని ప్రేమగా చూడాలి. అయిననూ వీరి విషయంలోకూడా ఇంతటి వైరాగ్యాన్ని ధీరులైనవారు ఎలాచూప గలుగుతున్నారో -చాలా ఆశ్చర్యం.వారికి తమ దేహాభిమానాన్ని, నేను, నాది అనబడు అహంకారమమకారాల్ని వదలినవారు. ఈబంధువు లందరూ బంధకారకులే,ధీరులు బంధాల్ని త్రెంచుకొన్నవారు. వీరికి ఎవరిపైనా ప్రీతీలేదు-ద్వేషమూలేదు.

**తృణవద్భ్రమన్తి చపలాః స్త్రీనామని చణ్డమారుతే చలితే ।**
**ధరణీధరా ఇవసన్త స్త్రతనకించి త్ప్రకమ్పన్తే ॥ (15)**

స్త్రీనామని చండమారుతే=స్త్రీఅనేపేరుండేప్రచండవాయువు చలితే=వీస్తే; చపలాః చపలచిత్తులు; తృణవత్= గడ్డిపోచవలె భ్రమన్తే= సుళ్లుతిరిగిపోతారు.సన్తః= సత్పురుషులు; ధరణిధరా ఇవ= కొండలవలె; కించిత్ నప్రకమ్పన్తే=కొంచెంకూడ చలించరు.

ఆడది ఒకసుడిగాలి-అదివీచిందంటే నిలకడలేని స్వభావంగల వాళ్లు గడ్డిపరకకొట్టుకు పోయినట్లు పోతారు.అదేసత్పురుషులు కొండలవలెకొంచమైనా చలించరు.

**కామిజన పరమభోగ్యేకామసుఖేధారయన్తిభీభత్సమ్ ।**
**సన్తఃశమసుఖరసికాః సుధాశనాః సూకరాన్నఇవ ॥ (16)**

సుధాశనాః అమృతాన్నిభుజించే వారు; సూకరాన్నేఇవ= పందితినే , పెంటవలె; శమసుఖరసికాః=శమసుఖాసక్తులైన; సన్తః=సత్పురుషులు; కామిజనపరమ భోగ్యే= కాముకులచే ఎక్కువగా భోగింపదగిన; కామసుఖే = కామసుఖమునందు; భీభత్సం= జుగుప్సను; ధారయంతి=ధరింతురు.

పందులు పెంటను ప్రీతిగాతింటాయి. అమృతాన్ని తినేవారు దాన్ని ఏవగించు కొంటారు. అదేవిధంగా, కాముకులుకామసుఖాన్ని ప్రీతితో కోరుకొంటారు సత్పురుషులు మాత్రం ఆవిషయంలో రోతగలిగి యుంటారు దాని బోలికి పోరు.

**విక్షేపమాత్రభాజోవికాసకాష్ఠాగత జ్ఞానా ః ।**
**స్వస్యాపి చేష్టితాని స్వయమీక్షన్తే పరస్యేవ ॥ (17)**

విక్షేపమాత్రభాజః = విక్షేపంమాత్రంపొందుతూండే; వికాసకాష్ఠాగత జ్ఞానాః వికాసము పరాకాష్ఠ నందుకొనిన జ్ఞానము కలసత్పురుషులు స్వస్యచేష్టితాన్యపి - తమ చేష్టలను కూడా; పరస్యేవ=పరులచేష్టలనువలె; స్వయం=తామే=ఈక్షన్తే=చూచెదరు.

మహామహాజ్ఞానులుకూడా అప్పుడప్పుడు విక్షేప మనగా, మాయ, దానిలో పడిపోతారు. అయితే వారు తమ చేష్టలను గమనించుకొంటూ, ఇతరుల పనులను విమర్శించినట్లే తాముకూడా ఆత్మవిమర్శచేసుకొని, అవిక్షేపాన్ని తొలగించుకొంటారు.

**అస్థానే2 భినివిష్టాన్ మూర్ధానస్థాన ఏవ సన్తుష్టాన్ ।**
**అనువర్తన్తేధీరాః పితర ఇవ క్రీడతోబాలాన్ ॥ (18)**

ధీరాః=ధీరులు; అస్థానే=అనవసరమైనప్పుడు; అభినివిష్టాన్=మొండిపట్టుదలగల వారూ; అస్థాన ఏవ= అనవసరంగానే; సంతుష్టాన్=సంతోషించేవారునూ అయిన;

మూర్ఖాన్=మూర్ఖులను; పితరః=తండ్రులు; క్రీడతః=ఆడుకొనుచున్న; బాలానివ= బాలురనువలె; అనువర్తన్తే=అనుసరించెదరు.

మూర్ఖులదిమొండిపట్టు=చిన్నవిషయాలకే సంతోషిస్తూ ఉంటారు. వారిది బాలురు చేసే చేష్టలు; బిడ్డలపనులను తండ్రులు అమోదిస్తూ వారి ప్రకారమేనడుచు కొంటూం టారు . అదే విధంగా ధీరులు మూర్ఖుల ఎడ ఉదాసీనంగా ఉంటూ, వారిపనులను తొలగ ద్రోసుకొని పోతూంటారు.

**పుష్ణతి పురుషే సలిలైర్ముష్ణతి పుష్పంఫలంచ తరవ ఇవ ।**
**వర్తన్తే సన్తః సమముపకర్తరి చాపకర్తరిచ ॥ (19)**

సలిలై : నీరుపోసి; పుష్ణతి = పోషించుచున్న; పురుషే = పురుషుని విషయంలోనూ; పుష్పంఫలంచ = పూలనుపండ్లను; ముష్ణతి=దొంగిలించువాని యందునూ; తరవ ఇవ= చెట్లువలె; సన్తః=సత్పురుషులు; ఉపకర్తరి= ఉపకారంచేసిన వారి యందునూ; అపకర్తంచ =అపకారం చేసినవారియందునూ; సమం=సమంగా; వర్తన్తే=ప్రవర్తించెదరు.

నీరుపోసి పెంచి పెద్ద చేసిన వానియందునూ, పూలను పండ్లనూ, దొంగలించిన వానియందునూ చెట్లు ఒకే విధంగా వుంటాయి - అట్లే సత్పురుషులు ఉపకారంచేసిన వారి యందు కృతజ్ఞత; అపకారంచేసిన వారియందు ద్వేషమూ లేక సమ బుద్ధి కలిగి యుంటారు.

**నిత్యానిత్యవివేకః సర్వేషాం ఘటమటత్వయోరాస్తే ।**
**సవివేకోయః శాన్తికృదవివేకో2న్యః సమస్తో2పి ॥ (20)**

సర్వేషాం=అందరిలోనూ, ఘటమటత్వయోః=ఘటమటత్వాదుల విషయంలో; నిత్యానిత్య వివేకః=నిత్యానిత్య వివేకము, అస్తే=ఉన్నది; యః=ఏది; శాన్తికృత=శాంతిని కలిగించునో; సః=అదియే, వివేకః=వివేకము; అన్యః సమస్తా2పి=మిగిలినదంతా; అవివేకః=అవివేకమే

సాధన చతుష్టయాలలో మొదటిది నిత్యానిత్య వస్తు విచారం : ఏది నిత్యమైనదియో, ఏది అనిత్యమైనదో తెలుసుకొనుట : ఘటము అనిత్యము; ఘటత్వం నిత్యము; అట్లే మనుష్యుడు అనిత్యుడు. మనుష్యత్వం శాశ్వతమైనది. ఈ విషయం అందరికీ తెలుసు - ఈ చర్చల వల్ల వృధా కాలక్షేపమే - శాంతిని కలిగించే వివేకమే నిజమైనది. మిగిలినవన్నియు అవివేకమే.

**"ఘటోవా మృత్పిండోప్యణురపిచధూమోగ్నిరచలః ।**
**పటోవా తంతుర్వాపరిహారతికిం ఘోరశమనం ।**

**వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా ।**
**పదాంభోజం శంభోర్భజ పరమ సౌఖ్యం వ్రజసుధీః" ॥**
అని శంకర భగవత్పాదుల వారు శివానందలహరిలో చెప్పిరి.

**అనధిగతే కామసుఖేకాలేన యథా ప్రవర్తతే తరుణః ।**
**ఏవంబ్రహ్మ సుఖే2పి ప్రవర్తతే కో2పి భాగ్యవశాత్ ॥** (21)

తరుణః=యువకుడు, అనధిగతే=ముందెన్నడూ అనుభవించని; కామసుఖే= కామసుఖంలో, యథా=ఏవిధంగా; కాలేన=కాలక్రమంలో; ప్రవర్తతే= ప్రవర్తించు చున్నాడో; ఏవం=అదే విధంగా; కో2పి=ఎవడో ఒకడు; భాగ్యవశాత్=అదృష్టం వల్ల; బ్రహ్మ సుఖే= బ్రహ్మానందంలో; ప్రవర్తతే=ప్రవర్తించును.

దేనికయినా కాలం రావాలి. అంతకుముందెన్నడూ అనుభవించని కామసుఖాన్ని యౌవనం రాగానే అనుభవిస్తాడు. అదే విధంగా అదృష్టం కలిసివస్తే ఏ ఒక్కడికో బ్రహ్మ సుఖం అనుభవంలోకి రానే వస్తుంది.

**పుత్రగుణాః స్వాతన్త్ర్యేదారగుణాశ్చాధివేదనావసరే ।**
**భ్రాతృగుణా దాయవిధౌ ద్రష్టవ్యామోక్ష్యమాణేన ॥** (22)

పుత్రగుణాః=పుత్రుని గుణాలు; స్వాతంత్రే=వానికి స్వతంత్రం వచ్చినపుడు; దారగుణాశ్చ=భార్య గుణాలు; అధివేదనావసరే=రెండవ భార్యను వివాహమాడేఅప్పుడు; భ్రాతృగుణాః= సోదరుని గుణాలు; దాయవిధౌ=భాగాలుచేసుకొని వేరుపొయ్యేప్పుడు; మోక్షమాణేనః=మోక్షాన్ని ఆకాంక్షించేవాడు; ద్రష్టవ్యాః=చూడదగినవి -

కొడుకుపెద్దవాడై స్వతంత్రుడైనప్పుడూ, భార్యనిజస్వరూపం రెండోభార్యను పెండ్లి చేసుకొనేప్పుడూ, సోదరుడు భాగాలు పంచుకొని వేరు పడిపోయ్యేప్పుడు వాళ్ల అసలు గుణాలు బైటపడుతాయి.మోక్షకామి అయినవాడు మనకు అతిదగ్గరవాళ్లనో ఇటువంటి గుణాలు ఎట్లా ఉంటాయో తెలుసుకొంటే వైరాగ్యం దానంతట అదేకలుగుతుంది.

**కామేగతిరితి పృచ్ఛతి చరమ శ్వాసే2పియః స్వార్థమ్ ।**
**తస్వజనస్యాపికృతే పాపాః పాపాని కుర్వన్తి** (23)

యః=ఏ బంధుజనము; చరమశ్వాసే2పి=చివరిశ్వాసవదిలేప్పుడుకూడా; మేకాగతి ఇతి= నాగతేమిటి అని; స్వార్థం=స్వార్థంతో; పృచ్ఛతి=ప్రశ్నిస్తున్నారో; తస్యజనస్యాపికృతే= ఆజ్ఞనంకోసం కూడా; పాపాః=పాపాత్ములు; పాపాని=పాపములను; కుర్వన్తి= చేయుచున్నారు.

దించిదిగవబెట్టిన,చావసిద్ధంగావున్నవాడిపైబడిమొత్తుకొంటారు బంధుబత్రులందరూ

"మాగతేంకావాలి" అనిఏడుస్తారు. అటు వంటిస్వార్థపరులకోసం పాపాత్ములు పాపాల్ని చచ్చేవరకూ చేస్తూనే ఉంటారు.

**పితృభిఃకలహాయన్తే పుత్రానధ్యాపయన్తి పితృభక్తిమ్ ।**
**పరదారానుపయన్తః పఠన్తి శాస్త్రాణి దారేషు ॥ (24)**

పితృభిః=తండ్రులతో; కలహాయన్తే=కలహిస్తూంటారు; పుత్రాన్=కొడుకులకు; పితృభక్తిం=పితృభక్తిని; అధ్యాపయాన్ని= భోధిస్తూంటారు; పరదారాన్=ఇతరుల భార్యలను; ఉపయన్తః= పొందుతూ; దారేషు=తమభార్యలకు; శాస్త్రాణి=శాస్త్రాలను, పఠన్తి=చదువుతూంటారు

తాముతమతండ్రులతో తగరారుపడుతూవుంటారు -కానీతమబిడ్డలకు పితృభక్తి బోధిస్తుంటారు; తామేమోపరాయి వారి బార్యలతో బంధం పెట్టుకొంటారు కానీ తమభార్యలకు పతివ్రతా ధర్మాలు నూరిపోస్తూంటారు.

**శాన్తిరలభ్యాదుపరతి రపాత్ర భావః ప్రతిగ్రహనివృత్తి : ।**
**క్షాన్తిర్దుర్బలతేతిచనివృత్తి ధర్మాః కలావేతే ॥ (25)**

అలభ్యాత్ =దొరకనివస్తువును గూర్చి; ఉపరతిః విరమించుకొనుటే; శాన్తి : శాంతి; అపాత్రభావంః= అపాత్రుడుకావటంవల్లనే; ప్రతిగ్రహనివృత్తిః= అపరిగ్రహమనే నివృత్తి ధర్మము; దుర్భలతా=దౌర్బల్యమే; క్షాన్తిః=ఓర్పు; ఇతి=ఈమాదిరి ఏతే=ఇవి; కలౌ=కలియుగంలో; నివృత్తి ధర్మాఃనివృత్తి ధర్మములు.

ఈకలియుగంలోన్నివృత్తి ధర్మాలు కలిగినవారున్నారు వారికి శాంతి, అపరిగ్రహము; క్షమ ఉన్నయి కానీవాటికారణాలు వేరు వారికి ఏదీదొరకదు, ఆశ లేనందునశాంతి, వీడు పరమచండాలుడు. వీడికెవ్వరు ఇవ్వరు=అందుచే అపరిగ్రహము, వీడు అశక్తుడు-ందు చేత క్షమ.

**నీతిజ్ఞా నియతిజ్ఞా వేదజ్ఞా అపిభవన్తి శాస్త్రజ్ఞాః ।**
**బ్రహ్మజ్ఞా అపిలభ్యాః స్వాజ్ఞానజ్ఞానినో విరలాః ॥ (26)**

నీతిజ్ఞాః=నీతి తెలిసినవారూ; నియతిజ్ఞాః=నియతి తెలిసినవారూ; వేదజ్ఞాః=వేదాలు తెలిసివవారూ; శాస్త్రజ్ఞాఃఅపి=శాస్త్రం తెలిసిన వారు కూడా; భవన్తి=ఉంటారు; బ్రహ్మజ్ఞాఃఅపి= బ్రహ్మజ్ఞానులు కూడా; లభ్యాః=దొరుకుతారు; స్వాజ్ఞాన జ్ఞానినః=తమ అజ్ఞానం తెలిసినవారు; విరలాః=చాలా తక్కువగా ఉంటారు.

నీతిని తెలిసివారూ; నియతిని=దైవనియతిని తెలిసినవారూ, వేదాలను తెలిసినవారు, చివరకు బ్రహ్మాన్ని తెలిసిన వారు లభ్యమయ్యేదరు. కానీ, తమకున్న అజ్ఞానాన్ని తెలిసిన

వారు చాలా అరుదుగా వుంటారు.

**కలికలుషే మనసి స్వే కథమివజగదార్జవం లభతామ్ ।**
**చక్షుర్దోషే జాగ్రతి చాన్ద్రం ద్విత్వంకుతో యాతు ॥ (27)**

స్వేమనసి=తనమనస్సు, కలికలుషే=కలికాలపుకల్మషముతో నిండియుండగా జగత్=జగత్తు; కథమివ=ఎట్లు; ఆర్జవం=ఋజుత్వాన్ని; లభతాం=పొందగలదు? చక్షుర్దోషే= కంటిజబ్బు; జాగ్రతి=ఉంటూండగా; చాంద్రం=చంద్రునియొక్క ద్విత్వము= రెండుగా కనబడుట, కుతః=ఎట్లు; యాతు=పోవును.

తనమనస్సులోనే కలికల్మషాలన్నీ ఉంచుకొని జగత్తు సక్రమంగా లేదంటే ఏమిన్యాయము? నేత్రదోషంతో ఒక చంద్రుడు రెండుగాకనబడితే, అదిచంద్రుని దోషమా?-

**విషయానను కూలయితం విషయిణి హృదయేవిధీయతాం ।**
**యత్నః దృశిదేయమౌషధం కోదృశ్యేదత్వాకృతీ భవతి ॥ (28)**

విషయాన్=విషయాలను (శబ్దాదివిషయములు) అనుకూలయితుం అనుకూలముగా చేసుకొనేందుకు; విషయిణి=విషయి అయిన (విషయాలను గ్రహించేశక్తిగల), హృదయే=హృదయమునందు; యత్నః=ప్రయత్నము, విధీయతాం=చేయబడుగాక! దృశి=కంటికి; దేయం=ఇవ్వవలసిన; ఔషధం=మందును; దృశ్యే=దృశ్యపదార్థమునకు; దత్వా=ఇచ్చి; కః=ఎవడు?; కృతీభవతి=కృతార్థుడుగును?

శబ్దస్పర్శ రూప రసగంధారులయందే దోషములూ లేవు. వాటిని మనకు అనుకూలంగా ఉండునట్లు చేసుకోవాలంటే మనహృదయాన్ని నిర్మలంగా ఉంచుకొనుటకు ప్రయత్నించాలి. దృశ్యవస్తువులు సరిగా కనిపించకపోతే కంటికి చికిత్స చేసుకోవాలే తప్ప ఆ కనబడని వస్తువులకు ఏదో చికిత్స చేస్తానంటే ఆ ప్రయత్నం సఫలమవుతుందా?

**దారాః పుత్రేషురతాః పుత్రాః పితృధన పరిగ్రహవ్యగ్రాః ।**
**రోదన శరణా జననీ పరలోక గతస్యకోబన్ధుః ॥ (29)**

దారాః=భార్య; పుత్రేషురీతాః=కొడుకులపై ఆశపెట్టుకొంటుంది; పుత్రాః=కొడుకులు; పితృధనపరిగ్రహవ్యగ్రాః=తండ్రి ధనాన్ని పంచుకోవటంలో ఉంటారు; జననీ=తల్లి; రోదన శరణా=పుత్రశోకంతో పడివుంటుంది. పరలోకగతస్య=చనిపోయిన వానికి; బన్ధుః=చుట్టము; కః=ఎవరు?

వీడుపరలోక గతుడైతేః- భార్య తన ఆశలన్నీ కొడుకులమీదకి మళ్లించుతుంది.

కొడుకులేమో ఆస్తిని పంచుకోవడంలో ఉంటారు. తల్లి ఏమో కొడుకుపోయినందుకు దుఃఖమే శరణమనుకొంటుంది. ఇక వానికి బంధువులెవరుంటారు. ఎవరిదారివాళ్లది. వీణ్ణి అనుకొనే వాడేవుండడు.

**పశ్యన్తి మ్రియమాణాన్ మరిష్యతో2ను మిమతేస్మరన్తిమృతాన్ ।**
**కథయన్తి చైవ మసకృచ్చేష్టన్తే నిత్యవత్తుపరమ్ ॥ (30)**

మ్రియమాణాన్=మరణిస్తూన్నవాళ్లను; పశ్యన్తి =చూస్తూఉంటారు; మరిష్యతః=చావబొయ్యేవాళ్లను; అనుమిమతే=ఊహిస్తుంటారు; మృతాన్=మృతిచెందినవారిని; స్మరన్తి=స్మరిస్తారు; ఏవం=ఈవిధంగా; అసకృత్= మాటిమాటికి; కథయన్తి=చెపుతూంటారు; పరంతు=కానీ; నిత్యవత్=నిత్యమైనవారువలె; చేష్టన్తే=ప్రవర్తిస్తూంటారు;
చనిపొయ్యేవారిని చూస్తూనే ఉంటారు. ఎవరెవరు చావడానికి సిద్ధంగా వున్నారో వాళ్లను లెక్కబెడుతుంటారు. చనిపోయినవారిని అనుకొంటూనే ఉంటారు. కానీ తాము మాత్రం కలకాలం ఉంటామనే నమ్మకం కలిగి ప్రవర్తిస్తూంటాముః-

**కలహాయన్తేమూఢాః కః ప్రతిభూః శ్వః ప్రభాత ఇతి ।**
**తస్యామేవరజన్యాంకః ప్రతిభూః స్వస్యసత్తాయామ్ ॥ (31)**

శ్వఃప్రభాతే=రేపుప్రొద్దుట; కఃప్రతిభూః=ఎవరుహామీ ఉంటారు?; ఇతి=అని; మూఢాః= మూఢులు; కలహాయన్తే=కలహిస్తూంటారు, తస్యాంరజన్యామేవ=ఆరాత్రియందే; స్వస్యసత్తాయం=తన ఉనికి విషయంలో; ప్రతిభూః=హామీ; కః=ఎవరు?
"దీనికి రేపుప్రొద్దున ఎవరు హామీవుంటారు"? అనిమూఢులు తగవులాడుకొంటూవుంటారు. అసలు రాత్రికి వీడు ఉంటాడో, పోతాడో అని చెప్పడానికి ఎవరు జవాబుదారీ ఉంటారు? ఎవరికెరుక?

**ఆ ప్రపదమాశిరస్పదమన్త ః కలిమలమలీమసే వపుషి ।**
**విఫలం గఙ్గాజలమపి మద్యఘటే దర్భముష్టిరివ ॥ (32)**

ఆప్రపదం=పాదాలనుండి; ఆశిరస్పదం=శిరస్సువరకు; అంతః=లోపల; కలిమల మలీమసేసతి=కలి యొక్క మాలిన్యంచేత మలినమైనదగుచుండగా; వపుషి=శరీరము; గంగాజలమపి=గంగాజలంకూడా; మద్యఘటే=కల్లుకుండలో; దర్భముష్టిరివ= పిడికెడు దర్భల కట్టవలె; విఫలం= వ్యర్థము.
నఖశిఖ పర్యంతం లోపలకూడా ఆ శరీరంలో కలిమాలిన్యంతో నిండియుండగా- దానిని గంగాజలంలో ముంచితే మాత్రం పవిత్రతను పొందుతుందా? కల్లుకుండలో పిడికెడు దర్భలను వేసినంత మాత్రాన అది పవిత్రమవుతుందా?

**దండ్యం యత్సుఖ హేతోః పుష్ణంతి జనాః కథం తదేవవపుః ।**
**నహిశర్కరాభిలాషిభిరిక్షోః కాణ్డాని పూజ్యన్తే ॥ (33)**

యత్=ఏశరీరము; సుఖహేతోః=శాశ్వత సుఖముకొఱకు; దండ్యం=దండింప దగినదైయున్నదో, తదేవ వపుః=ఆ దేహాన్నే; జనాః=జనులు; కథం=ఎందువలన; పుష్ణంతి=పోషిస్తారో!; శర్కరాభిలాషిభిః=చక్కెరకావలయుననుకొనువారిచేత; ఇక్షోః కాండాని=చెరుకుగడలు; నపూజ్యన్తేహి= పూజింపబడవుకదా !

అక్షయసుఖాన్నిపొందాలంటే ఈ దేహాన్ని తపింపచేయాలి. సుఖాలకు మరపరాదు. ఈ దేహాన్ని ఆవిధంగా ఎందుకుపోషిస్తారోతెలీదు. "చెరుకాచెరుకాబెల్లంపెడుతావా" అంటే ఇస్తుందా ? దాన్నిగానుగలో వేసిపిండాలికదా!

**కుల్యాఃకృతావిశాలాః కుడ్యాన్యుపలైర్నిబద్ధాని ।**
**క్రీతాబలినో మహిషాఃకృతకృత్యాః స్మఇతిమన్యన్తే ॥ (34)**

కుల్యాః=కాలువలు; విశాలాః విశాలముగా; కృతా=చేయబడినవి; కూడ్యాని=గోడలు; ఉపలైః=రాళ్లతో; నిబద్ధాని=బిగించబడినవి; బలినః=బలంగల; మహిషాః=దున్న పోతులు; క్రీతాః=కొనబడినవి; కృతకృత్యాస్మ=కృతార్థులమైతిమి; ఇతి=అని; మన్యంతే= తలుస్తుంటారు.

పంటకాల్వలను బాగా వెడల్పు చేసుకొన్నాము. గనిమెలు, గట్లను గట్టిగా రాళ్లతో బిగించినాము. మంచి బలమైన దున్నపోతులను కొన్నాము. ఇంకేం మనపంట పండి పోతుందనుకొనే వాళ్లెందరోకలరు. ఇవి ముఖ్యమే, కానీ చేయాల్సిన కృషి ఎంతో ఉంది, వాతావరణం అనుకూకంగాఉండాలి, భగవంతునిదయ ఉండాలి.

**ప్రాయోముహ్యతి చేతఃప్రాణభృతః ప్రాణనిర్గమావసరే ।**
**పుణ్యేనయది నముహ్యతి పుత్రానేవస్మరన్ మ్రియతే ॥ (35)**

ప్రాయః=సాధారణంగా; ప్రాణనిర్గమావసరే=ప్రాణప్రయాణసమయంలో; ప్రాణభృతః=జీవునియొక్క; చేతః=చిత్తము, ముహ్యతి=మోహంలోపడిపోతుంది; పుణ్యేన=పుణ్యంవలన; నముహ్యతియది=మోహంచెందకపోతే; పుత్రానేవ=పుత్రులనే; స్మరన్=స్మరిస్తూ; మ్రియతే=మరణించును ః-

సాధారణంగా ప్రాణాలు పొయ్యేప్పుడు మానవులకు స్మృతి తప్పిపోతుంది. చేసిన కొద్దిపాటి పుణ్యంవల్ల కొంత తెలివి ఉంటే కొడుకులను స్మరిస్తూప్రాణాల్ని వదులుతారు. "ఏఏ వాటిని స్మరిస్తూ కళేబరాన్ని వదలుతాడో, ఆభావాలతోనే మరుజన్మలో జన్మించును" అని గీతలో భగవంతుడు చెబుతాడు - జడభరతుడు ఆ జింకను స్మరిస్తూ

మరణించెను- మరుజన్మలో జింకగానే పుట్టెను.

**శమయితుమౌదరమగ్నిం సంసారే సాగరే నిమజ్జన్తిః ।**
**తుహినవ్యధానివృత్త్యైః నహివేశ్మని పావకోదేయః ॥** (36)

ఔదరమగ్నిం=జఠరాగ్నిని; శమయితుం=కాంతింపచేసుకోనుటకు; సంసారేసాగరే= సంసారసముద్రంలో; నిమజ్జన్తి=మునుగుచున్నారు; తుహినవ్యధానివృత్త్యైః=చలి బాధ తీర్చుకొనుటకు; వేశ్మని=ఇంటిలో; పావకః=అగ్ని; నదేయంహి=ఇవ్వ తగినది కాదు కదా!

ఆకలి మంటలను తీర్చుకొనేదానికి సంసారసాగరంలో మునుగుతూ వుంటారు. అదిఎలావుందంటే, చలి బాధ తీరాలంటే ఇంటికి నిప్పుపెట్టుకొన్నట్లుంది. అది మంచిది కాదు కాదా !

**అర్థానామధికానాంరాజ్ఞాచోరేణవా ధ్రువోనాశః ।**
**అన్నే ఖల్వతి భుక్తే వమనం వాస్యాద్విరేకోవా ॥** (37)

అర్థానామధికానాం=మిక్కిలి ధనము యొక్క; నాశః=నాశము; రాజ్ఞా=రాజువల్లగానీ; చోరేణవా=దొంగచేతకానీ; ధ్రువః=తప్పకజరుతుంది; అన్నే=అన్నము; అతిభుక్తే= ఎక్కువగా తినబడినచో; వమనంవా=వాంతిగానీ; విరేకోవా=విరేచనముగాని; స్యాత్ఖలు=అగునుకదా!

ధనం అధికంగా ప్రోగుచేసుకొనినాడంటే ఆ ధనాన్ని రాజుగానీ, దొంగగానీ తప్పక ఎత్తుకొనిపోతారు. అది తప్పదు - ఎక్కువగా అన్నాన్ని తింటే అది వాంతి అయినా అవుతుంది. కాకపోతే విరేచనమైనా అవుతుంది.

**ఆహృత్య పరిత్యక్తాజనయన్త్యర్థాః సుఖాభాసమ్ ।**
**అత్యంత పరిత్యక్తాః పరమానన్దాయ కల్పన్తే ॥** (38)

ఆహృత్య=సంపాదించి ప్రోగుబెట్టి; పరిత్యక్తాః=ఖర్చుపెట్టబడిన; అర్థాః=ధనములు; సుఖాభాసం=సుఖాభాసం; జనయన్తి=కలిగిస్తాయి; అత్యన్తపరిత్యక్తాః=పూర్తిగా పరిత్యజించబడిన ధనములు; పరమానందాయ=పరమానందాన్ని కలిగించుటకు; కల్పన్తే=సమర్థమవుతాయి.

బాగా సంపాదించి బాగా ఖర్చు పెట్టితే అదొక ఆనందంగా కనిపించవచ్చును. అసలు సంపాదించడమూ లేదు, ఖర్చుపెట్టుటాలేదు - అర్థమనర్థం భావయనిత్యం - దానిని విడిచిపెట్టితే పరమానందం.

**ప్రణమతి పరిసాన్త్వయతి ప్రలపతి యాచతి పరిభ్రమతి ।**
**అనిష్టఇవ పిశాచ్యా పురుషస్తృష్ణావశంయాతః ॥** (39)

తృష్ణావశంయాతః=ఆశకు లొంగిపోయిన; పురషః=పురుషుడు; పిశాచ్యాఆవిష్టః= దెయ్యంపట్టినవానివలె; ప్రణమతి=దండాలు పెడతాడు; పరిసాన్త్వయతి=బ్రతిమాలుతాడు; ప్రలపతి=వదరుతాడు; యాచతి=యాచిస్తాడు; పరిభ్రమతి=దేశ దేశాలు తిరుగుతాడు.

ఆశకు లొంగిపోయిన వ్యక్తి దెయ్యం పట్టిన వానివలె దండాలు పెడతాడు. బ్రతిమాలు కొంటాడు - వాడిష్టంగా మాట్లాడుతాడు - అడుక్కొంటాడు. దేశాలన్నింటినీ తిరుగుతాడు. - "ఆశాయై దాసాయైతే సర్వలోకస్య। ఆశాదాసీ యేషాంతేషాం దాసాయతేలోకః"=ఆశకు దాసుడైన వాడు లోకానికే దాసుడు - ఆశను దాసిగాచేసుకొన్న వానికి లోకమే దాస్యం చేస్తుంది. "అంగం గళితం పలితం ముండం, దశనవిహీనం జాతం తుండం, వృద్ధోయాతి గృహీత్వాదండం తదపినముంచత్యాశా పిండం" అని శంకర భగవత్పాదులు "భజగోవిందం" శ్లోకాలలో చెబుతాడు.

**జననాదృష్టాత్పితరౌపుత్రా జామాతరో వ్యయాదృష్టాత్ ।**
**కలహాదృష్టాజ్ఞాతయః ఇతి నిరీతే కిమేష్టవ్యమ్ ॥ (40)**

జననాదృష్టాత్=జన్మాదృష్టంవల్ల; పితరౌ=తల్లిదండ్రులు లభిస్తారు; వ్యయాదృష్టాత్= ఖర్చుచేసే అదృష్టంవల్ల; పుత్రాః=పుత్రులును; జామాతరః=అల్లుళ్లు లభిస్తారు; కలహాదృష్టాత్=తగవులాడే అదృష్టం వల్ల; జ్ఞాతయః=జ్ఞాతులు లభిస్తారు. ఇతి=అని; నిర్ణీతే=నిర్ణయించబడియుండగా; కిం=ఏమి? ఏష్టవ్యం=కోరదగినది?

(పూర్వ జన్మలో చేసిన కర్మఫలములే అదృష్టముగా, మరదృష్టముగా ఈ జన్మలో కలుగుతాయి) - జన్మాదృష్టం వల్ల తల్లిదండ్రులు, వ్యయాదృష్టం వల్ల కొడుకులు, అల్లుళ్లు; కలహాదృష్టం వల్ల దాయాదులు దొరుకుతారు. ఇది పూర్వమే నిర్ణయించబడినది. ఇంక క్రొత్తగా కోరుకొనేది ఏముంది?

**స్వపితుః పరలోకాయ స్వయమను దివసం యదాచరతి.।**
**క్రియతామిదముపమానం కిం నాలం పుత్ర వైరాగ్యే ॥ (41)**

స్వపితుః=తన తండ్రియొక్క; పరలోకాయ=పరలోకం కొరకు; స్వయం=తాను; అనుదివసం=ప్రతిదినము; యత్=ఏది; ఆచరతి=చేయుచున్నాడో; ఇదం=ఇదియే; ఉపమానం=ఉపమానంగా; క్రియతాం=చేయబడుగాక ! పుత్ర వైరాగ్యాయ= పుత్రుని మీది వైరాగ్యం కోసం; నాలంకిం=చాలదా ఏమి?

తన తండ్రికి ఉత్తమలోకాల్ని పొందించడానికి పుత్రుడుగా తాను చేసిన సత్కర్మలేమిటో తానే పరిశీలించుకొని, దానిని ఉపమానంగా చేసుకొంటే తన కొడుకు తనకేం చేయబోతాడో తెలుస్తుంది లేదా ! అది చాలదా పుత్ర వైరాగ్యంకలగడానికి.

**అననుగతే దారిద్ర్యేకి మనుగతంలక్షణం దృష్టమ్ ।**
**కామస్యాపరిపూర్తౌ కృపణం జగదాచతుర్వదనాత్ ।** (42)

దారిద్ర్యే=దారిద్ర్యం అనేది, అననుగతే=ఒకే విధంగా వుండనప్పుడు అనుగతం=అన్నిదారిద్ర్యాలకీ సమంగా అన్వయించే , కింలక్షణం=ఏమిలక్షణము, దృష్టం=చూడబడినది, కామస్య=కోరికయొక్క అపరిపూర్తౌ=పరిపూర్తి కానంతవరకు, ఆచతుర్వదనాత్=బ్రహ్మ దేవుడివరకు, జగత్=జగత్తు, కృపణం=దారిద్ర్యం కలదే।-దారిద్ర్యం అనేది అందరివిషయంలోనూ సమానంగా ఉండదు -కోటీశ్వరుడుకూడా తను దరిద్రుడననే అంటాడు. అటువంటప్పుడు దారిద్ర్యానికి సమంగా వర్తించే లక్షణమేది?- దానికి ఒకే ఒక సమాధానం, కోరికలు తీరనంత వరకూ బ్రహ్మ దేవుడితో సహా అందరూ దరిద్రులే- కోరికలు తీరనివాడే దరిద్రుడు. కోరికలులేనివాడే భాగ్యశాలి;, "కోవాదరిద్రోహి? విశాలతృష్ణ : " (శంకరభగవత్పాదులు) కాపీనవంతఃఖలు భాగ్యవంతో.-

**నఖలుధనత్వం జాతిర్యస్యయదిష్టం తదేవ తస్యధనమ్ ।**
**తత్తదివ పామరాణామాకించన్యం ధనం విదుషామ్ ॥** (43)

ధనత్వం =ధనత్వము; జాతిః నఖలు=జాతికాదుకదా, యస్య=ఎవనికి ;యత్ =ఏది; ఇష్టం=ఇష్టమైనదో;తస్య=వానికి; తదేవ=అదియే; ధనం=ధనము; పామరాణం =పామరులకు; తత్తదివ=ఆయా వస్తువుల మాదిరి; విదుషాం=పండితులకు; అకించిన్యం=ఏమిోలేకపోవడమే; ధనం=ధనము :-

ధనత్వం అనేది ఒక జాతి కాదు. (పశుత్యం; మానవత్వం; దేవత్వం వలె) ఎవరికి ఏది ఇష్టమో అదే వానిధనము ;పామరులైనవారికి బంగారునగలు, మిద్దెలు, భూములు, వాహనాలు, ధనము ; సమదర్శనులైన పండితులకు ఏమీలేకపోవడమే ధనం :-

**స్వీక్రియతే యది తృష్ణా స్వీకర్త వ్యంజగత్సమస్తమపి ।**
**స్వీక్రియతే యది శాన్తిః స్వాత్మాపి స్వస్య భవతినవా ॥** (44)

తృష్ణా=ఆశ ; స్వీక్రియతేయది=స్వీకిరింపబడినట్లైతే; సమస్తమపి=సమస్తమైన; జగత్ =జగత్తు; స్వీకర్తవ్యం=స్వీకరింపతగినది; శాన్తిః=శాంతి; స్వీక్రియతేయది=స్వీకిరింపబడినట్లైతే; స్వాత్మాపి=స్వాత్మయే; స్వస్య=తనకు; భవతివా=ఉంటుందో; నవా= ఉండదోః-

ఆశను కోరేపక్షంలో జగత్తునంతా స్వీకరించాలి; మొత్తం ప్రపంచం మీద ఆశనుంచాలి:శాంతిని కోరేపక్షంలో అన్నింటినీ వదలుకోవాలి-తుదకు స్మాత్మాభిమానాన్ని కూడ వదలాలిః-(నీయాత్మయే నీదిగా ఉంటుందో ఉండదో సందేహమేః- సముద్రంలో పడిన ఉప్పు గల్లుకు ఉనికెక్కడిది)ః-

**యద్దాతారం వశయతి యత్పరిజన మస్యసాన్త్వయతి ।**
**యదపత్రపతే నాన్తర్భావీలాభః సకస్యసమః ॥ (45)**

దాతారం=దాతను; వశయతి ఇతియత్=వశంచేసుకుంటాడనే మాట ఏదైతే వుందో; అస్య=ఈదాత యొక్క; పరిజనం=పరిజనాన్ని; సాన్త్వ ఇతియత్=మంచి చేసుకొంటాడనే మాట ఏది వుందో; అంతః=లోపల; న అపత్రపతే ఇతియత్=సిగ్గు పడడనే మాట ఏది వుందో; కస్య=వీటిలో దేనికి; భావి=కలుగబోవు; సలాభః=ఆలాభమ్ము; సమః= సమానమైనదిః-

దాతయొక్క అనుగ్రహం పొంది ఎంతో లాభం పొందాలనే ఆశతో అతనిని వశం చేసుకొంటాడు. అతడి అనుచరులను మంచి చేసు కొంటాడు బైటనే కాదు లోపల కూడా ఏమత్రం సిగ్గుపడడు. ఇంతా చేస్తే ఆరాబొయ్యే లాభం ఆఒక్క దానికి కూడ సమానం కాదు. (ఆ దాత వీణ్ణి తరిమి కొట్టకపోతే మేలు).

**ప్రాదేశ మాత్ర ముదరం పరి పూరయితుం కియానయం యత్నః ।**
**చులుకేనామ్భః పాతుం ఖనితవ్యం కిం తటా కో2పిః ॥ (46)**

ప్రాదేశమాత్రం=జానెడు; ఉధరం=పొట్టను; పరిపూరయి తుం=నింపుటకు; అయం= ఈ; యత్నః=శ్రమ; కియాన్=ఎంతదో కదా!; చులుకేన=పుక్కిటి; అంభః=నీటిని; పాతుం=త్రాగడానికి; తటాకో2పి=చెరువుకూడ; ఖనిత వ్యఃకిం=త్రవ్వవలయునా యేమి?ః-

జానెడుపొట్టను నింపుటకు ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నాము? పుక్కెడు నీళ్లకోసం చెరువునే లోడు కోవాలా?ః-

**యామార్ధమ సంస్కారాద్యామ ద్వయమనశనాచ్ఛ ।**
**సువ్యక్తేశరీరే సౌందర్యే2 ప్యభినివిశన్తేకియన్మూఢాః ॥ (47)**

యామార్ధం=ఒక అర్ధయామం పాటు; అసం స్కారాత్=ముఖ ప్రక్షాళనము; స్నానాది సంస్కారం చేసుకోకుండుట; యామద్వయం=రెండు యామాల పాటు; అనశనాచ= పస్తుంటే; సువ్యక్తే=బాగాతెలిసే; శారీరే=దేహానికి సంబంధించిన; సౌందర్యే అపి= సౌందర్యంకూడా; మూఢాః=మూఢులు; కియతే=ఎంతగా; అభినివేశన్తే=పట్టుదల గలిగియుంటారో కదో;

యామం అంటే మూడుగంటలు, అర్ధయామంపాటు; ముఖప్రక్షాళన వంటి పనులు, రెండు యామాల పాటు ఏమీతినక పోయినా, ఈ శరీర సౌందర్యం ఏపాటిదో స్పష్టంగా తెలిసిపోతుంది. అటువంటి శరీర సౌందర్యం గురించికూడా బుద్ధిలేని వారెంత శ్రద్ధకలిగి యుంటారో కదా!

**వన్ధ్యేత్యాహుస్తరుణీం జరతీతి పరిత్యజన్తి బహుపుత్రామ్ ।**
**అపినాల్పేన్యల్ప సుతాంకా గృహిణీ కామినాం హృద్యా ॥ (48)**

తరుణీం=యువతిని; వన్ధ్యేతి=గొడ్రాలనీ; ఆహుః=అంటారు; బహుపుత్రాః=ఎక్కువ సంతాన మున్నదానిని; జరతీతి=ముసలిదని; పరిత్యజన్తి=విడిచిపెట్టారు; అల్పసుతామపి=కొద్ది బిడ్డలున్న దానిని కూడా ; నిన్దన్తి=నిందింస్తారు; కామినాం=కాముకులకు; కా=ఏ; గృహణీ=భార్య; హృద్యా=మంచిదైనది?:-

యౌవనంలో యున్న భార్యను గొడ్రాలంటారు. బహుసంతానవతిని ఏటా బాలింత అంటారు; ముసలిది అని అంటారు. తక్కువ పిల్లలున్నా తిట్టిపోస్తారు. ఈ విధంగా కాముకులు తమ భార్యను ఏవిధంగా ఉన్నా మంచిదనరు. అడ్డదోవలు త్రొక్కే దానికి సాకులు చెపుతారు.

**యాన్తి శుచమకృతదారా, ద్వేభార్యేనేతి కృతదారాః ।**
**తేపరదారానేతి స్త్రీభిస్తృప్తాన్న పశ్యామః ॥ (49)**

అకృతదారాః=అవివాహితులు; శుచం=దుఃఖాన్ని; యాన్తి=పొందుతారు; కృతదారాః= పెండ్లయినవాళ్ళు; ద్విభార్యేవ ఇతి=ఇద్దరు భార్యలు లేరని(దుఃఖిస్తారు); తే=ఇద్దరు భార్యలున్నవాళ్ళు; పరాదారాః న ఇతి=పరభార్యలు లేరని; (ఏడుస్తారు); స్త్రీభిః=స్త్రీలతో; తృప్తాన్=తృప్తి చెందిన వారిని; నపశ్యామః=చూడలేదు;

పెళ్ళికాలేదని పెళ్ళికాని వాళ్ళు, పెండ్లిఅయినవాడు రెండోభార్యలేదని, ఇద్దరు భార్యలున్న వాళ్ళు పరభార్యలకోసం ఏడుస్తూంటారు. ఈ విధంగా స్త్రీల విషయంలో తృప్తిచెందిన వాళ్ళు అగపడరు. బ్రహ్మకైన బుట్టురిమ్మతెగులు:-

**మదనస్యాజ్ఞాకరణే మన్యేజగదఖిల మేకరూప మిదమ్ ।**
**తిర్యఞ్చ ఇతినరా ఇతిదేవా ఇత్యన్యతో భేదః ॥ (50)**

మదనస్య అజ్ఞాకరణే=మన్మథాజ్ఞను అమలు పెట్టటంలో; ఇదం=ఈ; అఖిలంజగత్= యావత్ప్రపంచము; ఏకరూపం=ఒకే రూపమని; మన్యే=తలుస్తాను; తిర్యఞ్చ ఇతి= జంతువులనీ; నరాఇతి=మనుష్యలనీ; దేవాఃఇతి=దేవతలనీ; భేదః=భేదము; అన్యతః= వాటికి ఇతర కారణాలున్నాయి;

మన్మథాజ్ఞను పాలించడంలో జగత్తులో అందరూ ఒకటే ఇక జంతువులనీ, నరులనీ, దేవతలనీ, భేదాలున్నాయంటే దానికి వేరే కారణాలుంటాయి. (అవి వాళ్ళగుణకర్మాల బట్టిఉంటాయి):

**వేదానధీత్య విధివన్మీమాం సిత్వాతదర్థంచ ।**
**దారాఃకర్తవ్యా ఇతి కేనేదం ప్రహసనం కథితమ్ ॥ (51)**

విధివత్=యథావిధిగా; వేదాన్=వేదాలను; అధీత్య=చదివి; తదర్థంచ=వాటి అర్థంకూడా; మీమాంసిత్వా=మీమాంసచేసి; దారాఃకర్తవ్యాః=పెండ్లిచేసుకోవలెను; ఇతి=అని; ఇదం=ఈ; ప్రహసనం=నవ్వులాట; కేన=ఎవనిచేత; కథితం=చెప్పబడినదో;

చక్కగా వేదాలను చదివి, వాటిఅర్థంకూడా బాగాతెలుసుకొని, తర్వాత పెండ్లి చేసుకోవాలి అనే హాస్యాస్పదమైన పద్ధతిని ఎవరు చెప్పినారో! ఇంత చదువూ చదివి కడపట చేయవలసిన ఘన కార్యమిదేనా?-

**శుక్లవిమోకస్థానం మలమూత్ర త్యాగ దేశవత్కిమపి ।**
**స్త్రియ ఇతి విధినా విహితం కియదత్ర జనానిమంజన్తి ॥ (52)**

శుక్లమును మలమూత్రమును విసర్జించేది స్త్రీయని బ్రహ్మచేతనే నిర్ణయించ బడియున్నది అయిననూ జనులెందుకు అందులో మునిగిపోతారో!- స్త్యాయతే శుక్ల శోణితే అస్యామితి స్త్రీ

**దుఃఖేనోపార్జ్యన్తే పాల్యన్తే ప్రత్యహంచలాల్యన్తే ।**
**వామాఃస్త్రియో విమూఢై రుపభుంజానాః సుఖంద్విగుణమ్ ॥ (53)**

ద్విగుణం=రెండురెట్లు; సుఖం సుఖమును; ఉపభుంజానాః=అనుభవించే; వామాః=అందగత్తెలైన; స్త్రియ=స్త్రీలు; విమూఢైః=మూఢులైన పురుషులచే; దుఃఖేన= అతి ప్రయాసతో; ఉపార్జ్యంతే= సంపాదింపబడుతారు; పాల్యన్తే= పాలింపబడుతారు; ప్రత్యహం=ప్రతిదినమూ; లాల్యన్తే=లాలింపబడుతూంటారు :-

మూఢులు ఎంతో శ్రమపడి అందమైన ఆడవారిని సంపాదించుకొంటారు. వారిని బాగా పోషిస్తారు. ప్రతి దినమూ బుజ్జగిస్తారు. వాళ్లు మాత్రం మగవారి కంటే రెట్టింపు సుఖమనుభ విస్తారు. కష్టమంతా ఈయనది. సుఖమంతా ఆమెది.

**అశ్నీత పిబత ఖాదత జాగృత సంవిశత చలత ।**
**తిష్ఠతవా సకృదపి చిన్తయతాన్తః సావధికోదేహబన్ధఇతి ॥ (54)**

అశ్నీత=భుజించండి; పిబత=త్రాగండి; ఖాదత=తినండి; జాగృత=మేల్కొని ఉండండి; సంవిశత=నిద్రపొండి; చలత=తిరగండి; వా=లేకపోతే, తిష్ఠత=ఒకే చోట కూర్చోండి; సకృదపి=ఒక్కసారైనా; దేహబన్ధ=ఈ దేహ బంధము; సావధికః ఇతి=అవధితో కూడినదే అని; అన్తం=లోపల; చిన్తయత=ఆలోచించండి.

మీరు బాగా భుజించండి, త్రాగండి, తినండి, మేల్కొని ఉండండి, నిద్రపొండి,

తిరగండి, ఒకే చోట కూర్చోండి. " ఈ దేహము చాలా పరిమితమైనది. ఇది శాశ్వతము కానిది, ఇది తగలబడిపొయ్యేదే" అని ఒక్కసారైనా మనస్సులో గుర్తుచేసుకొంటూండండి.

**కిం విజితయాపృథివ్యాకిం కాంచన భూభృతా కరస్థేన ।**
**కిం దివ్యాభిః స్త్రీభిర్మర్త్వ్యే బ్రహ్మణాలిఖితే ॥ (55)**

మర్త్వ్యే=మరణించవలసినదిగా; బ్రహ్మణా=బ్రహ్మచేత; లిఖితే=వ్రాయబడియుండగా; విజితయా=జయింపబడిన; పృథివ్యా=భూమిచేత; కిం=ఏమిలాభము; కరస్థేన=చేతిలో ఉన్న; కాంచన భూభృతా=మేరు పర్వతం వల్లనైనా; కిం=ఏమి ప్రయోజనం?; దివ్యాభిః స్త్రీభిః=దేవతా స్త్రీలచేత; కిం=ఏమి ప్రయోజనం? -

ఏనాటికైనా చావాలని బ్రహ్మ వ్రాసిపెట్టియున్నాడు. అటువంటప్పుడు ఈ భూమండలాన్నంతా జయించినా; మేరు పర్వతాన్ని చేతిలోపెట్టుకొన్నా; దేవతాస్త్రీలను సంపాదించిపెట్టుకొన్నా; ప్రయోజనమేముంది, అంతా పొయ్యేదే.

**జీవతి కతిచిన్నిమిషాన్ కతి చిత్తేషు శ్రుతిరధీత ఇవ ।**
**తావత్యేవాకులయతి తన్త్రాణినవాని చాతనుతే ॥ (56)**

కతిచిన్నిమిషాన్=కొన్ని నిమిషాలపాటు; జీవతి=జీవిస్తాడు; తేషు=ఆ కొద్ది నిమిషాలలో; కతిచిత్=కొన్ని నిమిషాలపాటు; శ్రుతః=వేదాలను; అధీతేఇవ=చదివినట్టుంటాడు. తావత్యేవ=అంతలోనే; తంత్రాణి=శాస్త్రాలను; ఆకులయతి=కలియపెట్టుతాడు. నవానిచ=క్రొత్తవాటిని; అతనుతే=కల్పిస్తాడు. -

వీడు జీవించేదే కొద్ది నిమిషాలు. ఆ కొద్ది క్షణాల్లోనే వేదాలను అన్నింటినీ తిరగేసినట్లనుకొని, అవి బాగులేదు, వాటిని తల్లక్రిందులు చేసి తాను క్రొత్త శాస్త్రాలను సిద్ధాంతాలను కల్పిస్తాడు.

**స్వల్పో జీవన కాలః స్వల్పాధీః పరిచయః స్వల్పః ।**
**తదపి తరేమకథం చిచ్ఛ్రుతయోయది నోపజాయన్తే ॥ (57)**

జీవనకాలః=జీవించేకాలము; స్వల్పః=స్వల్పమైనది; ధీః=బుద్ధి; స్వల్పా=స్వల్పమై నది; పరిచయః=శాస్త్ర పరిచయము; స్వల్పః= స్వల్పమైనది; తదపి=అట్లైనను; శ్రుతయః=శ్రుతులు; నోపజాయన్తే=పుట్టకపోయినట్లయితే; కథంచిత్=ఏదోవిధంగా తరేమ=తరించేవారము

బ్రతికేది కొద్దికాలం, బుద్ధికూడా స్వల్పమైనది. శాస్త్ర పరిచయము కూడా కొద్దిపాటిదే. (శ్రుతులు లేకపోతే ఏదో విధంగా తరిచేవారము) కన్నప్ప, నందనారు, తుకారాం, ఎందరో పండరి భక్తులకు - చదువు సంధ్యలు లేవుకదా ! -

**కుత ఆగతం నజానేక్వను వాగన్తవ్యమిద మపినజానే ।**
**సంచరసిక్వేదానీం సంసార పథే మహాతమసి ॥** (58)

కుతః=ఎక్కడినుంచి; ఆగతం=రావడమో; నజానే=ఎరుగను; క్వనువా=ఎక్కడికి; గన్తవ్యం=పోవలసివుందో; ఇదమపి=దీనినికూడా; నజానే=ఎరుగను; ఇదానీం=ఇప్పుడు; సంసార మహాపథే=సంసారమహామార్గంలో; మహాతమసి=గాఢాంధకారంలో; క్వ=ఎక్కడ; సంచరసి=సంచరిచుచున్నావో!

ఎక్కణ్ణించి వచ్చావో - ఎక్కడికి పోవలయునో తెలియదు - గాఢాంధకారంలో సంసార మహామార్గంలో ఎక్కడ తిరుగాడుతున్నావో తెలియదు. అంతా అగమ్యం అయోమయం - భీతావహం.

**తమసావృతాశ్చరన్తః సవిధే దూరేచ నావయన్త్యర్థాన్ ।**
**అవయన్తితు విస్పష్టం తదితి శిరస్యభిహితే మూఢాః ॥** (59)

తమసావృతాః=చీకటిచే ఆవరింపబడి; చరన్తః=తిరుగుతూండే; మూఢాః=మూఢులు; సవిధే=సమీపమందును; దూరేచ=దూరంగానూ ఉన్న; అర్థాన్=వస్తువులను; నావయన్తి=తెలిసికొనలేరు; శిరసి=శిరస్సు; అభిహితే=కొట్టబడినప్పుడు, తదితి=ఆ వస్తువని; విస్పష్టం=స్పష్టంగా, అవయన్తి=తెలుసుకొంటారు;

చీకట్లో తిరుగుతూ, దారీ తెన్నూ తెలియక తడుములాడే మూఢులు దగ్గరగా వున్న వాటినీ దూరంగా ఉన్నవాటినీ చూడలేరు. తెలుసుకోలేరు. ఏదైనా నెత్తికి తగిలి బొప్పి కట్టితే అప్పుడు ఇది ఈ వస్తువు కదా అనే జ్ఞానం కలుగుతుంది. అదే విధంగా సంసారాంధకారంలో అజ్ఞానులై క్రిందామీదా తెలియక ప్రవర్తించే వారికి మంచిదెబ్బ తగిలితే, కష్టాలపాలైతే, తాము చేసిన పాపాలకు ఇది ఫలితమని, అప్పుడు తెలుసుకొంటారు.

**నిమిషన్త్యత్ర తరుణ్య స్తత్ర తరుణ్యోననిమిషన్తి ।**
**ఈ దృక్షోహి విశేషః స్వర్గః స్వర్గ ఇతి కిం తత్ర ॥** (60)

అత్ర=ఈ లోకంలోని; తరుణ్యః=యువతులు; నిమిషన్తి=రెప్పపాటువేస్తారు; తత్ర=అక్కడ; తరుణ్యః=యువతులు; ననిమిషన్తి=రెప్పలు ఆర్పరు; విశేషః=విశేషము; ఈ దృక్షోహి=ఇంతమాత్రమేకదా? స్వర్గః; స్వర్గఇతి=స్వర్గం స్వర్గం అంటూ; తత్ర=అక్కడ; కిం=ఏమున్నది.

ఇక్కడున్న స్త్రీలకు రెప్పపాంటుంది. అక్కడివాళ్లకులేదు -ఉన్నతేడా అంతా ఇంతమాత్రమే; స్వర్గంస్వర్గం అంటూ అనుకోవడమేకానీ ఇంక విశేషమేమున్నది :-

**కోపోమైత్రావరుణేః శాపోవాతార్కికస్యమునేః ।**
**సంస్మర్యతేయది సకృచ్ఛత్రోరపిమాస్తు శక్రపదమ్ ॥ (61)**

మైత్రావరుణేః=అగస్త్యుని యొక్క; కోపోవా=కోపముగానీ;తార్కికస్యమునేః గౌతముని యొక్క; శాపోవా=శాపముగానీ; సకృత్=ఒక్కసారైనా సంస్మర్యదేయది=స్మరింపబడినట యితే; శక్రపదం=ఇంద్రపదవి., శత్రోరపి= శత్రువుకుకూడా; మాస్తు=కలుగకుండుగాకః అగస్త్యుడికోపంగానీ, గౌతముడిచ్చిన శాపంగానీ గుర్తుంటే ఇంద్ర పదవిశత్రువుకైనా కలుగరాదుః-

ఇంద్రపదవికి నహుషుణ్ణి దేవతలు ఎన్నుకొన్నారు. ఇంద్రపదవి చేబట్టగానే అంతటి మహానీయుడైన నహుషునికి పాడుబుద్ధులు పుట్టాయి. ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని కావాలని కోరుకొన్నాడు. దేవతలతో తనకోర్కె గురించి చెప్పాడు. వారొక ఉపాయం పన్నినారు. "శచీదేవి వ్రతమాచరిస్తున్నది. ఆ వ్రత సమాప్తికి ఇంకనూ కొంత కాలంపడుతుంది. వ్రతసమాప్తినాడు, ఆ వ్రత నియమం ప్రకారం, నీవు సప్తరుషులు మోసే పల్లకీ ఎక్కి, ఆమె నివాసానికి ఊరేగింపుగా పోయి ఆమెను పొందవచ్చును". అనిచెప్పారు. క్రొత్త ఇంద్రుడి ఆజ్ఞ ప్రకారం సప్తరుషులు పల్లకీమోస్తున్నారు. నహుషుడి కి తొందరెక్కువైంది. "సర్పసర్ప" అనిఅంటూ తనకాలికి అందిన అగస్త్యుణ్ణి తన్నినాడు. అగస్త్యుడికి కోపంవచ్చి నహుషా నీవు సర్పమైపోతావు అని శపించాడు. కొండచిలువగా భూలోకంలోపడ్డాడు. న్యాయ శాస్త్రం రచించిన గౌతముడు అహల్య భర్త అయిన గౌతముడు ఒక్కడేనని పెద్దల అభిప్రాయం. అహల్య విషయంలో ఇంద్రుడు గౌతమునిచే శపించబడినాడు. ఆ ఇంద్ర పదవి మన విరోధులకు కూడా వద్దు- ఇంద్ర పదవి వల్ల శాపాలు, తాపాలు తప్ప ఏ సుఖమూలేదు.

**గచ్ఛత్వమరావత్యాం గచ్ఛతు చతురాననస్యవానగరే ।**
**పునరాగన్తవ్యం యదిపుంసాకిం సాధితం భవతి ॥ (62)**

అమరావత్యాం=స్వర్గంలోని అమరావతినగరానికి; గచ్ఛతు=పోవచ్చు; వా=లేక; చతురాననస్య=బ్రహ్మయొక్క; నగరే=నగరికి; గచ్ఛతు=పోవచ్చుగాక; పునః మరల; ఆగన్తవ్యం=వెనక్కిరావలసి ఉన్నట్లయితే; పుంసా=పురుషునిచేత; కిం=ఏమి; సాధితంభవతి=సాధించినట్లయినది ?

స్వర్గలోకానికిపోయినా, సత్యలోకానికిపోయినా తిరిగీ భూ లోకానికి రావలసియే యుండగాపురుషుడు సాధించిన దేమిటి? ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినో2ర్జున= అర్జునా! బ్రహ్మలోకం వరకు వుండే సకల లోకాలూ పునర్జన్మకలుగజేసేవే. (భ.గీ.8-16) "తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యేమర్త్యలోకం విశంతి= వాళ్లువిశాలమైన

స్వర్గలోకంలో సుఖాలననుభవించి,పుణ్యంక్షీణించిపోగానే మానవలోకం లోకి మరలావస్తారు (భ.గీ= 9-21) - స్వస్వరూపాను సంధానం చేసుకోబడని ఎన్ని కర్మలయిననూ ఏమి ప్రయోజనం? :-

**భుక్తాబహవో దారాః లబ్ధాః పుత్రాశ్చ పౌత్రాశ్చ ।**
**నీతం శతమ ప్యాయుః సత్యం వదమర్తు మస్తిమనః ॥ (63)**

బహవః=చాలామంది; దారాః=భార్యలు; భుక్తాః=అనుభవింపబడినారు; పుత్రాః పౌత్రాశ్చ=కొడుకులు మనవళ్లు; లబ్ధాః=కలిగారు; శతం అయుః అపి=నూరేండ్లుకూడా; నీతా=దాటుకొంది; సత్యంవద=నిజంగాచెప్పు; మర్తుం=చావడానికి; మనః=మనస్సు; అస్తి=ఉన్నదా ?

ఎందరినోభార్యలనను భవించావు; కొడుకులు, మనళ్లనూ పుట్టించావు, నూరేండ్లు బ్రతికినావు. ఇప్పటికైనా చావ్వాలని ఉందా? నిజం చెప్పు!

**విశ్లేషణ స్వభావాన్ విషయాన్ పశ్యన్ కరోతి కోమమతామ్ ।**
**నశ్యదవస్థాపన్నం కః క్రీణీతేధనైరశ్వమ్ ॥ (64)**

విషయాన్=విషయసుఖాలను; విశ్లేషణ స్వభావాన్=విశ్లేషణ పొందేస్వభావము కలవానిగా; పశ్యన్=చూచే; కః=ఎవడు; మమతాం=మమకారమును; కరోతి= చేయును?; నశ్యదవస్థాపన్నం=చావడానికి సిద్ధంగాఉన్న; అశ్వం=గుఱ్ఱమును; కః= ఎవడు; ధనైః=ధనముతో; క్రీణీతే=కొనును?

విషయసుఖాలు ఎప్పటికైనా మనల్ని వదలిపెట్టిపోతాయి. అని గుర్తించిన వాడెవడు కూడా వాటి విషయంలో మమకారాన్ని పెట్టుకొంటాడా? లేవలేని ఎత్తుబడిపోయిన గుఱ్ఱాన్ని డబ్బిచ్చి ఎవడైనా కొంటాడా?

**అన్నాభావే మృత్యుః శాలిభిరన్నాని, శాలయో వృష్ట్యా ।**
**వృష్టిస్తపసేతి వదన్న మృత్యవే తత్ర పశ్చరతు ॥ (65)**

అన్నాభవే=అన్నం లేకుంటే; మృత్యుః=మరణము కలుగును; అన్నాని=ఆహారాలు; శాలిభిః=వడ్లవల్ల లభిస్తుంది; వృష్టిః=వర్షము; తపసా=తపస్సుచేత లభించును; ఇతి=ఇట్లు; వదన్=చెప్పేవాడు; తత్=ఆ; తపః=తపస్సును; అమృత్యవే=మరణ రాహిత్యం కొరకు; చరతు=ఆచురించుగాక!

అన్నంలేకపోతే మరణం కలుగుతుంది-అన్నం కావాలంటే ధాన్యం కావాలి-ధాన్యం కావాలంటే వర్షాలుకురవాలి-వర్షాలు కురవాలంటే తపస్సు చేయాలి" అంటూ భావించేవారు- ఆచేసే తపస్సు మృత్యువులేకుండాఉండడానికే చేసుకోవచ్చుగదా;

తపస్సు వల్ల వానలు; వానలువల్ల పంటలు, పంటలువల్ల అన్నము- అన్నమువల్ల బ్రతకడం కాకుండా ఒకేసారి అమరత్వానికై తపస్సు చేయవచ్చుగదా!-

అన్నాద్భవన్తిభూతాని; పర్జన్యాదన్న సముద్భవః, యజ్ఞాద్భవతి పర్జన్యోయజ్ఞః కర్మ సముద్భవః - (భ.గీ=3-14ః-)

**కిం ననిగృహ్ణంతి మనః కిం నభజన్తే జనాః శివం శరణమ్ ।**
**అభిసన్ధి భేద మాత్రాన్మోక్షోపాయేన బధ్యన్తే ॥ (66)**

జనాః జనులు; మనః=మనస్సును, కింనని గృహ్ణన్తి= నిగ్రహించుకొనడం లేదా? శివం=శివుణ్ణి; శరణంనభజన్తేకిం=శరణు పొందుట లేదా?; అభి సన్ధి భేదమాత్రాత్= కేవలము అభి ప్రాయభేదం వల్ల; మోక్షోపాయేన=మోక్షోపాయం చేత; బధ్యన్తే= బంధింపబడు చున్నారు.

మనుష్యులు మనస్సును నిగ్రహిస్తూ ఉన్నారు. శివుని శరణు పొందుతూ ఉన్నారు వీటివల్ల పుణ్యం వస్తుంది - వారిలక్ష్యం ఐహిక సుఖార్జన మాత్రమే నిష్కామంగా, నిస్వార్థంగా మనోనిగ్రహము, శివ శరణమూ లక్ష్యంగా చేసేట్లయితే మోక్షం వస్తుంది- ఏ సాధనాలు మోక్షదాయకమో అవే బంధదాయకము-

**భోగాయ పామరాణాం యోగాయ వివేకినాం శరీర మిదమ్।**
**భోగాయచ యోగాయచ నకల్పతే దుర్విదగ్ధానామ్॥ (67)**

ఇదం శరీరం=ఈ శరీరం ; పామరాణాం=పామరులకు; భోగాయ=భోగానికి మాత్రమే ఉపయోగపడుతుంది; వివేకినాం=వివేకవంతులకు; యోగాయ=మోక్ష సాధనకు పనికి వస్తుంది. దుర్విదగ్ధానాం=అజ్ఞానులకు; భోగాయచ=భోగానికిగానీ; యోగాయచ= యోగానికిగానీ, నకల్పతే=ఉపయోగపడదు-

పామరులు శరీరాన్ని భోగానికి వుపయోగించుకొంటారు. వివేకవంతులు యోగసాధనకు ఉపయోగించుకుంటారు. అజ్ఞానులు ఈ శరీరాన్ని భోగానికి గానీ, యోగానికీ ఉపయోగించరు.

**బ్రాహ్మణ చణ్డాలాఇత్యాహ మనుర్యన్మహా పథికాన్ ।**
**భవమార్గ మహపథికానధికృత్యైవ ప్రవృత్తం తత్ ॥ (68)**

మనుః=మనువు; మహాపథికాన్=మహాపథికులను; బ్రాహ్మణ చండాలాః ఇతి= బ్రాహ్మణ చండాలురని; ఆహ=చెప్పుచున్నాడు; తత్=ఆ చెప్పుట; భవవమార్గ మహా పథికాన్ ఏవఅధికృత్య=సంసారమార్గంలో మహాపథికులుగా యున్న వారిని గూర్చియే; ప్రవృత్తం=ప్రవర్తించినది;

మహాపథికులు బ్రాహ్మణ చండాలులని మనువు అన్నాడు. అది సంసారమార్గంలో మహాపథికులుగా ఉన్న వారిని గూర్చి చెప్పబడి ఉంటుంది-

**ఏకద్వాఃక్షితి పతిమద్విత్రాదేవేమ పంచషాద్రుహిణే ।**
**ఏతావన్తేజగతి బ్రహ్మనన్దార్ణవస్య కణాః ॥ (69)**

బ్రహ్మానందార్ణవస్య=బ్రహ్మానందసముద్రముయొక్క, ఏకద్వాఃకణా=ఒకటి రెండు కణాలు, క్షితిపతిషు=రాజులలో ఉండును; దేవేషు=దేవతలలో; ద్విత్రాః=రెండు మూడుండును; ద్రుహిణే=బ్రహ్మలో; పంచషాః=ఐదారు ఉండును; జగతి=జగత్తులో, లభించేవి; ఏతావన్తః=అంతమాత్రమే;

బ్రహ్మానందం ఒకమహాసముద్రం. దానిలో ఒకటోరెండోబొట్లు రాజులకు, దేవతలకు రెండోమూడో; బ్రహ్మకు ఐదోఆరో దొరకవచ్చును ఈజగత్తులో అంత కంటే ఎక్కువగా ఎవరికీదొరకవు :

**అజ్ఞానేనాపిహితే విజ్ఞానే కర్మకింకురుతే ।**
**వికలే చక్షుషి తమసావ్యాదాయ ముఖం కిమీక్షేత ॥ (70)**

విజ్ఞానే=విజ్ఞానము; అజ్ఞానేన=అజ్ఞానంచేత; అపిహితేసతి=కప్పివేయబడిన దగుచుండగా, కర్మ=కర్మ, కింకురుతే=ఎమిచేస్తారు? చక్షషి=కన్ను; తమసా=చీకటిచేత; వికలే=వికలమైపోగా; ముఖం=ముఖమును; వ్యాదాయ, తెరచుకొని; ఈక్షేతకిం= చూచునా ఏమి ?

విజ్ఞానమంతా అజ్ఞానంచే కప్పబడిపోగా ఆ తర్వాత కర్మ ఏమిచేస్తాడు (సత్కర్మలు, నిష్కామకర్మలు, విహితకర్మలను చేయలేడు, గీతలో "నియతంకురుకర్మత్వం" అనిభగవానుడు ఉపదేశిస్తాడు. అజ్ఞాని అటువంటివి చేయలేడు. చీకట్లో కండ్లుచూడలేవు. అటులని, నోరు తెరుచుకుంటే కనబడుతుందా? కన్నేచేయలేని పనినినోరు చేస్తుందా !

**అతికలుషమాశు నశ్వరమాపాతస్ఫురణమన భిలాపకరమ్ ।**
**అపిహృష్యన్తిజనా ః కథమవలంబ్యజ్ఞానఖద్యోతమ్ ॥ (71)**

అతికలుషం=విక్కిలి కలుషమైనదీ; అశునశ్వరం=వెంటనే నశించేదీ; ఆపాతస్ఫురణం =ప్రకాశించునట్లు అనిపించేదీ; అనభిలాపకరం=దేనినీ ప్రకటింపజాల నిదీ అయిన; జ్ఞాన ఖద్యోతమపి= మిణుగురు పురుగువంటి జ్ఞానాన్ని కూడా; అవలంబ్య =పట్టుకొని; జనాః=జనులు; కథం=ఎట్లు; హృష్యన్తి= ఆనందిస్తారో!

ఈ లోకజ్ఞానం అంతా కలుషితమైనది. అతి త్వరగా నశించిపోయ్యేది. మిణుగురు

పురుగువంటిది. మెరుస్తూన్నట్లుంటుందికానీ, ఆ వెలుగులో ఏదీ కనబడుదు; ప్రకాశింప చేయలేదు. ఈమాత్రం జ్ఞానానికే ఎంత ఆనందంతో ఎగిరి గంతులేస్తూంటారు.

**ప్రయుతం నియుతం వాపి ప్రదిశన్తి ప్రాకృతాయ భోగాయ ।**
**క్రీణన్తి నబిల్వదలైః కైవల్యం పంచషైర్మూఢాః ॥ (72)**

మూఢాః=మూఢులు; ప్రాకృతాయభోగాయ=ప్రాపంచిక సుఖాలకోసం; ప్రయతం= పదిలక్షలు; నియుతం=ఒకకోటి; వాపి=అయినను; ప్రదిశన్తి=ఇస్తారు; పంచషైః=ఐదారు; బిల్వదలైః=బిల్వదళాలతో; కైవల్యం=మోక్షాన్ని; నక్రీణంతి=కొనరు;

మూఢులు లక్షలు, కోట్లు ప్రాపంచిక సుఖాలకోసం దుబారా చేస్తారు. కానీ ఐదారు బిల్వదళాలు పరమేశ్వరునికి అర్పించి మోక్షాన్ని కొనాలని ప్రయత్నించరు. "ఏక బిల్వం శివార్పణం" ఒక బిల్వదళాన్ని శివునికి అర్పిస్తేచాలు సాయుజ్యం తప్పదు.

**యావత్కిల చేష్టన్తే తావత్పాశేన బధ్యతే గ్రన్థిః ।**
**నిభృతం యది వర్తన్తే కాలేన స్రంసతేపాశః ॥ (73)**

యావత్కిల=ఎంతవరకు; చేష్టన్తే-కదులుతూంటారో; తావత్=అంతవరకు; పాశేన= భవపాశంచే; గ్రంధిః=ముడి; బధ్యతే=కట్టబడును; నిభృతం=కదలకుండా; వర్తన్తేయది= ఉన్నట్లయితే; కాలేన=కొంతకాలానికి; పాశః=పాశము; స్రంసతే=జారిపోవును;

కర్మలు చేసేకొద్దీ బంధాలు బాగా బిగుసుకుంటాయి. కర్మలు చేయకుండా వుంటే కాలగతిలో అవి తమంతట తామే జారిపోతాయి:-

**ఉపరున్ధన్తి శ్వాసాన్మునయోనాశ్నన్తి నపిబన్తి ।**
**స్తూయన్తే కింమునయః కంఠే కుర్వన్తి కనక పాశమిమే ॥ (74)**

మునయః=మునులు; శ్వాసాన్=శ్వాసలను; ఉపరుంధంతి=నిరోధిసున్నారు; నాశ్నంతి=తినరు; నపిబన్తి=త్రాగరు; మునయః=మునులు; కింస్తూయన్తే=ఎందుచేత పొగడబడుచున్నారు?; ఇమే=వీరు; కనకపాశం=బంగారు పాశాన్ని; కంఠేకుర్వన్తి=మెడలో ధరించి యున్నారు;

మునులు ప్రాణాయామ సాధన చేస్తారు. తినరు, త్రాగరు. వీరిని జనం స్తుతిస్తారు. అయితే వీరు పుణ్యంచేసి బంగారు పాశాన్ని మెడకు తగిలించుకొంటున్నారు. "అవశ్యం అనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"

పుణ్యాలుకానీ పాపాలుకానీ వాటి ఫలాలననుభవించుటకై జన్మలనెత్తుతూండ వలసినదే. ముక్కు మూసుకొని కూర్చొన్నంత మాత్రాన మోక్షంరాదు.

**కామంజనాః స్మయన్తే కైలాస విలాస వర్ణనావసరే ।**
**సాధన కథనావసరే సాచీకుర్వంతి వక్త్రాణి ॥ (75)**

జనాః=జనులు; కైలాస విలాస వర్ణనావసరే=కైలాస విలాసాలను వర్ణిస్తూంటే; కామం=మిక్కిలి; స్మయన్తే=ఆశ్చర్యపడెదరు; సాధన కథనావసరే=ఆ కైలాసాన్ని చేరే సాధనాలను వర్ణించే సమయంలో; వక్త్రాణి=ముఖాలను; సాచీకుర్వన్తి=అడ్డంగా త్రిప్పుతారు.

కైలాసాన్ని వర్ణించేప్పుడు జనులెంతో ఆసక్తితో వింటారు. కానీ అక్కడికి చేరే సాధనాలను చెప్పేటప్పుడు, ముఖాలను ముడుచుకుంటారు. తల అడ్డంగా త్రిప్పుతారు.

**వంగాః కథమంగాః కథ మిత్యను యుంక్తే వృథాదేశాన్ ।**
**కీదృక్కృతాన్త పురమితి కోఽపిన జిజ్ఞాసతే లోకః ॥ (76)**

వంగాః=వంగదేశము; కథం=ఎట్లావుంటుంది?; అంగాః=అంగ దేశము; కథం=ఎలా వుంటుంది; ఇతి=అని; వృథా=వృథాగా; దేశాన్=దేశాలను గురించి; అనుయుంక్తే= అడుగుతూంటారు; కృతాంతపురం=యమపురి; కీదృక్ఇతి=ఎట్టిది అని; కోఽపిలోకం= ఒక్కడైన; నజిజ్ఞాసతే=తెలుసుకోవాలని అనుకోడు;

వంగదేశం ఎలావుంటుంది, అంగదేశపు విశేషాలేమి? అని ప్రతి వాడూ ఆయాదేశాల గూర్చి అడుగుతూనే ఉంటారు. అంతే కాని యమలోకపు సంగతుల గూర్చి తెలుసుకోవాలని ఎవరు అనుకోరు.

**త్యక్త వ్యోమమకార స్త్యక్తుంమమకార స్త్యక్తుంయది శక్యతేనాసౌ ।**
**కర్తవ్యోమమకారః కింతు ససర్వత్ర కర్త వ్యం ॥ (77)**

మమకారః=మమకారము; త్యక్తవ్యః=విడువతగినది; అసౌ=ఇది; త్యక్తుం= విడుచుటకు; నశక్యతేయది=వీలుకాకపోతే; మమకారః=మమకారము; కర్తవ్యః= చేయదగినది; కింతు=కానీ; సః=ఆమమకారము; సర్వత్ర=అన్నింటిపైనా; కర్తవ్యః= చేయదగినది;

మమకారాన్ని వదలుకోవాలి. అలా విడిచిపెట్టడం సాధ్యంకాకపోతే ఆ మమకారాన్ని అందరి యందూ ఉంచాలి. సర్వత్రా సమదర్శనం కలగాలి. గీతలో "ఆత్మౌపమ్యేన సర్వత్ర" ఉండాలని భగవదాదేశము:-

**పుత్రా ఇతి దారా ఇతిపోష్యాన్మూర్ఖో బహిర్జనాన్ బ్రూతే ।**
**అంధేతమసి నిమజ్జన్నాత్మాపోష్య ఇతినా వైతి ॥ (78)**

మూర్ఖః=మూర్ఖుడు; బహిర్జనాన్=బైటివాళ్ళను; పుత్రాఇతి=పుత్రులని అంటూ; దారాః

ఇతి=భార్యఅని అంటూ; పోష్యాన్=పోషించాలని అంటూ; బ్రూతే=చెపుతూంటాడు; అంధేతమసి=గాఢాంధకారం; నిమజ్జన్=మునిగిపోతున్న; ఆత్మా=తననుతనే; పోష్యఃఇతి= పోషించతగినవాడుఅని; నావైతి=ఎరుగడు;

వీరు నాబిడ్డలు; ఈమె నా భార్య అని బైటివారందర్నీ పోషించాలని అనుకొంటాడు. తాను కటిక చీకట్లో, అజ్ఞానాంధకారంలో అహంకార మమకారాల్లో మునిగిపోతున్నాడు. ముందు తనను తాను రక్షించుకోవాలి.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాద యేత్ ।
అత్మైవహ్యాత్మనో బంధుః అత్మైవరి పురాత్మనః ॥ భ.గీ. (6-5)

మానవుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. తన ఆత్మను అధోగతి పాలు చేసు కోకూడదు. తనను తాను పోషించుకోలేని వాడు ఇతరులనెట్లు పోషించగలడు? అని గీతాభోధ:-

**యచ్ఛ్విన్తి తమదిగర్భం యచ్ఛచిరం చిన్తితం నరకే ।**
**విషయానిల సంసర్గాన్మమృజే, తత్సర్వమేక పదే ॥ (79)**

అధిగర్భం=గర్భంలో; యత్=ఏది; చిన్తితం=చింతించబడినదో; నరకే=నరకంలో; యత్=ఏది; చింతితం=చింతించబడినదో; తత్సర్వం=అదిఅంతా; విషయానిల సంసర్గాత్=విషయాల గాలితాకుడువలన; ఏకపదే=ఒకేసారి; మమృజే= కొట్టుకొని పోయింది;

గర్భవాసమే ఒకనరకం; అదేకాకుండా నరకలోకంలో ఉన్నప్పుడు, ఆబాధల తట్టుకోలేక భగవంతుని అనేక విధాలవేడుకుంటాడు. తన కర్మలగూర్చి దుఃఖిస్తాడు. ఇక ఎన్నడూ భగవంతుని మరువనని ఒట్టుపెట్టుకొంటాడు. మాతృగర్భం నుంచి బైటపడగానే విషయాల గాలి తగులుతుంది. దాంతో ఒక్కసారిగా వాటినన్నింటినీ మరచిపోతాడు. ఆప్రమాణాలు, ఆ విచారాలు అన్నీ ఒక్కసారిగా ఆగాలికి కొట్టుకుపోతాయి:-

**బాహ్యగతాగతశీలా ప్రాణస్య శ్వాసలక్షణా వృత్తిః ।**
**కర్షతి మనసోవృత్తిం కులటేవ కులస్త్రియం ముగ్ధామే ॥ (80)**

బాహ్యగతాగతశీలా=వెలుపలికి వస్తూపోతూండే స్వభావంకల; శ్వాస లక్షణా=శ్వాస లక్షణమైన; ప్రాణస్యవృత్తిః=ప్రాణముయొక్క వృత్తి; ముగ్ధాం=అమాయకురాలైన; కులస్త్రియం=కులస్త్రీని; కులటేవ=వేశ్యవలె; మనసఃవృత్తిః=మనోవృత్తిని; కర్షతి=లాగు తుండును;

శ్వాసఅనేది ప్రాణలక్షణం: అదిబైటికి వస్తూపోతూంటుంది. మనసు అమాయకురాలైన కులస్త్రీ వంటిది. బైట తిరుగుళ్ళు మరిగిన కులటవలె ఈశ్వాస, మనసును విషయాల

వైపు మళ్ళిస్తూఉంటుంది. దాన్ని చెడకొట్టుతుంది; అందుకే "యొగశ్చిత్త వృత్తి నిరోధః" అని పతంజలి యోగసూత్రం; మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః; బంధానికి మోక్షనికి మనస్సే కారణం. దానిని అదుపులో పెట్టుకుంటే కులస్త్రీ వలె ఉంటుంది-స్వేచ్ఛగా వదిలినామంటే కులటవలె అవుతుంది:-

**అతిగంభీర మనావిల మక్షోభ్యమ దృష్టపార మవిలంఘ్యమ్ ।**
**అవిరల తరంగ సంకులమమైక్షసి విజ్ఞాన సాగరం మహతామ్ ॥ (81)**

అతిగలభీరం=చాలాగంభీరమైనది; అనావిలం=వ్యాకులంచెందనిది; అక్షోభః=క్షోభింప జేయ శక్యము కానిది; అదృష్టపారం=అపారమైనది; అవిరల తరంగ సంకులం=అనేక తరంగాలతో సంకులమైనదీ; మహతాం=మహాపురుషులుయొక్క; విజ్ఞానసాగరం= విజ్ఞానసాగరాన్ని; ఐక్షిషి=చూచినాను;

మహాత్ముల విజ్ఞానం మహాసముద్రం వంటిది. అది చాలా గంభీరమైనది, తరగనిది. క్షోభింపసాధ్యము కానిది. దాని ఆవలిగట్టును చూడలేము. ఎన్నో అలలు కలది. అలాంటి విజ్ఞానాన్ని దర్శించినాను.

**ఘోరం భవమపహాతుం కతిచిద ఘోరం భవం ప్రపద్యన్తే ।**
**సంసరణ కాతరాణాం సంసరణం శాంభవీభక్తిః ॥ (82)**

ఘోరం=భయంకరమైన; భవం=సంసారాన్ని; అపహాతుం=విడుచుటకొరకై; కితిచిత్= కొంతమంది; అఘోరంభవం=అఘోరుడైన భవుని; ప్రపద్యన్తే=శరణు పొందెదరు; సంసరణకాతరాణం=సంసారాన్ని గూర్చి భయపడేవారికి; శాంభవీభక్తిః=శాంభవీభక్తియే; సంసరణం=నడిపించే ఉపాయము; (శంభుని భక్తియే ఉపాయము.,)

ఘోరమైన సంసారాన్ని త్యచించుటకై కొంతమంది అఘోరుడైన (శికని పంచముఖాలలో అఘోరమైన ముఖము దక్షిణ ప్రక్కయున్నది) శివుని శరణు పొందెదరు. సంసారాన్ని చూచి భయపడే వారికి శాంభవీభక్తియే తరణోపాయము:-

**పాశోయది మోక్తవ్యః పశుపతి రేవాను సర్తవ్యః ।**
**నఖలు వ్యతిముచ్యన్తే పశవః పాశేన సంబద్ధాః ॥ (83)**

పాశః=పాశము; మోక్తవ్యఃయది=విడుపించుకొనదగినదైతే; పశుపతిరేవ=పశుపతియే; అనుసర్తవ్యం=అనుసరించదగినవాడు; పాశేనసంబద్ధాః=పాశంచేత బంధించబడిన; పశవః=పశువులు; నవ్యతిముచ్యన్తేఖలు=తమంత తాముగా విడిపించుకోలేవుగదా!

తమబంధాలను వదలించుకోవాలంటే, వాటిని కట్టినవాడే రావాలి. మనమంతా పశువులము మనకు పతి పశుపతి అయిన శివుడే. మనపాశాలు సంసారాలే సంసారమంటే అజ్ఞానమే. పశువుల పలుపులను అవిగా తొలగించుకొన లేవు.

పశుపతియే వచ్చి ఆ మెడతాళ్ళను విప్పాలి. అందుచేత శివునే ఆశ్రయించాలి.

**అలమల మనుభూతాభిర్మాతృ భిరలమస్తు పితృభిశ్చ ।**
**భవితవ్యం యది నిత్యవదర్థం మాతుః పితుశ్చాస్తు ॥ (84)**

అనుభూతాభిః=అనుభవింపబడిన; మాతృభిః=తల్లులచేత; అలంఅలం=చాలుచాలు; పితృభిశ్చ=తండ్రుల చేతను; అలమస్తు=చాలునుగాక; భవిత్యంయది=భవిష్యత్తులో కూడా తల్లిదండ్రుల అనుభవం ఉండాల్సేఉంటే; మాతుఃఅర్థం=సగంతల్లీ; పితుఃఅర్థంచ=తండ్రిలో సగము; నిత్యవత్=ఎల్లప్పుడు; అస్తు=ఉండుగాక;

ఎన్నో జన్మలలో ఎందరో తల్లులా, తండ్రులా చూచాను. ఆ అనుభవం చాలుచాలు; ఈ మాతా పితల అనుభవం తప్పక ఉండాలంటే అర్థనారీశ్వరుడైన (సగం తల్లీ సగం తండ్రి అయిన శంకరుడు)శివుని వల్లనే కలుగుగాక. ఎల్లప్పుడూ ఆ కైలాసంలో ఉండి నాకు వారి సేవలభించుగాక!-

**ధన్యాస్తే బహుదేవాః స్వామిని యేషాం నదుర్భిక్షమే ।**
**జాతునజానీమో వయమేకమపి స్వామినం పూర్ణమే ॥ (85)**

యేషాం=ఎవరికి; స్వామిని=దేవుని విషయంలో; దుర్భిక్షంన=దుర్భిక్షంలేదో; తే=అట్టి; తేబహుదేవాః=అట్టి అనేక దేవెళ్ళుకలవారు; ధన్యాః=అదృష్టవంతులు; వయం=మేమైతే; పూర్ణం=పూర్ణుడైన; ఏకంస్వామినపి=ఒక్కదేవుణ్ణికూడా; జాతు=ఎన్నడూ; నజానీమః= ఎరుగము;

చాలామందికి దేవుళ్ళ దరిద్రం లేదు, కావలసినంత దేవుళ్ళున్నారు. ఆభక్తులు చాలా అదృష్టవంతులు. మాకయితే పరిపూర్ణుడైన దేవుడు ఒక్కడు కూడా దొరకలేదు:-

నీలకంఠదీక్షితుల వారు మహాశివభక్తుడు. ఆయన అర్థనారీశ్వరారాధకుడు. శంకరుడు అర్థనారీశ్వరుడు. ఆయనకు పూర్ణస్వరూపంలేదు. అందుచేత చమత్కరిస్తున్నాడు. అనేక దేవతోపాసకులను పరిహసిస్తున్నాడు. నీలకంఠ దీక్షితులు శివోత్కర్షమంజరి అనే స్తోత్రంలో "నస్వామీమమదైవతం తదితరో నామ్నాపి నామ్నాయతే" అనే మకుటంతో తన శివభక్తిని చాటుకొనినాడు.

**సన్తు బృహన్తోదేవాః కింతునతాన్నన్తు మీహతే చేతః ।**
**అధ్యవదాన్య న్యాయా దన్తక జితమేవ చిన్తయతే ॥ (86)**

బృహన్తఃదేవాః=గొప్పదేవతలు; సన్తు=ఉంటేఉందురుగాక; కింతు=కానీ; చేతః= చిత్తము; తాన్=వారిని; నన్తుం=నమస్కరించుటకు; నఈహతే=ఇష్టపడటం లేదు; అధ్యవదాన్యన్యాయాత్=అధ్యవదాన్య న్యాయం ప్రకారం; అంతకజితమేవ=యముణ్ణి

జయించిన శివుణ్ణే; చిన్తయతే=చింతించుచున్నది:-

గొప్పగొప్పదేవతలు ఎందరో ఉంటే ఉండవచ్చును కానీ నామనస్సు ఆదేవుళ్లకు నమస్కరించుటకు ఇష్టపడటంలేదు. ఆఢ్యవదాన్య న్యాయం ప్రకారం మృత్యుం జయుణ్ణి సేవించడమే మేలని నా మనస్సుకు అనిపిస్తోంది:-

ఆఢ్యవదాన్య న్యాయం=ఆ ధనాఢ్యుడు బలాఢ్యుడు, పూజనీయులు ఉన్నారు. అయినావారు మృత్యువును జయించలేదు.

**నిధ్యాయసి విషయ సుఖం నధ్యాయసి విషమ మస్యపరిపాకమ్ ।**
**బన్ధుంతమేవ చిన్తయ బన్ధుం మోక్తుం చయఃక్షమతే ॥ (87)**

విషియసుఖం=విషయసుఖాన్ని గూర్చి; నిధ్యాయసి=ధ్యానంచేస్తూంటావు; అస్య=దీని యొక్క; విషమం=విషమమైన; పరిపాకం=పరిక్వతనుగూర్చి; నధ్యాయసి=ఆలోచించవు; యః=ఎవడు; బన్ధుం=బంధించడానికి; మోక్తుంచ=వదలిపెట్టడానికి; క్షమతే=సమర్థుడో; తం=ఆ; బన్ధుంఏవ=బేధువైన సదాశివునే; చింతయ=చింతించు;

విషయసుఖాలను గూర్చే ధ్యానిస్తున్నావు, కానీ వాటిదుష్ఫలితాలు ఎలావుంటాయో నీవు ఆలోచించడం లేదు. బంధించడానికీ, విముక్తుణ్ణి చేయడానికీ సమర్థుడైన పశు పతినే ధ్యానించు.

**సదనం గురూపసదనం చరణం పంచాక్షరీ పురశ్చరణమ్ ।**
**ధన మభిలాష నిరోధన మత్యాశ్రమ వర్తినాం పుంసామ్ ॥ (88)**

అత్యాశ్రమ వర్తినాం=ఆశ్రమాలని అతిక్రమించి యుండే; పుంసాం=పురుషులకు; గురూప సదనం=గురువును సమీపించడమే; సదనం=గృహము; పంచాక్షరీ పురశ్చరణం=పంచాక్షరీ మంత్రపురశ్చరణ చేయడమే; చరణం=ఆచరణ; అభిలాష నిరోధనం=అభిలాషలను నిరోధించడమే; ధనం=ధనము;

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములకతీతులైయుండే వారికి గురూప సదనమే గృహము, పంచాక్షరీ పురశ్చరణమే చరణము కోర్కెల నిరోధనమే ధనము:-

**సవిధిర్యత్తే విదధతి సప్రతిషేధోయతో నివర్తన్తే ।**
**సోపనిషద్యద్బ్రువతే శైవాశ్రమ వర్తినో ధీరాః ॥ (89)**

శైవాశ్రమ వర్తినః=శైవాశ్రమంలో ఉండే; తేధీరాః=ఆ ధీరులు; యతి=ఏది; విదధతి= చేస్తారో; సః=అది; విధిః=విధి; యతః=దేనినుండి; నివర్తన్తే=విరమించుకొంటారో; సః=అది; ప్రతిషేధః=నిషిద్ధము; యత్=ఏది; బ్రువతే=చెపుతారో; సా=అది; ఉపనిషత్=ఉపనిషత్తు;

శైవాశ్రమంలో ఉండేధీరులు ఏదిచేస్తే అది విధి; దేనిని చేయరో అది నిషేధము. వారుఏది చెపుతారో అది ఉపనిషత్:-

నారద భక్తిసూత్రం 69 ప్రకారం "తీర్థీకుర్వన్తి తీర్థాని సుకర్మీకుర్వన్తి కర్మాణి, సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి" ఆ భక్తులు తీర్థములను పావనం చేస్తారు. వారుచేసేవి సత్కర్మలు వారుచెప్పినవి శాస్త్రములే అవుతాయి.

**కౌపితరౌ యౌజగతాం కఃస్వామీయఃప్రపంచస్య ।**
**ప్రత్యస్తమితే భేదేతత్కిమిదం కిమితి ప్రశ్నః ॥ (90)**

పితరౌ=తల్లిదండ్రులు; కౌ=ఎవరు?; జగతాం=జగత్తులకు; యౌ=ఎవరో (వారే తల్లి దండ్రులు); స్వామీ=దేవుడు; కః=ఎవడు?; యః=ఎవడు; ప్రంపచస్య=ప్రపంచానికి (దేవుడో వాడే దేవుడు); భేదే=భేదము; ప్రత్యస్తమితే=తొలగిపోతూండగా; తత్=అప్పుడు; ఇదం=ఇది; కిం=ఏమిటి; ఇతి=అని; ప్రశ్నఃకః=ప్రశ్నఏమున్నది?;

నీ పితురులెవరు? జగత్తుకు పితరులేనా తల్లిదండ్రులు, నీ ప్రభువు ఎవరు? జగత్తుకు స్వామి ఎవడో వాడేనాకున్నూస్వామి, బేద బుద్ధిపోయిన తర్వాత, ఇది ఏమిటిది అది ఏమిటిది అని అడగడానికి తావేలేదు.

**త్యజ సంసార మసారం భజశరణం పార్వతీరమణమ్ ।**
**విశ్వసిహి శ్రుతి శిఖరం విశ్వమిదం తవ నిదేశకరమ్ ॥ (91)**

అసారం=సారహీనమైన; సంసారం=సంసారాన్ని; త్యజ=వదలిపెట్టుము; పార్వతీ రమణం=పార్వతీపతిని; శరణంభజ=శరణుపొందుము; శ్రుతిశిఖరం=ఉపనిషత్తును; విశ్వసిహి= విశ్వసింపుము; ఇదం=ఈ; విశ్వం=ప్రపంచము; తవ=నీ; నిదేశకరం=ఆజ్ఞను పాలిస్తుంది.

ఈ సారంలేని సంసారాన్ని వదలిపెట్టుము. శంకరుని శరణుపొందుము. "మృత్యుంజ యాపాహి" అని వేడుకొనుము. ఉపనిషత్తులను నమ్ముము. అప్పుడే ప్రపంచమంతా నీకు స్వాధీనం అవుతుంది.

**భవ్యమభవ్యం వానఃప్రలిఖితు వేధాః సుదుర్మేధాః ।**
**సవ్యమసవ్యం వానశ్చరణం శరణం మహేశస్య ॥ (92)**

సుదుర్మేధా=మంచి,చెడ్డ బుద్ధిగల; వేధాః=బ్రహ్మ; భవ్యంవా=మంచినికానీ; అభవ్యంవా= చెడుగును కానీ; నః=మాకు; ప్రలిఖతు=వ్రాస్తేవ్రాయనీ; నః=మాకు; మహేశస్య=మహేశ్వ రుని; సవ్యంవాచరణం=ఎడమ పాదంగానీ(ఎడమ పాదము పార్వతీ దేవిది); అసవ్యంవా=కుడిపాదముగానీ; శరణం=శరణము;

సుదుర్మేధుడైన ( ) గల ఆ బ్రహ్మమానొసట మంచి వ్రాసినా పరవాలేదు; చెడ్డ వ్రాసిన చింతలేదు; పరమేశ్వరుని ఎడమపాదమో (యముణ్ణే తన్నినది) అయినా శివుని కుడిపాదమో మాకు శరణము:-

**వేధాఃకథం హరికథ మితితు ప్రశ్నేవయంముకాః ।**
**శివమేకం జానీమస్తస్మాదన్యం నజానీమః ॥** (93)

వేధాఃకథం=బ్రహ్మఎట్లుంటాడు; హరిఃకథం=విష్ణువెట్లుంటాడో; ఇతి=అనే; ప్రశ్నేతు=ప్రశ్న విషయంలో అయితే; వయం=మేము; మూకాః=మూగవారము; ఏకం=ఒక్క; శివం=శివుని మాత్రమే; జానీమః=ఎరుగుదుము; తస్మాత్=ఆ శివుని కంటే; అన్యం=ఇతరుని ; నజానీమః=ఎరుగము;

బ్రహ్మఎట్లుంటాడు? విష్ణువు ఎట్లుంటాడు అని ఎవరైనా మమ్మల్ని ప్రశ్నిస్తే మేము మౌనం వహించవలసి ఉంటుంది. మాకు శివుని మాత్రమే తెలియును. ఆయనకంటే వేరైన మరెవర్నీ తెలియదు. మాకు అంతా శివమయమే. "ఈశావాస్యమిదం సర్వం" అని ఈశోపనిషత్తు చెప్పుచున్నది.

**దారుణ మసి పత్రవనం దారుణ తమ మన్ధతామిస్రమ్ ।**
**కావాతతః క్షతిర్నః శైవా వయ మాచతుర్వదనాత్ ॥** (94)

అసిపత్రవనం=అసి పత్రవనము; దారుణం=భయంకరమైనది; అంధతామిస్రం=అంధతామిస్రనరకము; దారుణతమం=మరీ భయం కరమైనది; తతః=దానివలన, నః=మాకు; కాక్షతిః=ఏమినష్టము?; ఆ చతుర్వదనాత్=బ్రహ్మమొదలుకొని; వయం=మేము; శైవాః=శైవులం;

నరకాలలో అసిపత్రమనే నరకం భయంకరమైనది. అంధతామిస్రమనే నరకం ఇంకా భయంకరమైనది. అయినను మాకేమియు భయంలేదు మా మూలపురుషుడు బ్రహ్మ; ఆయన మొదలు మా వంశం వాళ్ళమందరమూ శివభక్తులమే. మాకు నరకం భయమేలేదు:-

మహాపాపులు ఉండేది అంధతామిస్రం, ఉపమన్యుడనే శివయోగి అంధతామిస్ర నరకాన్ని చూచుటకు యముని అనుమతితో వచ్చాడు. ఆయన అక్కడ హరహరా అని నాడు. వెంటనే అక్కడున్న ఆ పాపులందరూ ఒక్కసారిగా కైలాసానికి పొయ్యారు. శివ నామమునకే అంత మహిమ యుండగా శివభక్తులకు నరక భయమేల ఉంటుంది:-

**కృతదీక్షో ఘోరమఖే కులకూట స్థోభరద్వాజః ।**
**విద్యేశ్వరేషు కశ్చన పితామహోన ఇతివిస్రంభః ॥** (95)

ఘోరమఖే=ఘోరమైన యజ్ఞమందు; కృతదీక్షః=దీక్షవహించిన; భరద్వాజః=భరద్వాజ మహర్షి; కులకూటస్థః=మూలపురుషుడు; నః=మాయొక్క; పితామహః=పితామహుడు; విద్యేశ్వరేషు=విద్యాధికులలో; కశ్చన=ఒకడు; ఇతి=అని; విస్రంభః=మావిశ్వాసము:-

ఘోరమైన యజ్ఞానికి దీక్షవహించిన భరద్వాజ మహర్షి మా వంశానికి మూలపురుషుడు. (మాది భరద్వాజ గోత్రము); మా పితామహుడు మహా పండితుడు (అప్పయ్య దీక్షితులు నీలకంఠ దీక్షితులకు పెద్దతాత) అటువంటి వంశానికి చెందిన మాకు ఏ భయమూ లేదు.

**కలహః కదాపి మాస్త్వితి కలిత శరీరైక్యయోః శివయోః ।**
**అహ మస్మ్యహస్మీతి ప్రాప్తః కలహోమమత్రాణే ॥ (96)**

కదాపి=ఎప్పుడూ; కలహః=తగవు; మాస్తు=కలుగకుండుగాక; ఇతి=అని; కలితశరీరైక్యయోః=శరీరైక్యాన్ని పొందిన; శివయోః=పార్వతీ పరమేశ్వరులకు; మమత్రాణే=నన్ను రక్షించు విషయంలో; అహమస్మిఅహమస్మిఇతి=నేనున్నాను, నేనున్నానని అని; కలహః= కలహము. ప్రాప్తః=వచ్చినది:-

విడివిడిగా వుంటే తగవులు వస్తూంటాయి అని అనుకొని పార్వతీ పరమేశ్వరులు ఒకటైపోయ్యారు. అయినా వారికి జగడాలు తప్పడంలేదు. నన్ను కాపాడే విషయంలో నేనున్నాను; నేనున్నాను అని కలహించుకొంటూ ఉంటున్నారు.

**నరకాయాపి నభోగాన్ నరాధమాయాపి నాన్యసురాన్ ।**
**మన్యన్తే కతిచిదమీ మాహేశ్వర మాశ్రితా యోగమ్ ॥ (97)**

మహేశ్వరం యోగం=శివభక్తిని; ఆశ్రితాః=ఆశ్రయించిన; అమీ=ఈ; కతిచిత్= కొంతమంది; భోగాన్=విషయ సుఖాలను; నరకాయాపి=నరకంగానైనా; నమన్యన్తే= తలపరు; అన్యసురాన్= ఇతరదేవతలను; నరాధమాయాపి=నరాధముడుగా కూడా; నమన్యన్తే=తలనరు;

కొంతమంది వీరశైవులు విషయభోగాలను, నరకానికంటే నీచమనీ, ఇతర దేవతలు నరాధములకంటే అధములనీ భావిస్తారు.

**జ్ఞాతుం హాతుం విషయం శ్రోతుం మన్తుం గ్రహీతు మాత్మానమ్ ।**
**వత్సాయది నహిఘటతే తత్సాధయతా విముక్తాయ ॥ (98)**

వత్సాః=బిడ్డలారా!; విషయం=భోగ్య విషయాన్ని; జ్ఞాతుం=తెలిసికొనుటకూ; హాతుం= దానిని విడిచిపెట్టుటకూ; ఆత్మానం=ఆత్మను; శ్రోతుం=వినుటకు, మన్తుం=మననము చేయుటకూ; గ్రహీతుం=తెలిసికొనుటకూ; నఘటతేయది=కుదరకపోతే, తత్=అప్పుడు:

అవిముక్తాయ=కాశీక్షేత్రానికి; సాధయత=పొంది;

విషయాల నిజ స్వరూపాన్ని తెలిసికొని, వాటిని విడిచిపెట్టడానికీ, ఆత్మజ్ఞానం సంపాదించడానికీ వీలుకాకపోతే, బిడ్డలారా కాశీ క్షేత్రానికి పొంది అక్కడ కాశీ విశ్వేశ్వర విశాలాక్షులున్నారు. మీకు జ్ఞానాన్ని ప్రసాదిస్తారు.

**సాంఖ్యం యోగోనియమా భక్తిః కర్మప్రవత్తిరితి ।**
**ఏకత్ర సకలమే తత్కేవలమ విముక్త మేకత్ర ॥ (99)**

సాంఖ్యమూ, యోగమూ, నియమములు, భక్తి, కర్మలు, ప్రపత్తి, ఇవన్నీ ఒక ఎత్తు-కేవలం కాశీక్షేత్రం ఒక ఎత్తు:-

**బద్ధఃకస్తే వక్ష్యతి ముక్తోముక్తిం నజానాతి ।**
**యాస్యసిచేద విముక్తం జ్ఞాస్యసి విశ్వేశ్వరస్య ముఖాత్ ॥ (100)**

బద్ధః=బద్ధుడు; కః=ఎవడు; తే=నీకు; ముక్తిం=ముక్తిని గూర్చి; వక్ష్యతి=చెప్పగలడు?; ముక్తః=ముక్తుడు; నజానాతి= ఎరుగడు; అవిముక్తం=కాశీక్షేత్రానికి; యాస్యసిచేత్= నీవు పోతే; విశ్వేశ్వరస్య=విశ్వనాధుని; ముఖాత్=ముఖంనుంచి; జ్ఞాస్యసి= తెలుసుకొంటావు:-

బద్ధుడైనవాడిని ముక్తిని గూర్చి అడిగితే వాడేమి చెప్పగలడు? ముక్తుడు శరీర భావంలేని వాడు కాబట్టి అతడు చెప్పలేడు. అవిముక్తక్షేత్రానికి పోతే అక్కడ విశ్వేశ్వరుడే నీకు చెప్పతాడు, ముక్తినీ ప్రసాదిస్తాడు:-

**నగృహీతం శ్రుతి హృదయం నచనిగృహీతం పరిప్లవం హృదయమ్ ।**
**ఇచ్ఛామి చధామపరం గచ్ఛామిచ విశ్వనాథపురమ్ ॥ (101)**

శ్రుతిహృదయం=ఉపనిషత్తుల సారం; నగృహీతం=గ్రహింపబడలేదు; పరిప్లవమ్= చంచలమైన; హృదయంచ=హృదయంకూడా; ననిగృహీతం=నిగ్రహింపబడలేదు; పరంధామ=పరంధామాన్ని; ఇచ్ఛామిచ=కోరుచున్నాను; విశ్వనాథపురం=కాశీపట్టణానికి; గచ్ఛామి=పోవుచున్నాను;.

ఉపనిషత్తుల సారాన్ని గ్రహించలేదు, చంచలమైన మనస్సును నిగ్రహించలేకున్నాను; కానీ పరమ పదాన్ని పొందాలని వుంది. కాబట్టి విశ్వనాథపురానికి పోయెద:-

ఇది శ్రీ నీలకంఠ దీక్షిత విరచిత వైరాగ్యశతకం

# సంపూర్ణము

# భర్తృహరి సుభాషితమ్
# వైరాగ్యశతకమ్

**చూడోత్తంసితచారు చంద్రకలికా చంచచ్ఛిఖా భాస్వరో**
**లీలాదగ్ధ విలోలకామ శలభః శ్రేయోదశాగ్రే స్ఫురన్**
**అన్తఃస్ఫూర్జదపారమోహతిమిర ప్రాగ్భార ముచ్చాటయం**
**శ్చేదస్సద్మనియోగినాం విజయతే జ్ఞానప్రదీపోహరః ॥** **(1)**

ఒప్పిన శిరస్సునందున్న చంద్రుడనెడి యగ్నిచే ప్రకాశించి, మన్మధుడనెడి మిడుతను నాశనముచేసి, శుభంకరమగు వత్తి కొనచే వెలుగుచు ధృఢమై అంతులేని యజ్ఞాన మనెడి చీకటిని తొలగించుచు, దైవమగు శివుడు యోగులయొక్క మనస్సులనెడి గుహలయందు జ్ఞానప్రకాశముచే ప్రకాశించు చున్నాడు.

**భ్రాన్తం దేశమనేకదుర్గవిషయం ప్రాప్తం నకించిత్ఫలం,**
**త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవా కృతా నిష్ఫలా,**
**భుక్తం మానవివర్జితం పరగృహేష్వాశంకయా కాకవ,**
**తృష్ణే! జృమ్భసి పాపకర్మ పిశునే నాద్యాపి సంతుష్యసి** **(2)**

ప్రవేశింపరాని చెడ్డ దేశములలో తిరిగి విసుగుచెందితిని. కులాభిమానము వదలి గౌరవముపోవ సేవలు చేసితిని. ఆపదనొంది పరగృహములయందు కాకివలె భుజించితిని, ప్రయత్నములు వ్యర్థము లాయెను. ఓ దురాశా! సంతుష్టినొందవు. క్రూరకర్మలచే దౌష్ట్యమునే చూపుచున్నావు ఎందులకు?

**ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం, ధ్మాతా గిరేర్ధాతవో,**
**నిస్తీర్ణస్సరితాంపతి, ర్నృపతయో యత్నేన సంతోషితాః**
**మన్త్రారాధన తత్పరేణ మనసా నీతాః శ్మశానే నిశాః**
**ప్రాప్తః కాణవరాటకో 2 పినమయాతృష్ణే! సకామాభవ ॥** **(3)**

ఓ దురాశా! నిక్షేపమను సంశయముతో భూమిని త్రవ్వితిని ఓడపై సముద్రమును దాటితిని. కొండలమీది ధాతువులను కరగించితిని. బాధనొంది భయంకరమగు మంత్ర జపమును అక్కరతో చేసితిని. ఏవిధముగను గవ్వయైనను పొందలేదుగదా! సంతోషమును పొందుమా!

**ఖలోల్లాపాస్సోఢాః కథమపి తదారాధనపరై,**
**ర్నిగృ హ్యాన్తర్బాష్పం హసిత మపి శూన్యేన మనసా,**
**కృతో విత్తస్తమ్భ ప్రతిహతధియా మఞ్జలిరవి,**
**త్వమాశే 2 మోఘాశే కిమపరమతో నర్తయసి మామ్ ॥ (4)**

నీచులనెడి మాటల నోర్చుకొంటిని, కనులనీరు గ్రుక్కుకొనుచు తలంపు లేకయే వెర్రి నవ్వులు నవ్వితిని, తెలివిలేక ధనరోగముచే బుద్ధిహీనులైన వారికి నమస్కరించితిని. అయ్యో! ఓ దురాశా! ఇంకను నీవు నన్ను ఎయేపనుల చేయ పురికొల్పెదవో.

**అమీషాం ప్రాణానాం తులిత బిసినీ పత్రపయసాం**
**కృతేకిం నాస్మాభిర్విగళితవివేకైర్వ్యవసితం?**
**యదాఢ్యానా మగ్రేద్రవిణమదనిస్సంజ్ఞ మనసాం**
**కృతం వీతవ్రీడైర్నిజగుణ కథాపాతకమపి ॥ (5)**

తలంపగా ప్రాణములు తామరాకుపైని నీటివలె చంచలములైనవి. వీనికై బలవంత మగు ధన గర్వముచే గలిగిన రోగములు గల లోభులయెదుట ఆత్మగుణస్తుతియను గొప్ప దోషమును చేయుటచే తెలివిలేక మేము చేయని చెడ్డపనులు లేవు.

**క్షాంతం న క్షమయా, గృహోచితసుఖం త్యక్తం ననంతోషత,**
**స్సోఢో దుస్సహశీత వాత తపన క్లేశో, నతప్తం తపః**
**ధ్యాతం విత్తమహర్నిశం నియమిత ప్రాణైర్న శమ్భోః పదం**
**తత్తత్కర్మ కృతం యదేవమునిభి స్తైస్తైః ఫలైర్వంచితాః ॥ (6)**

అవమానమునోర్చుట ఓర్పుచేతకాదు. ఇంటిలోని సుఖములను వదలుట సంతోషము చేతగాదు. అణచరాని శీతోష్ణములను జయించుట తపస్సు చేయుట చేతకాదు. ధ్యానము ధనము మీదగాని శివునిమీదగాదు. మాకు మహర్షుల కృత్యములు కలిగినవేగాని వాని వలని సత్ఫలములు మాకు లేవు.

**భోగా నభుక్తా, వయమేవభుక్తా, స్తపోనతప్తం, వయమేవతప్తాః**
**కాలోనయాతో, వయమేవయాతా, స్తృష్ణావ జీర్ణా, వయమేవ జీర్ణాః ॥ (7)**

సుఖములనుభవించుట, తపముచేయుట, కాలమును గడచినవేగాని దురాశ ప్రయత్నమునకు విశ్రాంతిలేదు. ఆహా! అత్యాశ యధికమై కష్టము తెచ్చినది.

**వలిభిర్ముఖమాక్రాన్తం పలితై రంకితం శిరః**
**గాత్రాణి శిథిలాయన్తే తృష్ణై కా తరుణాయతే ॥ (8)**

చేతులు, కాళ్లు మున్నగు అవయవముల బరువు తగ్గెను. మొగము నిండ ముడుతలు బడెను. తలయంతయు తెల్లబడెను. దిక్కు(అంతు)లేని యాశ యొక్కటే వయస్సు పొందుచున్నది.

**నివృత్తా భోగేచ్ఛా, పురుషబహుమానో2పి గళిత**
**స్సమానా స్స్వర్యాతా స్సవది సుహృదో జీవిత సమాః**
**శనైర్యష్ట్యుత్థానం, ఘన తిమరరుద్ధేచ నయనే**
**అహోమూఢః కాయ, స్తదపి మరణాపాయ చకిత ః ॥** (9)

సుఖమందలి యాశపోయెను. గౌరవము నశించెను. పుణ్యాత్ములగు విడువరాని స్నేహితులు గతించిరి. దండమూత గొనుట తటస్థించెను. కన్నులు చీకటి రోగముచే గ్రమ్మబడెను. శరీరము వృద్ధత్వము నందెను. ప్రాణములు వదలవలయుననెడి భయముచేతవణుకుచున్నాడు. ఎంతటి మోహమో కదా ।

**ఆశానామ నదీ మనోరథజలా, తృష్ణాతరంగాకులా,**
**రాగగ్రాహవతీ, వితర్కవిహగా, ధైర్యద్రుమ ధ్వంసినీ,**
**మోహావర్త సుదుస్తరాతిగహనా, ప్రోత్తుఙ్గ చిన్తాతటీ**
**తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః ॥** (10)

చక్కని కోరికలు జలములు, ఆశలుపెద్ద అలల మొత్తములు, అనురాగములు మొసళ్లు, అజ్ఞానము సుడులు, ఊహలు పక్షులు కాగా, ధైర్యమనెడి మహావృక్షమును పడగొట్టు దురాశయనెడి పెద్ద నదిని మహాయోగులు దాటి శాశ్వత సుఖమును పొందుదురు.

**నసంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం,**
**విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః**
**మహద్భిః పుణ్యౌఘైశ్చిర పరిగృహీతాశ్చ విషయా**
**మహాన్తో జాయంతే వ్యసన మివ దాతుం విషయిణామ్ ॥** (11)

సంసారమున గలుగు సత్కార్యమును మంచిదని చూడుము. యోచింపగా పుణ్యకార్యములకు ఫలమైన సంపదగూడ భయమును కలిగించునదియే. పరిశుద్ధములగు పూర్వ పుణ్యముచే సంపాదింపబడిన చందనాది భోగమహిమయును భోగవంతుల కపాయము చేయుటకే వృద్ధినందు చున్నది.

**అవశ్యం యాతారశ్చిరతర ముషిత్వాऽపి విషయాః**
**వియోగే కోభేద స్త్యజతి నజనోయత్స్వయ మమూన్**
**వ్రజన్త స్వాతంత్ర్యాదతుల పరితాపాయమనస**
**స్స్వయం త్యక్తా హ్యేతేశమ సుఖమనంతం విదధతి ॥ (12)**

భోగములు చిరకాలమున్నను వేగముగ తొలగిపోవును. పురుషుడు వేగము బోవునా భోగములను వదలడు. చింతింపనా ఎడబాటు వేరగునా? భోగముల మనుష్యుని వదలి యతనికి సంతాపము కలిగించును. పురుషుడే భోగములను వదలిన శాశ్వతమగు శాంతి సుఖమును బొందును.

**బ్రహ్మజ్ఞాన వివేకినోऽ మనధియః కుర్వన్త్యహోదుష్కరం**
**యన్ముంచన్త్యుపభోగ భాఞ్జ్య పిధనాన్యేకాన్తతో నిస్పృహ**
**నప్రాప్తాని పురాన సంప్రతి నచప్రాప్తాదృఢప్రత్యయో**
**వాంఛా మాత్ర పరిగ్రహాణ్యపి పరంత్యక్తుం నశక్తావయమ్ ॥ (13)**

పుణ్యాత్ములును సంపూర్ణ జ్ఞానము కలవారునుయగు మహాత్ములు సుఖకారణమగు గొప్పధనమును నిరాశులై విచిత్రముగ వదలెదరు. మేము పూర్వము పొందనియు ఇప్పుడు పొందలేనివియు ముందు పొంద శక్యము కానివియునగు మనస్సున తోచు భోగములను కొంచెము కూడ మానలేకున్నాము.

**ధన్యానాంగిరి కందరేషు వసతాం జ్యోతిః పరం ధ్యాయతా**
**మానందా శ్రుజలం పిబంతి శకునా నిశ్శంక మంకేశయాః**
**అస్మాకంతు మనోరథోపరచిత ప్రాసాదవాపీ తట**
**క్రీడాకానన కేళి కౌతుక జుషామాయుః పరం క్షీయతే॥ (14)**

కొండ గుహలలో నివసించి శివధ్యానముచేయు సజ్జనుల అనందభాష్పముల నీటి చుక్కల త్రాగుచు పక్షులు స్థిరముగ యుండును. పరిశుద్ధమగు మనస్సునందు నిర్మించు కొనిన మేడలు, నడబావులు శ్రేష్ఠములగు వనముల యందు క్రీడించు అభిప్రాయముగల వారలకు ఆయువే క్షీణించును.

**భిక్షాశనం తదపి నీరసమేక వారం**
**శయ్యాచ భూః పరిజనోనిజదేహ మాత్రమ్**
**వస్త్రంసు జీర్ణ శతఖండమయీచకంథా**
**హహాతథాపి విషయాన్న జహాతి చేతః (15)**

ఎల్లప్పుడు ఒచ్చుమాహారము. అది నిస్సారము, అదియూనొక్కపూటయే - నేలపడక- శరీరము మాత్రమే సహాయము. చింపి గుడ్డపేలికలతో చేసిన బొంత వస్త్రము - ఈ విధముగ జరుగుచున్నను, విషయేచ్ఛలు వదలవు కదా! .

**స్తనౌ మాంసగ్రంథీ కనక కలశావిత్యుపమితౌ,**
**ముఖం శ్లేష్మాగారం, తదపి చ శశాంకేన తులితమ్,**
**స్రవన్మూత్ర క్లిన్నం, కరివర శిరస్స్పర్థి జఘనం,**
**ముహుర్నింద్యం రూపం కవిజన విశేషై ర్గురు కృతమ్ ॥** (16)

మాంసపుముద్దలగు స్తనములు చక్కని బంగరు కలశములనియు, కఫమునకు స్థానమగు ముఖము చంద్రసమానమనియు, మూత్రస్థానమగు మొల చక్కని ఏనుగు కుంభస్థలమ్మునకు సమమనియు స్త్రీల యొక్క మలినాంగములు సత్కవుల చమత్కారముచే ప్రసిద్ధి కెక్కినవి.

**ఏ కోరాగిషురాజతే ప్రియతమా దేహార్ధధారీ హరో,**
**నీ రాగేషు జనో విముక్త లలనాసఙ్గో నయస్మాత్పరః**
**దుర్వారస్మర బాణ పన్నగ విషవ్యావిద్ధముగ్ధోజన**
**శ్శేషః కామవిడంబితాన్న విషయాన్ భోక్తుం నమోక్తుంక్షమః॥** (17)

కాముకులలో శివుడే యాడు దానికి సగము శరీరము నిచ్చెను. నిష్కాములలో మన్మధుని దహించిన యతనికంటె నితరుడధికుడు లేడు. స్వతంత్రుడగు మన్మధుని బాణ విషముచే తగులబెట్టబడిన తక్కిన మూర్ఖులు ఎచ్చటనుచేరి స్త్రీ సుఖముననుభ వించుటకును, త్యజించుటకును సమర్థులు కారు.

**అజానన్దాహాత్మ్యం పతతుశలభో దీపదహనే**
**సమీనో2ప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితమ్**
**విజానన్తోప్యేతే వయమిహ విపజ్జాల జటిలా**
**న్నముంఛామః కామానహహ గహనో మోహమహిమా॥** (18)

తెలిసి కోనలేక మిడుత నాశకారణమగు క్రూరమగు నిప్పు మంటలలో పడుగాక; బుద్ధి లేక చేపగాలము కొననున్న మాంసమును తినునుగాక; యెఱిగి యుండియు మేము దుఃఖమును పెంచు స్త్రీ సౌఖ్యమును విడనాడము కామము యొక్క మహిమ యెట్టిదియో!

**తృషా శుష్యత్యాస్యే పిబతి సలిలం శీతమధురం**
**క్షుధార్త శ్శాల్యన్నం కబళయతి మాంసాదికలితమ్**
**ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలింగతి వధూం**
**ప్రతీకారం వ్యాధే స్సుఖమితి విపర్యస్యతి జనః॥** **(19)**

దప్పిగొన్నవాడు చల్లని నీటిని త్రాగును. ఆకలిగొన్నవాడు ఇష్టములైన, సమృద్ధమైన భక్ష్యమాంసములతోడి యన్నము దినును. కామాగ్నిచే తాపమునొందినవాడు కామినిని కౌగలించుకొనును. ఈ విధముగ రోగశాంతిని చేయు కార్యము భోగమని చెప్పదగునా?

**తుఙ్గంవేశ్మ, సుతాస్సతామభిమతా, స్సంఖ్యాతిగా స్సంపదః**
**కల్యాణీదయితా, వయశ్చ నవమి, త్యజ్ఞానమూఢోజనః**
**మత్వావిశ్వ మనశ్వరం నివిశతే సంసార కారాగృహే**
**సందృశ్యక్షణ భంగురం తదఖిలం ధన్యస్తు సన్న్యస్యతి॥** **(20)**

మేడలెత్తైనవి, పుత్రులు గొప్పవారు, చక్కని సంపదలనేకములు, భార్యమంచి నడవడికలది, వయస్సు నడి ప్రాయము అని మనుజుడు మూర్ఖుడై జగత్తును శాశ్వతమని తలంచి సంసారములోబడును. బుద్ధిమంతుడు ఇదిమాయ(మిథ్య)యని సమస్తము నతడు విడిచి పెట్టును.

**దీనాదీనముఖై స్సదైవ శిశుకై రాకృష్ట జీర్ణామ్బరా**
**క్రోశద్భిః క్షుధితైర్నిరన్న విధురాదృశ్యానచేద్గేహినీ**
**యాంఛాభంగుభయేన గద్గదగళ త్రుట్యద్విలీనాక్షరం**
**కోదేహితి వదేత్స్వదగ్ధ జఠరస్యార్థేమనస్వీపుమాన్॥** **(21)**

ఆకలిగొని ఏడ్చు చిన్నబిడ్డలు తన చీర చెఱగులాగుచుండగా, పేరాకలితో సొక్కిపోవు తన భార్యయొక్క దుస్థితిని చూడకున్నవాడు, యాచనవలన లాభము కలుగదేమోయను భయము వలన డగ్గుత్తిక కలిగి గొంతురానివాడై మండుచున్న తన పొట్ట కొరకు యెవ్వడైనను దేహియని యడుగ బోవునా.

**అభిమత మహామానగ్రన్థి ప్రభేదపటీయసీ**
**గురుతరగుణ గ్రామా మ్భోజస్ఫుటోజ్జ్వల చన్ద్రికా**
**విపుల విలసల్ల జ్జావల్లీ వితాన కుఠారికా**
**జఠర పిఠరీదుష్పూరేయం కరోతి విడమ్బనమ్ ॥** **(22)**

అభిమానమనెడి ముడిని త్రెంచునదియు, ప్రకాశించెడి ధైర్యము, గాంభీర్యము

మున్నగు సద్గుణములనెడి పద్మములకు వెన్నెలవంటివియు, లజ్జయనెడి తీగకు విస్తారమగు గొడ్డలి యందు వంటిదైన ఉదరము(పొట్ట) అనెడి పెద్దబాన నీచవృత్తిని దెలుపు చేష్టలను జూపుచు నిండదుగదా ॥

**పుణ్యేగ్రామే, వనేవామహతి, సితపటచ్ఛన్నపాలీం కపాలీ,**
**మాదాయన్యాయగర్భిద్విజహుత హుత భుగ్ధూ మధూమ్రోపకణ్ఠే**
**ద్వారం ద్వారం ప్రవిష్టోవరముదరదరీ పూరణాయ క్షుధార్తో**
**మానీప్రాణై స్సనాథోనపున రనుదినం తుల్యకుల్యేషుదీనః (23)**

అభిమానవంతునికి బంధువులను జేరి యాచించుటవలన నీచమును పొందుట కంటే, బ్రాహ్మణులు హోమముచేసిన యాగ్నిధూమములుగల గ్రామములందును, అరణ్యము నందును పుఱ్ఱెచేతబట్టుకొని యింటింట బిచ్చమెత్తుకొని బ్రతుకుట కొంత మంచిదగును.

**గంగా తరంగహిమశీకర శీతలాని**
**విద్యాధరాధ్యుషిత చారు శిలాతలాని**
**స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని**
**యత్సావమాన పరపిణ్డరతా మనుష్యాః ॥ (24)**

పవిత్రమగు గంగా తరంగములచే చల్లనైనదియు, అందమైన విద్యాధరులతోనున్న శిలాప్రదేశములును గల హిమాలయ ప్రదేశములు నశించినవాయేమి? మనుజులు నీచమగు పరాన్నమందాసక్తులేల యగుచున్నారు?

**కింకన్దాః కందరేభ్యః ప్రళయముపగతా? నిర్ఝరావా గిరభ్యః?**
**ప్రధ్వస్తావా తరుభ్యః సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః?**
**వీక్ష్యన్తేయన్ముఖాని ప్రసభ మపగత ప్రశ్రయాణాం ఖలానాం**
**దుఃఖాప్త స్వల్పవిత్తస్మయ పవన వశానర్తిత భ్రూలతాని ॥ (25)**

ప్రపంచములో కందమూలములు నశించినవా? కొండలపై నదులెండిపోయెనా? చెట్ల కొమ్మలలో పండ్లు, నారచీరలు నాశమాయెనా? యాచకులు కష్టముచే పొందబడిన కొలది ధనము వలని గర్వమనెడి గాలిచే, త్రిప్పబడిన కనుబొమలతో ప్రకాశించు దుష్టరాజుల దుఃఖములను ఆసక్తితో భయము నొందిచూచుచున్నారు.

**పుణ్యైర్మూల ఫలైః ప్రియే ప్రణయినీం వృత్తిం కురుష్వాధునా**
**భూశయ్యాం నవపల్లవై రకృపణైరుత్తిష్ఠ యావోవనమ్**
**క్షుద్రాణామవివేక మూఢమనసాం యత్రేశ్వరాణాం సదా**
**విత్త వ్యాధి వికారవిహ్వల గిరాం నామా2పి నశ్రూయతే ॥ (26)**

భువియందు కందమూల ఫలములచే బ్రతుకుము. క్రొత్తలేచిగుళ్లచే పడకను జేయుము లెమ్ము, పవిత్రమగు నడవికి బొమ్ము. అచ్చట ధనరోగ వికారములై గౌరవములేని మాటలుగల రాజులపేరు నెవ్వడును చెప్పడు.

**ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివన మభేదం క్షితిరుహాం**
**పయస్స్థానే స్థానే శిశిర మధురం పుణ్యసరితామ్**
**మృదు స్పర్శాశయ్యా సులలిత లతాపల్లవ మయీ**
**సహన్తే సన్తాపం తదపి ధనినాం ద్వారి కృపణాః ॥** (27)

అడవులలో చెట్లయందు పక్వములైన పండ్లున్నవి. పుణ్యనదుల యందు కమ్మని చల్లని జలములున్నవి. చిగుళ్లపడకలున్నవి. మనుజులు వాని గ్రహింపక దీనులై ధనవంతుల వాకిండ్ల పడియుండి మిక్కిలిబాధను సహించుచున్నారు.

**యేవర్తన్తే ధనవతి పురః ప్రార్థనాదుఃఖభాజో**
**యేచాల్పత్వం దధతి విషయాక్షేప పర్యాప్త బుద్ధేః**
**తేషామన్త స్స్ఫురిత హసితం వాసరాణి స్మరేయం**
**ధ్యాన చ్ఛేదే శిఖరి కుహర గ్రావశయ్యా నిషణ్ణః ॥** (28)

ధనికుల యెదుట నిలిచి మిక్కిలి నీచత్వమును కనుబఱచు వారలెవ్వరో, ఊహింపరాని మిక్కిలి సంసారా(సంభోగా)భిలాషచే మితిమీరిన నీచులెవరో, అట్టివారి చెడుదినములను ఆత్మధ్యానాంతమున గుహలో చక్కని ఱాతిపై పరుండి మనస్సులో పరిహసించుచుండును.

**యేసన్తోష నిరన్తర ప్రముదితాస్తే షాం నభిన్నాముదో**
**యేత్వన్యే ధనలుబ్ధ సంకులధియస్తేషాం నతృష్ణాహతా**
**ఇత్థం కస్య కృతే కృతస్స విధినా తాదృక్పదం సమ్పదాం**
**స్వాత్మన్యేవ సమాప్త హేమమహిమా మేరుర్నమే రోచతే ॥** (29)

స్తుతింపగా గొప్ప సంతోషముచే సదామోదము నందినవారలెవరో వారికి సంతోషము లు మిక్కుటములు. ధనాశగల బుద్ధి గలవారలకు ఆశ అడంగదు. అట్టియెడ శాశ్వత సంపత్స్థానమగు మేరు పర్వతము బ్రహ్మ యెవనికొరకు సృష్టించెను. మనస్సునందుండు సంపద నాకిష్టమైనదేను.

**భిక్షాహార మదైన్య మప్రతి ముఖం భీతిచ్ఛిదం సర్వతః**
**దుర్మాత్సర్యమదాభిమాన మథనం దుఃఖౌఘ విధ్వంసనమ్**

సర్వత్రాన్వహమప్రయత్న సులభం సాధుప్రియం పావనం
శంభో సత్త్రమవార్యమక్షయ నిధింశం సన్తియోగీశ్వరాః ॥ (30)

మహాయోగులు భిక్షాన్నమును, దీనత, భయము, క్రోధము, మదము, అభిమానము, జడత్వము, అహంకారములేనిదిగను, మంచిసుఖము నిచ్చునదిగను, శ్రమలేక దొరకునదియును, యోగ్యమైనదిగను, వారింపరానిదిగను, క్షయములేనిదిగను, భయంకరములగు కష్టముల తొలగించునదియును, శంభు సత్రముగను మోక్షమునకు తగినదిగను వర్ణించు చున్నారు.

## భోగాస్థైర్య వర్ణనము

**భోగేరోగభయం, కులేచ్యుతిభయం విత్తేనృపాలాద్భయం**
**మానేదైన్యబలం, బలేరిపుభయం రూపే జరాయాభయమ్**
**శాస్త్రేవాదభయం, గుణేఖల భయం, కాయే కృతాన్తాద్భయం**
**సర్వం వస్తుభయాన్వితం భువిన్నృణాం వైరాగ్యమేవాభయమ్ ॥** (31)

భోగికి రోగము, కులమునకు భ్రష్టత్వము, ధనానికి రాజు, మంచితనానికి అవమానము, బలవంతునికి శత్రువు, రూపమునకు ముసలితనము, శాస్త్రమునకు ప్రతివాదము, గుణవంతులకు నీచులు, శరీరమునకు యముడు వలె మనుష్యునికి భయమును కలిగించును లోకములో అన్నియును భయముతోకూడినవే. ఒక్క వైరాగ్యమే భయములేనిది.

**ఆక్రాన్తం మరణేనజన్మ, జరసా చాత్యుజ్జ్వలం యౌవనం**
**సంతోషో ధనలిప్సయా శమసుఖం ప్రౌఢాంగనా విభ్రమైః**
**లోకైర్మత్సరిభిర్గుణావన భువో వ్యాళైర్నృపా దుర్జనై**
**రస్థైర్యేణ విభూతయో2 ప్యపహతాగ్రస్తంనకింతేనవా ॥** (32)

పుట్టుక చావుచేతను, శాంతి స్త్రీల విలాసము చేతను, యౌవనము ముసలితనము చేతను, మంచిగుణములు దుర్మార్గులచేత, రాజు దుర్జనులచే, సంపదలు దారిద్ర్యము చేతను నాశము పొందును. ప్రతి వస్తువు కూడా దోషముతో కూడినదేకదా !

**ఆధివ్యాధిశతై ర్జనస్యవివిధై రారోగ్యమున్మూల్యతే**
**లక్ష్మీర్యత్ర పతన్తి తత్ర వివృత ద్వారా ఇవ వ్యాపదః**
**జాతం జాతమవశ్యమాశు వివశం మృత్యుః కరోత్యాత్మసాత్**
**తత్కింనామనిరంకుశేన విధినాయన్నిర్మితం సుస్థిరమ్? ॥** (33)

రకరకాల ఆధివ్యాధులచే మనుజుల ఆరోగ్యము పాడైపోతోంది. సంపదలు కలిగితే వెంటనే అడ్డూఆపు లేక కష్టాలు వచ్చిపడతాయి. మృత్యువు మనుజుల వేధిస్తుంది. ఆలోచిస్తే, దైవము దేనిని శాశ్వతంగా నిర్మించెను?

**భోగాస్తుఙ్గ తరఙ్గభఙ్గతరళాః ప్రాణాః క్షణధ్వం సినః**
**స్తోకాన్యేవ దినాని యౌవనసుఖ స్ఫూర్తిః ప్రియా సుస్థితా**
**తత్సంసారమసారమేవ నిఖిలం బుద్ధ్వా బుధా బోధకా**
**లోకానుగ్రహ పేశలేన మనసా యత్న స్సమాధీయతామ్॥** (34)

చంచలములగు భోగములు ఎత్తగు అలలతో సమానములు. ప్రాణము క్షణములో నశించును. స్త్రీల యందలి సుఖములు కొన్ని దినములే. ఇటులనుండుటను విచారించి పండితులు సంతోషముతో పరబ్రహ్మ విచారమును చేయవలయును.

**భోగా మేఘ వితానమధ్య విలసత్సౌదామనీచఞ్చలా**
**ఆయుర్వాయు విఘట్టితాబ్జపటలీ లీనామ్బువద్భంగురమ్**
**లోలాయౌవనలాలసాస్తను భృతా, మిత్యాకల్యయద్రుతం**
**యోగో ధైర్యసమాధి సిద్ధిసులభే బుద్ధిం విదధ్వం బుధాః॥** (35)

సకలభోగములును మేఘములోని మెరుపులవంటివి, బ్రతుకుగాలిచే కొట్టబడిన తామరాకుపైని నీటిబొట్టు, యౌవనానుసరణములగు సౌఖ్యములు మిక్కిలి చంచలమైనవి ఇట్టివిధమునెరిగి, సత్పురుషులారా! త్వరితముగా పరమాత్మతో బుద్ధిని చేర్చుడు.

**ఆయుః కల్లోలలోలం, కతిపయ దివసస్థాయినీ యౌవనశ్రీ**
**రర్థాః సంకల్పకల్పా, ఘనసమయతటి ద్విభ్రమా భోగపూగాః**
**కంఠాశ్లేష్మోపగూఢం తదపిచన చిరంయత్ప్రియాభిః ప్రణీతం**
**బ్రహ్మణ్యాసక్తచిత్తా భవత భవభ యామ్భోధిపారం తరీతుమ్ ॥** (36)

ఓ సత్పురుషులారా! ఆయుస్సు అలలవలె చంచలమైనది. యౌవనము కొద్ది దినములలోనిది. మన్మథక్రీడల వలని సౌఖ్యము స్థిరముకానిది, ధనము కోరికవలె అపాయముతో కూడినది. భోగములు మెరుపువలె భ్రమించుచుండును. సంసార సముద్రమును దాటుటకు సాధనమైన పరబ్రహ్మచింతనము వదలక చేయుడు.

**కృచ్ఛ్రేణామధ్యే మధ్యే నియమిత తనుభిస్స్థీయతే గర్భవాసే**
**కాన్తా విశ్లేష దుఃఖ వ్యతికర విషమో యౌవనే చోప భోగః**

**వామాక్షీణామవజ్ఞావిహసితవసతి ర్వృద్ధభావో2 ప్యసాధుః**
**సంసారే రేమనుష్యావదత యది సుఖం స్వల్పమప్యస్తి కించిత్॥ (37)**

ఓ జనులారా! మొదట శరీరమును వంచి నరకము వంటి గర్భములో నుండుట దుఃఖము, యౌవనమున తరుణీవియోగము కలుగుట దుఃఖము వార్ధక్యమున స్త్రీలకు పరిహాసపాత్రమగుట దుఃఖము ఇక నెచ్చట కొంచెమైనను సౌఖ్యము గల్గునో చెప్పుడు.

**వ్యాఘ్రీవతిష్ఠతి జరా పరితర్జయన్తీ**
**రోగాశ్చ శత్రవ ఇవప్రహరన్తి దేహమ్**
**ఆయుః పరిస్రవతి భిన్న ఘటా దివామ్భో**
**లోకస్తథా ప్యహిత మాచర తీతి చిత్రమ్॥ (38)**

వార్ధక్యము మిక్కిలి భయపెట్టుచు ధైర్యము గల పెద్దపులి వలెనున్నది. రోగములు పగను సాధించు శత్రువుల వలె శరీరమును బాధించుచున్నవి. ఆయుస్సులు ఓటికుండలోని నీరువలె సదాపోవుచున్నవి. ఇట్లున్నను మానవులు మానక పాపములు చేయుచున్నారు. ఆశ్చర్యము.

**భోగాభంగుర వృత్తయో బహువిధా, స్తైరేవ చాయం భవ,**
**స్తత్క స్యేహ కృతే పరిభ్రమత రేలోకాః? కృతం చేష్టితైః**
**ఆశాపాశ శతోపశాన్తి విశదం చేత స్సమాధీయతాం,**
**కామోచ్ఛిత్తివశాత్ స్వధామని యది శ్రద్ధేయ మస్మద్వచః॥ (39)**

మిక్కిలి చంచలములైన భోగములుపెక్కుతీరులు దుఃఖకరమగు నీసంసారము భోగములచే గలిగినది. ఆభోగములకై తిరుగుటచాలును. ఓ నరులారా! నామాటను నమ్ముదురేని శాంతముచే నిర్మలమై యొప్పు మనస్సును శివుని పాదాంబుజ యుగళ మునందు చేర్చుడు.

**బ్రహ్మేంద్రాది మరుద్గణాంస్తృణ కణాన్యత్ర స్థితో మన్యతే,**
**యత్స్వాదా ద్విరసా భవన్తి విభవా్స్త్రైలోక్య రాజ్యాదయః**
**భోగః కో2పి సఏక ఏవ పరమో నిత్యోదితో జృమ్భతే,**
**భోస్సాధో, క్షణభంగురే తదితరే భోగేరతింమాకృథాః ॥ (40)**

పుణ్యాత్ముడెచ్చటనివసించి బ్రహ్మేంద్రాది దేవతల నెల్లరను తృణమువలె తలంచునో, దేనిని రుచిచూచి జగదధిపత్యముకూడ సారహీనమగునో అది నలవిగానీ అనంతమగు బ్రహ్మానందము దానియందు మనస్సునుంచుము. నీచములగు భోగములను వదలము.

**సారమ్యానగరీ, మహాన్సనృపతి, స్సామన్త చక్రం చత,**
**త్పార్శ్వే తస్య చసావిదగ్ధపరిష, త్తాశ్చన్ద్రబిమ్బాననాః**
**ఉద్వృత్తస్సచ రాజపుత్ర నివహా, స్తే వన్దిన, స్తాః కథా,**
**స్సర్వం యస్యవశాదగాత్ స్మృతిపథం, కాలాయతస్మై నమః ॥ (41)**

ఉత్తమమైన యానగరము, పూజ్యుడగు నారాజు, అరాజ సమూహము, ప్రక్కన నాపండితసభ, ఆ పద్మాక్షులు, మదించిన యారాజకన్యకా నివహము, ఆస్తుతి పాఠకుల సమూహము, ఆచరిత్రలు, వీనినన్నిటిని నశింపజేసిన గొప్ప యశస్సుగల యా కాల స్వరూపమునకు నమస్కారము.

**యత్రానేకే క్వచిదపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో**
**యత్రాప్యేకస్తదను బహవస్తత్ర నైకో2పి చాన్తే**
**ఇత్థం చేమౌరజని దివసౌ దోలయన్ద్వా వివాక్షౌ**
**కాలః కాళ్యా భువన ఫలకే క్రీడతి ప్రాణిశారైః ॥ (42)**

ఏ యింటిలో అనేకులు వసింతురో ఆఇంట ఒక్కడేయుండును. ఎచ్చట నొక్క డుండునో అచ్చటయనేకులుందురు. ఆయింటిలో ఒక్కడూ ఒకప్పుడు లేకుండును. కాలపురుషుడు రాత్రి పగలనెడి రెండు పాచికలను వేయుచు లోకమనెడి పలక యందు మనుజులనెడి(సారెలతో) పావులతో నాటలాడు చుండును.

**ఆదిత్యస్యగతాగతై రహరహ స్సంక్షీయతే జీవితం,**
**వ్యాపారై ర్బహుకార్య భార గురుభిః కాలోనవిజ్ఞాయతే**
**దృష్ట్వా జన్మజరా విపత్తి మరణం త్రాసశ్చ నోత్పద్యతే**
**పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్త భూతంజగత్ ॥ (43)**

ప్రతిదినము సూర్యుని రాకపోకలచే ఆయుష్యము నశించును. పెక్కు కార్య వ్యాసంగములచే కాలము పోవుట తెలియదు. జన్మ జరామరణములను జూచినను భయములేదు. దుర్జన ప్రపంచము మోహమును గొల్పు మద్యరసముచే వశము తప్పెను. అయ్యయ్యో!

**రాత్రి స్సైవ, పునస్స ఏవ దివసో, మత్వాముధా జన్తవో,**
**థావన్తు ద్యమిన స్తథైవ నిభృత ప్రారబ్ధతత్తత్క్రియాః**
**వ్యాపారైః పునరుక్త భుక్తవిషయైరేవంవిధే నామునా**
**సంసారేణ కదర్థితా వయమహోమోహాన్న లజ్జామహే ॥ (44)**

వచ్చినరాత్రులే మరల వచ్చుటయు, పోయిన ప్రొద్దులే తిరిగి వచ్చుటయు తెలిసీ, రహస్య ప్రవర్తనులై చేసిన పనులే సదా చేయుచు, జనులు స్థిర వృత్తితో సంచరించు చున్నారు. నీచులు ఈ జన్మ మార్గములచే చెడియు కొంచెమైనను సిగ్గుచెందరు.

**నధ్యాతం పద మీశ్వరస్య విధివత్సం సార విచ్చిత్తయే,**
**స్వర్గద్వార కవాటపాటన పటుర్ధర్మో2పినోపార్జితః**
**నారీపీన పయోధరోరు యుగళం స్వప్నే2పినా లింగితం,**
**మాతుఃకేవల మేవ యౌవన వనచ్ఛేదే కుఠారావయమ్ ॥ (45)**

కాంతచే మనోహరమైన శివపాద ధ్యానముచేయుట లేదు. స్వర్గద్వారము యొక్క తలుపులను తెరుచు ధర్మమును చేయుటలేదు. యువతుల యొక్క చక్కని స్తనములు, తొడలను పొందుట కలలో కూడా నెరుగము. తల్లి యౌవనమనెడి వనమునకు గొడ్డళ్లమై యిలలో పుట్టితిమి.

**నాభ్యస్తా భువి వాదిబృ న్దదమనీ విద్యావినీతోచితా,**
**ఖడ్గాగ్రైః కరికుమ్భపీఠ దళనైర్నాకం ననీతం యశః**
**కాన్తాకోమల పల్లవాధర రసః పీతోనచన్ద్రోదయే**
**తారుణ్యం గత మేవ నిష్ఫల మహోశూన్యాలయే దీపవత్ ॥ (46)**

చక్కగ చదువ నేర్చుకొని ప్రతివాదులను జయింపలేదు. ఏనుగుల చీల్చునట్టి వాడికత్తులచే స్వర్గమందు కీర్తిని నిలుపలేదు. చక్కని స్త్రీల యొక్క అధరామృతమును త్రాగలేదు. పాడుపడిన యింటిలోని దీపమువలె నాయౌవనము వ్యర్థముగా గతించెను.

**విద్యానాధిగతా కళంకరహితా, విత్తం చనోపార్జితం,**
**శుశ్రూషా2పి సమాహితేన మనసాపిత్రోర్న సమ్పాదితా,**
**ఆలోలాయతలోచనాః ప్రియతమా స్వప్నే2పి నాలింగితా :**
**కాలో2యం పరపిణ్డలోలుపతయా కాకైరివ ప్రేరితః ॥ (47)**

వినయముచే అందములైన చదువులు నేర్చుకోలేదు. న్యాయముగ ధనమును సంపాదించలేదు. తలితండ్రుల కుపచారము చేయలేదు, అందగత్తెలను కలలోకూడ కౌగలింపలేదు. పరాన్నము తినుటతో కాకులకువలె కాలము త్వరగ గడిచిపోయినది.

**వయంయేభ్యోజాతాశ్చిరపరిగతా ఏవఖలుతే,**
**సమం యైస్సంవృద్ధాస్స్మృతివిషయతాం తే 2పి గమితాః**

**ఇదానీమేతేస్మః ప్రతిదివస మాసన్నపతనా**
**గతాస్తుల్యావస్థాం సికతలనదీతీర తరుభిః ॥ (48)**

కాలము ఓర్చుకోలేక తలిదండ్రులతో నున్నవారిని చంపినదని తెలిసికొనలేదు. మూఢులగు నరులు క్రూరమగు ముదిమిచే నార్తులై సొక్కుచు దుర్దశ సమీపించిన వారలై ఇసుకతోనున్న నదియొడ్డు నందలి పెద్దచెట్లకు సమానులగు చున్నారు.

**ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం**
**తస్యార్ధస్య పరస్యచార్ధమపరం బాలత్వ వృద్ధత్వయోః**
**శేషం వ్యాధివియోగ దుఃఖసహితం సేవాది భిర్నీయతే**
**జీవేవారితరంగ చంచలతరే సౌఖ్యం కుతః ప్రాణీనామ్ ॥ (49)**

ఆయస్సు నూరేండ్లు. అందులో సగం నిద్రలో పోతుంది. తక్కిన దానిలో సగము బాల్యము వారధిక్యముల పొందికలో పోతుంది. మిగిలిన సగము శ్రమనొందుటచే గతించి పోయెను. ఆయువు చంచలమగుటచే ప్రాణులకు సుఖమెట్లుకలుగును?

**క్షణం బాలో భూత్వా క్షణ మపి యువాకామరసికః**
**క్షణం విత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణ విభవః**
**జరాజీర్ణై రంగై ర్నట ఇవ వలీమండిత తను**
**ర్నర స్సంసారాంతే విశతి యమధానీయ వనికామ్॥ (50)**

బాల్యంక్షణమాత్రం. యౌవనం కూడ క్షణమాత్రమే. కొద్దిసేపు దరిద్రుడుగను, క్షణకాలం ధనికుడు గను, కృశించి, అలసట చెంది, నటునివలె నటించి చివరకు యమాలయమనే తెరలోకి పోవును.

## యతి నృపతి సంవాదము

**త్వం రాజా వయమప్యుపాసిత గురుప్రజ్ఞాభిమానోన్నతాః**
**ఖ్యాతస్త్వం విభవైర్యయశాంసి కవయో దిక్షుప్రతన్వన్తినః**
**ఇత్థం మానధనాతి దూరము భయోరప్యా వయోరన్తరమ్**
**యద్యస్మాసు పరాఙ్ముఖో2సి వయమప్యే కాన్తతోనిః స్పృహాః॥ (51)**

నీవు రాజువు. మేము గురుశ్రేష్ఠులచే పొందబడిన ప్రజ్ఞాభిమానములచే ప్రకాశించు గొప్ప ఆత్మగలవారము. నీవు గొప్ప ధనవంతుడవు. మాకీర్తిని సజ్జనులు నుతింతురు. మన తారతమ్యము దూరమైనది సుమా. మమ్ము నిష్కపటముగా చూడనిచో మాకు నీ యందనురాగము లేదు.

**అర్థానా మీశిషేత్వం వయమపిచ గిరామీశ్మహే యావదర్థం**
**శూరస్త్వం వాది దర్పవ్యుపశమన విధా వక్షయం పాటవం నః**
**సేవన్తే త్వాం ధనాఢ్యామతి మలహతయే; మామపి శ్రోతుకామా**
**మయ్యప్యాస్థాన తేచేత్త్వయి మమనితరామేష రాజన్న నాస్థా॥** **(52)**

రాజా! నీవు ధనపతివి. మేము వేదార్థముల తత్త్వములను శాసించు వారము. నీవు శూరుడవు. మేము చండప్రచండంగా వాదించే వారిని ఓడించేవారము. నిన్ను ధనికులు సేవిస్తే మమ్ము ఆశ్రయించు వారు సేవింతురు. మాకు వినయము చూపనిచో మేము ఈ క్షణమే వెళ్లెదము:-

**వయమిహ పరితుష్టావల్కలై స్త్వందుకూలై**
**స్సమ ఇహ పరితోషో నిర్విశేషోవిశేషః**
**సతు భవతు దరిద్రోయస్యతృష్ణా విశాలా**
**మనసి చపరితుష్టే కో2ర్థవాన్ కోదరిద్రః? ॥** **(53)**

పట్టుగుడ్డలు కట్టే నీయొక్కయు, చింకి గుడ్డలు కట్టే మాకునూ, ఆనందం సమానమే. తేడాయే లేదు. ఎవడి ఆశకు అంతులేదో వాడే దరిద్రుడు. తృప్తి కలవానికి కలిమిలేములు లేవు.

**ఫలమలమశనాయ, స్వాదు పానాయ తోయం**
**క్షితిరపిశయనార్థం, వాససేవల్కలంచ,**
**నవధనమధుపాన భ్రాన్త సర్వేన్ద్రియాణా**
**మవినయ మనుమన్తుం నోత్సహే దుర్జనానామ్॥** **(54)**

తినుటకు పండ్లు త్రాగుటకు నీరుచాలును. కట్టుకొనుటకు నారచీరలు, పరుండుటకు నేల చాలును. నిరర్థకమైన క్రొత్త ద్రవ్యమనెడి మద్యపానముచే కలిగే మోహమందు మునిగిన మనస్సులుగల నీచ రాజుల యవినీతిని కొంచెమైనను సహింతురా?

**ఆశ్నీమహివయంభిక్షా, మాశావాసోవసీమహి**
**శయీామహి మహీపృష్ఠే, కుర్వీమహి కి మీశ్వరైః ॥** **(55)**

మేము కలసి భిక్షాన్నము తినెదము. దిగంబరులుగ నుందుము.(దిగ్వస్త్రముల ధరించెదము) నేలపై పరుండెదము. మాకు రాజుల విషయమై యేమి పనియున్నది?

**ననటా, నవిటా, నగాయకా, నచసభ్యేతర వాదచుంచవః**
**నృపమీక్షితు మత్ర కేవయం? స్తనభారానమితాన యోషితః॥ (56)**

మేము నటులము, గాయకులము గాదు, తార్చేవారము కాదు. ఘన స్తనభారముచే వంగి మదించిన వేశ్యా స్త్రీలము కాము. కాన మాకు రాజు చూడదగిన వాడా?

**విపులహృదయైర్ధన్యైః కైశ్చిజ్జగజ్జ నితం పురా,**
**విధృతమపరైర్దత్తం చాన్యైర్విజిత్యతృణం యథా**
**ఇహహి భువనాన్యన్యే ధీరాశ్చతుర్దశ భుఞ్జతే**
**కతిపయపుర స్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః? (57)**

పూర్వము సుబుద్ధులగు రాజులు జగత్తును నిర్మించిరి. దానిని కొందరు భరించిరి. కొందరు దానిని యాచకుల కిచ్చిరి. లోకములన్నింటినీ అతిశయముతో కొందరు ప్రీతితో అనుభవించుచుండగా, ఐదారుపట్టణముల కధిపతులైనవారికి ఇంత మదజ్వర మెందుకు?

**అభుక్తాయాం యస్యాం క్షణమపి నయాతం నృపశతై**
**ర్భువస్తస్యాలాభేక ఇవ బహుమానః క్షితి భృతామ్?**
**తదంశ స్యాప్యంశే తదవయవలేశేఽపి పతయో**
**విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదమ్॥ (58)**

క్షణమైనను వ్యవధిలేక ఎందరో రాజులనుభవించుచున్న ఈ భూమి దొరికినా కూడ రాజులకు మహిమకలుగునా? ఈ భూమిలోని కొద్ది భాగములోని తునకలోని తునకలో ఒక మూలకు అధిపతులగు వారు చింతనొందక, సంతోషించుచున్నారు. ఎంతటి మూర్ఖులో గదా!

**మృత్పిణ్డో జలరేఖయా వలయిత స్సర్వోఽప్యయం నన్వణుః**
**స్వాంశీ కృత్యస ఏవ సంయుగశతై రాజ్ఞాం గణైర్భుజ్యతే**
**నోదద్యుర్దదతేఽ థవా కిమపితే క్షుద్రా దరిద్రా భృశం**
**ధిగ్ధికాన్ పురుషాధమాన్ ధనకణంవాఞ్ఛన్తితేభ్యోఽ పియే॥ (59)**

జలరేఖచే గిరిగీయబడియున్న కొద్దిదగు నీమట్టి ముద్ద(భూమి)కై తగవులాడి, భాగించుకొని యనుభవించుచున్న ఈ నీచరాజులు ఒకరి కిత్తురా? మిక్కిలి నికృష్టులు. వారియందు కొద్ది ధనాపేక్షగల మనుష్యులు మిక్కిలి నీచులుగదా!

సజాతః కోఽప్యాసీన్మదన రిపుణా మూర్ధ్ని ధవళం
కపాలం యస్యోచ్చై ర్వినిహిత మలంకార విధయే
నృభిః ప్రాణత్రాణ ప్రవణ మతిభిః కైశ్చిదధునా
నమద్భిః కః పుంసామయ మతుల దర్పజ్వర భరః॥ (60)

ఎవని యొక్క కపాలమును గౌరీపతి సంతోషముతో ఆభరణముగా తలపై ధరించునో వాడే మంచి జన్మగలవాడు. భువిలో కొందరు ప్రాణరక్షణకై మమ్ముల నాశ్రయించిరను అహంకారం (మదజ్వరము) మనుజుల కెందులకు?

## మనస్సంబోధన నియమనము

పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదం కిం నేతుం విశసి హృదయ క్లేశ కలితమ్
ప్రసన్నే త్వయ్యన్త స్స్వయ ముదిత చిన్తామణి గణే
విముక్త స్సంకల్పః కి మభిలషితం పుష్యతి నతే? ॥ (61)

ఓ మనస్సా! పరుల మనస్సులను పెక్కురీతుల కొలిచి నిర్మల గుణకాంతిని పొందించుటకై ప్రయత్నించుటెందుకు? స్థిరముగ నిర్మలత్వమును పొంది చింతామణుల ప్రకాశంతో మేలుగ మనోరథము, అందమును పొందడా?

పరిభ్రమసి కిం ముధా? క్వచన చిత్త విశ్రామ్యతాం
స్వయం భవతి యద్యథా భవతి తత్తథా నాన్యథా
అతీత మననుస్మరన్నపి చభావ్య సంకల్పయ
న్న తర్కిత సమాగమా ననుభవామి భోగా నహమ్॥ (62)

ఓ వెర్రి మనసా! పెక్కురీతుల ఏల సంచరించెదవు? ఓర్పుతో ఒకచోట నుండుము అప్రయత్నముగానే మంచిచెడులు కలుగును. నేను గతాన్ని, భవిష్యత్తును తలచను. ఎక్కువగా కోరను. దైవికముగ లభించిన ఫలముల ననుభవించెదను.

ఏతస్మా ద్విరమే న్ద్రియార్థ గహనా దాయాసకా దాశ్రయ
శ్రేయోమార్గ మశేష దుఃఖశమన వ్యాపారదక్షం క్షణాత్
స్వాత్మీభావముపైహి సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మాభూయోభజ భంగురాం భవరతిం, చేతః ప్రసీదాధునా॥ (63)

ఓమనసా! శ్రమను గూర్చునదియు, ఇంద్రియ విషయములకు చొరరాని

మార్గమును వదలుము. సర్వదుఃఖ నివారణకై, సన్మార్గమును చేరుము. ధ్యానింపదగిన పరమేశ్వరుని చేరుము. నిశ్చలత్వముచే ప్రకాశింపుము మరల మాయాక్రీడలకు ప్రవేశింపకుము మాలిన్యమును వదలుము.

**మోహంమార్జయ, తాముపార్జయ రతిం చన్ద్రార్థ చూడామణౌ**
**చేత స్స్వర్గ తరంగిణీ తటభువా మాసంగ మంగీకురు**
**కోవావీచిషు బుద్బుదేషు చ తటిల్లే ఖాసు చస్త్రీషుచ**
**జ్వాలాగ్రేషు చపన్న గేషు చ సరిద్వేగేషు చప్రత్యయః? ॥ (64)**

ఓ హృదయమా! పాప పంకిలమగు మోహమును వీడుము. శంభునిపై భక్తి నుంచుము. పవిత్ర గంగానది ఒడ్డున నివసింపుము అలలయందు, నీటి బుడగల యందు, మెరుపుల యందు, జ్వాలలయందు, పాములయందు, స్నేహితులయందు నమ్మకమెందులకు?

**చేతశ్చిన్తయ మారమాం సకృ దిమామ స్థాయినీ మాస్థయా**
**భూపాల భృకుటీ కుటీ విహరణ వ్యాపార పణ్యా జ్ఞనామ్**
**కన్థాకంచుకితాః ప్రవిశ్యభవన ద్వారాణి వారాణసీ**
**రథ్యాపంక్తిషు పాణిపాత్ర పతితాం భిక్షా మపేక్షా మహే ॥ (65)**

ఓ మానసమా! ఈ భువిలో రాజుల కనుబొమ్మలనెడి గుడిసెలో విహరించు వ్యాపారముగల వారస్త్రీ యనెడు సంపదను అనుభవించుటకై కొంచెమును గ్రహింపకుము. శివునికి సంతోషమును కలిగించు కాశీపట్టణములో చక్కని రాజవీధులలో ఇండ్ల వాకిండ్ల యందు చేతిలో పెట్టు భిక్షాన్నమును కోరెదను.

**అగ్రే గీతం, సరసకవయః పార్శ్వయోర్థాక్షిణాత్యాః**
**పశ్చాల్లీలా వలయరణితం చామర గ్రాహిణీ నామ్**
**యద్యస్త్యేవం కురు భవరసాస్వాదనే లమ్పటత్వం**
**నోచేచ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ॥ (66)**

ఓ మనసా! ఇరుప్రక్కల దక్షిణ దేశపు కవులు, ఎదురుగ చక్కటి శ్రావ్యమైన గానము, వెనుకవైపు స్త్రీలు తామరలను విసురుచు, వారి చేతిమణి కంకణముల ధ్వనులును వుండినచో, అటువంటి సంసారానుభవములో వుండుము. అవిలేనిచో సంసారాన్ని వదిలి, యోగసమాధిని ఆచరింపుము.

**ప్రాప్తాః శ్రియస్సకల కామదుఘా, తతః కిం?**
**న్యస్తం పదం శిరసి విద్విషతాం, తతః కిమ్?**
**సంపాదితా: ప్రణయి నోవిభవై, స్తతః కిం?**
**కల్పం స్థితం తను భృతాం తనుభి, స్తతఃకిమ్?॥** (67)

సర్వసంపదలున్ననూ - ఆ తరువాత ? (ఏమిలాభము) బలవంతులైన శత్రువులను జయించి వారినిలొంగదీసుకొని, వారిని పాదాక్రాంతులను చేసుకొన్ననూ-ఆ తరువాత ? (ఏమిలాభం) నీ చెంతచేరిన వారినందరినీ పోషించిననూ- ఆ తరువాత? (ఏమిలాభం) ఏ వికారములు కష్టములు లేక సుఖించిననూ-ఆ తరువాత ఏమిలాభము?-

**భక్తిర్భవే, మరణజన్మభయం హృదిస్థం**
**స్నేహో నబంధుషు, నమన్మథ జావికారాః**
**సంసర్గదోష రహితా విజనా వనాన్తా**
**వైరాగ్యమస్తి కిమితః పరమర్థనీయమ్?॥** (68)

శివుని యందు భక్తీ, జననమరణముల భయము మనస్సునందూ, బంధువుల పై అనురాగం లేకుండుట, గొప్ప కామ నిగ్రహము, వనములలో ఏకాంత వాసమూ, పరమ వైరాగ్యము ఉండినచో, వీటి కన్ననూ మించినది తర్వాత ఏమికావాలి?

**తస్మాదనంత మజరం పరమం వికాసి**
**తద్బ్రహ్మ చింతయ కిమేభిరసద్వికల్పైః ?**
**యాస్యాను షంగిణ ఇమే భువనాధిపత్య**
**భోగాదయ: కృపణలోక మతా భవన్తి॥-** (69)

కావున ఓ మనసా! అనంతము., అజరము., పుట్టుకలేనిది అయిన బ్రహ్మమును సేవింపుము- వికారములను మానుకో, బ్రహ్మనిష్ఠుడైన నీకు లోకాధిపత్య భోగస్థానము లన్నియును,-నీచములే యగును:-

**పాతాళమావిశసి యాసినభోవిలంఘ్య**
**దిఙ్మండలం భ్రమసి మానసచాపలేన**
**భ్రాంత్యాऽపి జాతువిమలం కథమాత్మనీనం**
**తద్బ్రహ్మ నస్మరసి నిర్వృతిమేషియేన॥** (70)

చిత్తమా! నీవు అటు పాతాళానికి, పైన ఆకాశానికి; దశదిక్కులకూ పరుగులెత్తుతావు. నీచాపల్యమట్టిది నీవు పొరబాటున కూడా బ్రహ్మమును తలచవు. నీలో

ప్రకాశించుచున్న ఆ పరంజ్యోతిని దర్శించవు. నీవు తలచినచో అంతులేని శాశ్వత సౌఖ్యమును పొందెదవు:-

## నిత్యానిత్య వస్తు విచారము

**కింవేదై స్మృతిభిః పురాణపఠనై శాస్త్రైర్మహా విస్తరైః**
**స్వర్గగ్రామ కుటీనివాస ఫలదైః కర్మక్రియా విభ్రమైః?**
**ముక్త్వైకం భవదుఃఖ భార రచనా విధ్వంసకాలానలం**
**స్వాత్మానంద పద ప్రవేశ కలనం శేషావణి గ్వృత్తయః॥ (71)**

వేదములను, స్మృతులను, పురాణములను, శాస్త్రములను పఠించుట వల్ల ఏమి లాభము. కర్మఫలములగు స్వర్గమనే గ్రామ కుటీర వాసముకూడా సంసారమువంటిదే. మళ్ళీ క్రిందికి రావలసిందే-జననమరణ రోగ మొదలగు క్షయములు లేని అక్షయమైన స్వాత్మానందమునకు మించిన సుఖమేముంది?-

**యతోమేరు శ్రీమాన్ని పతతి యుగాన్తాగ్ని వలితః**
**సముద్రా శృష్యన్తి ప్రచురమకర గ్రాహనిలయాః**
**ధరాగచ్ఛత్యన్తం ధరణీధర పాదైరపి ధృతా**
**శరీరే కావార్తా కరికలభ కర్ణాగ్ర చపలే? (72)**

యుగాన్తంలో అగ్నిజ్వాలలచే మేరుపర్వతము కూడా నశించిపోవును. గొప్ప మొసళ్ళకు నిలయమైన సముద్రాలన్నీ ఇంకిపోవును. పర్వతములచే మోయబడుచున్న భూమి పాడైపోవును. అటువంటివే పోతూంటే గున్న ఏనుగుల చెవుల కొసలవలె చంచలమైన శరీరము గూర్చి చెప్పేదేముంది?

**గాత్రం సంకుచితం, గతిర్విగళితా, భ్రష్టాచ దంతావళి**
**ర్దృష్టిర్నశ్యతి, వరతే బధిరతా వక్త్రంచలాలాయతే**
**వాక్యంనాద్రియతేచ బాంధవజనో, భార్యానశుశ్రూషతే**
**హా! కష్టం! పురుషస్య జీర్ణవయసః పుత్రో2ప్యమిత్రాయతే (73)**

శరీరం ముడుతలు పడుతుంది, అడుగులు తడపడతాయి, పండ్లూడి పోతాయి, కండ్లు కనబడవు, చెవుడు వస్తుంది, నోటిలో చొంగకారుతుంది. బంధువులు తనమాట వినరు-భార్యదగ్గరకు రాదు, పుత్రుడు శత్రుడవుతాడు - వార్ధక్యం ఎంత కష్టమైనదోకదా!

వర్ణం సితం శిరసి వీక్ష్య శిరోరుహాణాం
సానం జరాపరిభవస్యతదా పుమాంసమ్

**ఆరోపితాస్థి శకలం పరిహృత్యయాన్తి**
**చణ్డాల కూపమివ దూరతరం తరుణ్యః॥** (74)

ఎముక ముక్కలతో గూడిన మాలవారి బావిని వదలి తాకకదూరంగా తొలిగి పోవునట్లు, స్త్రీలంతా తెల్ల వెంట్రుకలను చూచి వీడు పనికిరాడని ముసలివానికి దూరముగా పోయెదరు.

**యావత్స్వస్థమిదం శరీరమరుజం, యావచ్ఛదూరేజరా,**
**యావచ్చేంద్రియశక్తి రప్రతిహతా, యావత్ క్షయోనాయుషః**
**ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్**
**సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః?** (75)

ధీరతతో రోగములు శరీరమును, వార్ధక్యమును బాధింపకముందే ఇంద్రియ విఘాతము కలుగకముందే, తనప్రాణము నశింపకముందే, పండితుడు మోక్షమునకు ప్రయత్నించవలయును. అగ్ని జ్వాలలలో ఇల్లుతగులబడి పోతూంటే నెమ్మదిగ బావి త్రవ్వుట తగునా?

**తపస్యన్త స్సన్తః కిమధినివసామ స్సుర న దీం?**
**గుణోదారా న్దారానుత పరిచరామ స్సవినయమ్?**
**పిబామ శ్శాస్త్రౌఘా? నుత వివిధ కావ్యామృతరసా?**
**న్నవిద్మః కింకుర్మః కతిపయ నిమేషాయుషి జనే?॥** (76)

గంగానదీ తీరంలో తపస్సు చేయుచుందుమా, భార్యాసక్తితోనుందుమా, లేక పెక్కుశాస్త్రములు నింపగు కావ్యామృతము ననుభవించుదుమా? అశాశ్వతమగు యీలోకమున మనుజులు నిమిషముల పరిమితిగల ఆయుస్సు కలవారై యుండగా, ఏదిచేయుట హితమోవూహింపలేము.

**దురారాధ్యా శ్చామీ తురగచల చిత్తాః క్షితిభుజో**
**వయంతు స్థూలేచ్ఛాస్సుమహతి ఫలే బద్ధమనసః**
**జరాదేహం, మృత్యుర్హరతి దయితం జీవితమిదం**
**సఖే! నాన్యచ్ఛ్రేయో జగతి విదుషో2న్యత్ర తపసః॥** (77)

గుఱ్ఱమువలె చంచల స్వభావముగల రాజులు శాంతులుగారు రజోగుణమును విడువరు. మాకు ధనముపై దురాశయధికము. వార్ధక్యము తేజస్సు నడచును. యముడు ఎదుర్కొని ప్రాణముల బాధించును. లోకములో నిష్కాపట్యమగు తపస్సుకంటె ఆత్మహితమగు పని వేరొకటి యున్నదా?

**మానేమ్లాయిని, ఖణ్డితే చవసుని, వ్యర్థం ప్రయాతే2ర్థిని,**
**క్షీణే బన్ధుజనే, గతే పరిజనే, నష్టే శనైర్యౌవనే**
**యుక్తం కేవల మేత దేవ సుధియాం యజ్జహ్ను కన్యాపయః**
**పూతగ్రావ గిరీన్ద్ర కన్దరతటీ కుంజే నివాసః క్వచిత్॥　　　　(78)**

గౌరవము తగ్గగా, ధనము బంధువుకాగా, చుట్టములును, ఆశ్రితులును దైన్యము నొందిపోగా, అతిథులు నిరాశతో వెళ్ళగా యౌవనము నశింపగా పూజ్యునకు గంగానది అలలచే పవిత్రమైన ఱాళ్ళుగల కొండ పాదరింటిలో వసించుట తగును.

రమ్యాశ్చన్ద్ర మరీచయ, స్తృణవతీ రమ్యావనాన్తస్థలీ,
రమ్యం సాధు సమాగ మాగత సుఖం, కావ్యేము రమ్యాః కథా,
కోపోపాహిత బాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయాముఖం
సర్వం రమ్య, మనిత్యతా ముపగతే చిత్తేన కించి త్పునః॥　　　　(79)

పండు వెన్నెలలు, పూదోటలుగల ప్రదేశములు, సజ్జన సాంగత్య సౌఖ్యము, సరస వచనములు, కన్నీటితో కూడిన కామిని ముఖము, ఇంపైనవి. అనిత్యమని మనసులో తెలుసుకొన్న వారికి పైవన్నియు మంచివి కావు.

**రమ్యంహర్మ్యతలం న కింవసతయే? శ్రావ్యం నగేయాదికం?**
**కింవా ప్రాణసమా సమాగమసుఖం నైవాధిక ప్రీతయే?**
**కింతు భ్రాన్త పతంగ పక్షపవన వ్యాలోల దీపాంకుర**
**చ్ఛాయా చంచల మాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః॥　　　　(80)**

ఆలోచించి చూడగా మిక్కిలి విశాలమైన మేడలును, స్త్రీ సంభోగమును, మధురగానమును సదా సుఖము నొసగజాలవా? గొప్ప పండితులు ఎగురుచున్న పక్షుల రెక్కల గాలిచే కొట్టబడి చలించుచున్న దీపపు కాంతివలె, సర్వము చంచలమని తలచి అరణ్యములకేగిరి.

## శివార్చనము

**అసంసారా త్రిభువనమిదం చిన్వతాం తాత! తాదృంగ్**
**నైవాస్మాకం నయన పదవీం శ్రోత్రమార్గం గతోవా,**
**యో2యం ధత్తే విషయ కరిణీ గాఢరూఢాభిమాన**
**క్షీబస్యాన్తః కరణ కరిణ స్సంయమాలా నలీలామ్॥　　　　(81)**

పాపకర్మలుచేసి పాతాళానికీ, పుణ్య కర్మలుచేసి స్వర్గానికీ, మిశ్రమ కర్మలుచేసి ఇహలోకానికీ - ఈ మూడులోకాలలో తిరుగుచున్నాము. ఎందుకనగా నా మనస్సనే

మదపుటేనుగు ఇంద్రియ సుఖములనెడి ఆడయేనుగులందు అనురాగము పెంచుకొని ఈ కర్మలు చేశాము. ఈ మదపుటేనుగును (మనుసును) కట్టుటకు దృఢమైన స్తంభము మాకెచ్చట కానరాలేదు (సంసారమందు ఇంద్రియ నిగ్రహము గల వాడెందును లేదని భావము)- దీనికి ఏనుగు లక్ష్మణకవి తెలుగు పద్యమును చూడండి.

**యదేత త్స్వచ్ఛన్దం విహరణ, మకార్పణ్యమశనం**
**సహార్యై స్సంవాస, శ్శ్రుతముపశమైక వ్రతఫలమ్**
**మనోమన్దస్పన్దం బహిరపి చిరస్యాపి విమృశ**
**న్నజానే కస్యైషా పరిణతి రుదారస్య తపసః॥ (82)**

స్వేచ్ఛావిహారము, సాత్త్వికాహారము, సదా సజ్జన సహవాసము, పరిశుద్ధ శాంతము, శాస్త్రజ్ఞానము, ఆసక్తి లోపలనే పొంది, బాహ్యవిషయముల చేరని మనస్సు అను ఇవయన్నియు కలుగుట ఏ మహాతపస్సు యొక్క ఫలమో తెలియగలమా?

**జీర్ణా ఏవమనోరథాశ్చ హృదయే, యాతంచ త ద్యౌవనం,**
**హన్తాంగేసు గుణాశ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞైర్వినా,**
**కిం యుక్తం సహసా2భ్యుపైతి బలవాన్కాలః కృతాన్తో2క్షమీ**
**హా! జ్ఞాతం మదనాంత కాంఘ్రియుగళం ముక్త్వాస్తి నాన్యాగతిః॥ (83)**

కోరికలు మనస్సులోనే హరించిపోయినవి. యౌవనము పోయినది. గుణవంతులు లేకపోవుటచే గుణములు నిష్ప్రయోజనములైనవి. ఏది తగినది? అయ్యో! యముడురాకపోడు శివుని పాదయుగళమే చేరదగినదని తెలిసికొంటిని.

**మహేశ్వరేవా జగతామధీశ్వరే, జనార్దనేవా జగదన్తరాత్మని,**
**నవస్తు భేద ప్రతిపత్తి రస్తిమే, తథా2పిభక్తి స్తరుణేన్దు శేఖరే॥ (84)**

జగత్తున కధిపతియగు శివునియందును, సకలజగములలో నిమిడియున్న విష్ణువునందును మాకుభేదజ్ఞానము లేదు. (శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే) శివ, కేశవుల కభేదము ఐనను మాకు శంభునియందే భక్తి.

**స్ఫురత్ స్ఫారజ్యోత్స్నా ధవళితతలే క్వా2పి పులినే**
**సుఖాసీనా శ్శాన్త ధ్వనిషు రజనీషు ద్యుపరితః**
**భవాభోగో ద్విగ్నా శ్శివ శివ శివేత్యుచ్చవచసః**
**కదాస్యా మానన్దోద్గత బహుళ భాష్పాప్లుతదృశః॥ (85)**

ప్రశాంత నిశీథులందు ప్రకాశించు దట్టమైన వెన్నెలలో స్వచ్ఛమైన గంగానది యందలి ఇసుక తిన్నెలపై గూర్చుండి ఆజన్మాంతము వుత్సాహముతో మేము

శివశబ్దమును నావృత్తి చేయుచు, ఆనందబాష్పములచే సంకులమైన స్థితిని పొంది యెప్పుడు సుఖముగనుందుమో?.

**వితీర్ణే సర్వస్వే తరుణ కరుణాపూర్ణ హృదయాః**
**స్మరంతస్సంసారే విగుణ పరిణామాం విధిగతిమ్**
**వయం పుణ్యారణ్యే పరిణత శరచ్చంద్రకిరణా**
**స్త్రియామానేష్యామో హరచరణ చింతైక శరణాః॥** (86)

సర్వస్వాన్ని దానంచేసి, క్రొత్త దయతో నిండిన మనస్సుగల వారమై సంసారమ నశింపగా దేవుని ధ్యానించుచు అడవిలో శివధ్యాన నిష్ఠులమై, స్వచ్ఛమై, శరన్నవరాత్రులను ఎప్పుడు గడిపెదమో:-

**కదావారాణస్యా మమర తటినీ రోధసి వసన్**
**వసానః కౌపీనం శిరసి నిదధా2ంజలి పుటమ్**
**అయే! గౌరీనాథ! త్రిపురహర! శంభో! త్రినయన**
**ప్రసీదేతి క్రోశన్ని మిషమివ నేష్యామి దివసాన్॥** (87)

కాశీపట్టణంలో గంగానదీ తీరాన నిల్చి, గోచిని పెట్టుకొని, తలపై చేతులను మోడ్చి గౌరీనాథ, త్రిపురాంతక, శంభో, త్రినయనా, రక్ష అని మొరలిడుచు నిశ్చలధ్యానముత దినములను నిమిషముల వలె ఎప్పుడు గడపెదనో!

**స్నాత్వాగాంగైః పయోభిష్షు చికుసుమ ఫలైరర్చయిత్వా విభో! త్వాం**
**ధ్యేయేధ్యానం నియోజ్య క్షితిధర కుహరగ్రావ పర్యంక మూలే**
**ఆత్మారామః ఫలాశీ గురువచన రతస్త్వ త్ప్రసాదాతస్మ్న రారే**
**దుఃఖం మోక్ష్యేకదా హం సమకర చరణే పుంసి సేవాసముత్థమ్॥** (88)

గంగానదిలో స్నానంచేసి, పవిత్రమగు ఫలాదులతో పూజచేసి, నిన్నే మనసునం దుంచుకొని, యోగ్యమైన గుహల యందలి రాతిపై కూర్చొని, ఆత్మధ్యాన పరుడనై పండ్లను తినుచు, గురువాక్యమందాసక్తుడనై ఓ శంభో! రాజ సేవవలని శ్రమ నెప్పుడు పోగొట్టుకొందునో!

**ఏకాకీని స్పృహశ్శాంతః పాణిపాత్రో దిగంబరః**
**కదాశంభో! భవిష్యామి కర్మనిర్మూలన క్షమః?** (89)

ఓ శంభో! ఏకాకినై, ఆశలనన్నింటినీ వదలి, శాంత చిత్తుడనై, అరచేతితో బిచ్చమడుగువాడనై, దిగంబరుడనై, సర్వకర్మలను ఎపుడు నిర్మూలించెదనో!-

**పాణిం పాత్ర యతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం**
**యత్రక్వా2పిని షీదతాంబహుతృణం విశ్వంముహుః పశ్యతామ్**
**అత్యాగే2పితనోరఖండ పరమానందావ బోధస్పృశా**
**మధ్వాకో2పి శివ ప్రసాద సులభస్సంపత్స్యతే యోగినామ్॥ (90)**

సర్వభూతహితునకు, కరపాత్రగలవానికి, నిష్కామునకు, భిక్షాన్నముతో తృప్తి చెందువానికి, ఏ స్థలమునందైనను నివసించగలవానికి, ప్రపంచాన్ని గడ్డి పరకవలె చూచువానికి, ఎదుట నుండి అఖండ సౌఖ్యముతోనున్నవానికి శంకరుని దయతో నొకానొక మార్గమేర్పడును:-

## అవధూత చర్య

**కౌపీనం శతఖండ జర్జర తరం కంథాపునస్తాదృశీ**
**నైశ్చింత్యం నిరపేక్ష భైక్ష మశనం నిద్రా శ్మశానేవనే**
**స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాంతం ప్రశాంతంసదా**
**స్థైర్యం యోగ మహోత్సవే2పిచయది త్రైలోక్యరాజ్యేణకిం?:- (91)**

కౌపీనము, చింకి బొంతయు, అయాచితమగు భిక్షాన్నము, నిశ్చింత, వనములోనో, శ్మశానములోనో నిద్రించుట, నిరాటంక సద్వృత్తి, ప్రశాంతమనస్సు, నిరంతర యోగాభ్యాసమున్నచో ఆ యోగికి ఆపైన త్రైలోక్యాధిపత్య మెందుకు?

**బ్రహ్మాండ మండలీ మాత్రం కిం లోభాయ మనస్వినః**
**శఫరీ స్ఫురితే నాబ్ధిః క్షుబ్ధోనఖలు జాయతే॥ (92)**

యతీశ్వరునకు ఈ భూవలయమంతయూ ఏమాత్రమయిననూ ప్రలోభపెట్టునా? కలత చెందించునా? చేపలు ఎగిరెగిరి పడినంతమాత్రాన సముద్రము చెక్కు చెదురునా? కల్లోల మగునా?

**మాతర్లక్ష్మి! భజస్వకంచిద పరం మత్కాంక్షిణీ మాస్మభూ**
**ర్భోగేషు స్పృహయాళ వస్తవ వశే కానిః స్పృహాణామసి?**
**సద్యః స్యూతపలాశ పత్రపుటికాపాత్రే పవిత్రీ కృతై**
**ర్భిక్షావస్తు భిరేవ సంప్రతివయం వృత్తిం సమీహామహే॥ (93)**

అమ్మా! లక్ష్మీ! నీకు నమస్కారము. నన్ను గోరకుము. భోగములు కోరువారు నీకు లోబడెదరు. కానీ నిఃస్పృహులకు నీతో పనిలేదు. మోదుగాకుదొప్పలతో పవిత్రమైన భిక్షాటనముతో మేమిక జీవయాత్ర సాగించదలచి యున్నాము.

**మహీరమ్యాశయ్యా, విపుల ముపధానం భుజలతా,**
**వితానం చాకాశం వ్యజనమనుకూలోఽయ మనిలః**
**స్ఫురద్దీప శ్చన్ద్రో, విరతి వనితా సఙ్గముదితః**
**సుఖీశాన్త శ్శేతే మునిరతను భూతిర్నృప ఇవ॥ (94)**

విశాలమగు భూమిశయ్యగా, దిండుభుజముగా, ఆకాశము చాందినీగా, గాలులు వినలుగా, చంద్రుడు చక్కని దీపముకాగా, వైరాగ్యమనెడి యువతితో చేరి, సంతోషముతో సుఖించి, శాంతుడై యోగి మహారాజువలె విలాసముగా శయనించును.

**భిక్షాశీ జనమధ్య సఙ్గరహిత స్స్వాయత్త చేష్ట స్సదా**
**హానాదాన విరక్త మార్గ నిరతః కశ్చిత్త పస్వీస్థితః**
**రథ్యాకీర్ణ విశీర్ణ జీర్ణవసనై రాస్యూతక న్థాధరో**
**నిర్మానో నిరహంకృతి శ్శమసుఖా భోగైక బద్ధస్పృహః॥ (95)**

త్యజించుట, స్వీకరించుటల యందానక్తి లేని మార్గమున వున్న వాడు, స్వేచ్ఛాప్రయత్నము గలవాడు, జనసంసర్గమువలని పాపమునకు దూరమైన స్వభావము గలవాడు. వీధియందు పడియున్న పేలికలచే చేయబడిన బొంతపై కూర్చున్నవాడు, పరమాత్మయందానక్తి గలవాడు. నిరహంకారియునై ఎవడో యొక్కడు భూమియందుండును.

**చణ్డాలః కిమయం? ద్విజాతిరథవా? శూద్రోఽథ? కింతాపసః?**
**కింవా తత్త్వ వివేక పేశలమతి ర్యోగీశ్వరః కోఽపికిం?**
**ఇత్యుత్పన్న వికల్ప జల్పముఖరై రాభాష్య మాణా జనై**
**ర్న క్రుద్ధాః పథినైవ తుష్టమనసో యాన్తి స్వయం యోగినః॥ (96)**

మహాయోగులు ఇతడు చండాలుడా, బ్రాహ్మణుడా, శూద్రుడా, తాపసియా, సిద్ధుడా యని సమీపించి వికల్పముగా ప్రేలుచూ జనులు పలికిననూ, కోపమును పొందరు. సంతసింపరు, మౌనముగా సంచరించుచుందురు:-

**హింసా శూన్యమయత్న లభ్యమశనం ధాత్రామరుత్కల్పితం**
**వ్యాళానాం పశవస్తృణాంకుర భుజస్సృష్టా, స్స్థలీశాయినః**
**సంసారార్ణ వలంఘన క్షమధియాం వృత్తిః కృతాసానృణామ్**
**యామన్వేషయతాం ప్రయాన్తి సతతం సర్వే సమాప్తింగుణాః॥ (97)**

బ్రహ్మ పాములకు గాలిని ఆహారముగా చేసి, గోవులకు గడ్డిని ఆహారముగా చేసి నేలను పడకగా జేసెను. నిపుణమతులగు వారికి పరమాత్మ యందు సద్వృత్తిని గూర్చెను ఆ

సద్వృత్తిచే సేవించువారలకు రజోతమోగుణములవలని దోషములు తొలగును

**గంగాతీరే హిమగిరి శిలాబద్ధ పద్మాసనస్య**
**బ్రహ్మధ్యానాభ్యసన విధినా యోగ నిద్రాం గతస్య**
**కింతైర్భావ్యం మమ సుదివసైర్యత్ర తే నిర్విశంకాః**
**కండూయన్తే జరఠ హరిణా స్స్వాంగ మంగే మదియే॥** (98)

గంగానదీ తీరమున హిమాలయ శిలాప్రదేశమున పద్మాసనము వేసుకొని శివధ్యానము చేయుచు యోగనిద్రలోయున్న నాదేహముపై తమ శరీరముల దురద తీరునట్లు భయము లేనివై జింకలు రాచుకొనుట ఎప్పుడు కలుగునో!-

**పాణిః పాత్రం పవిత్రం భ్రమణ పరిగతం భైక్షమక్షయ్యమన్నం**
**విస్తీర్ణం వస్త్రమాశాదశక మపమలం తల్పమస్వల్ప ముర్వీ**
**యేషాం నిస్సంగతాంగీకరణ పరిణతస్వాన్త సంతోషిణస్తే**
**ధన్యాస్సం న్యస్త దైన్య వ్యతికర నికరాఃకర్మ నిర్మూలయన్తి॥** (99)

ఎవరికి పాత్రము హస్తపద్మము, భిక్షాన్నమాహారము, పెద్దశయ్యభూమి, అష్ట దిక్కులు వస్త్రముగానగునో అట్టి సుజనులు నిస్సాంగత్య గుణముచే- వారు ఈ భూమిలో గొప్పవారు-వారికి సుఖానుభవము లెప్పుడో గతించిపోయినవి. అట్టివారు మోహబంధములను వదలించుకొని కర్మబీజములను దహించి వేసెదరు:-

**మాతర్మేదిని! తాతమారుత! సఖేతేజః! సుబంధోజల!**
**భ్రాతర్వ్యోమ! నిబద్ధయేష భవతా మంత్యః ప్రణామాంజలిః**
**యుష్మత్సంగ వశోపజాత సుకృత స్ఫారస్ఫురన్నిర్మల**
**జ్ఞానాపాస్త సమస్త మోహమహిమా లీయే పరబ్రహ్మణి॥** (100)

అమ్మా భూదేవీ! తండ్రీసమీరా! మిత్రమా అగ్నీ! చుట్టమా జలమా! సోదరా ఆకసమా! ప్రేమతో మీకు తుది నమస్కారము చేయుచున్నాను. మీ సాంగత్యముచే కలిగిన పుణ్యము వలన అజ్ఞానము నశించి జ్ఞానముచే పరబ్రహ్మమును పొందెదను:-

ఫలశ్రుతి:-

ఈ కావ్యము లిఖియించిన
జేకొని చదివినను వినిన శిష్టుల కెల్లన్
శ్రీకంఠుడిచ్చు గరి తుర
గాకల్పానల్ప సురుచి రాయుష్యంబుల్:-

## శ్రీ భర్తృహరి వైరాగ్య శతకము సంపూర్ణము

# వైరాగ్యపంచకము
# శ్రీ వేదాంత దేశికులు

కాంచీపుర సమీపంలోని తూపిల్ అను గ్రామమందు 1268లో వేదాంత దేశికులవారు శ్రీ అనంతసోమయాజులకు తోతాద్రియమ్మగార్లకు జన్మించారు. దేశికులవారు శ్రీ వేంకటేశ్వరుని ఘంటావతారము=వీరిభార్యతిరుమంగైయమ్మగారు. వీరు 113 గ్రంథాలను వ్రాశారు=సర్వతంత్రస్వతంత్ర బిరుదాంకితులు. వీరు ఉంఛవృత్తితో జీవించెడివారు. దేశికులవారి బాల్యస్నేహితుడు విద్యారణ్యుడు= విద్యారణ్యుడు విజయనగర సామ్రాజ్యాధిపతి బుక్కరాయలవారి కుమార్తెకుపట్టిన దయ్యాన్ని వదలించి మంత్రి పదవిపొందినాడు=తన స్నేహితుని దారిద్ర్యావస్థపై జాలిపడి రాజ దర్శనంచేసుకొనుటకు వీలుగా ఆహ్వానం పంపినాడు. దానికి బదులుగా దేశికులవారు వ్రాసిపంపిన సమాధానం.

**క్షోణీకోణ శతాంశపాలన కలా దుర్వార గర్వానల ।**
**క్షుభ్య క్షుద్ర నరేంద్ర చాటురచనా ధన్యాన్నమహే ।**
**దేవం సేవితుమేవ నిశ్చిను మహేయో2 సౌదయాలుః పురా ।**
**ధానాముష్టిముచే కుచేల మునయే దత్తే స్మ విత్తేశ తామ్ ।** (1)

తా॥ ఈవిశాల భూమిలో ఒక చిన్న ప్రదేశాన్ని పరిపాలించే గర్వోన్మత్తు లైనక్షుద్ర భూమీశులపై కీర్తనలు చేసేవారిని మేము మన్నించము=వారు పాలించేది, 18 రెప్ప పాటులకు ముప్పదింతలయిన కాలమును 'కల' అని అంటారు కదా, అంతమాత్రమే పిడికెడు అటుకుల నిచ్చిన కుచేలునికి కుబేర ఐశ్వర్యమునిచ్చిన దేవుణ్ణి మేము స్తుతించేది -

దేశికుల వారి ఈ ప్రత్యుత్తరానికి విద్యారణ్యులు బాధపడి "మిత్రమా! నీవు ఈ ప్రాంతానికి రా! రాజే నిన్ను దర్శించే ఏర్పాట్లు చేస్తాను - ఆయన నిన్ను చూస్తే ఆయన నీ ప్రతిభను గుర్తించి నీ పోషణకు అన్ని ఏర్పాట్లను చేయగలడు" అని చెప్పి పంపినాడు. తన వైరాగ్యనిష్ఠను విద్యారణ్యుడు గుర్తించలేదని దేశికులవారు తాను రానని ఖండితముగా చెప్పి వైరాగ్యపంచకమని ప్రసిద్ధి చెందిన ఈ ఐదు శ్లోకాలను వ్రాసి పంపినాడు.

**శిలంకిమనలం భవేదనల మౌదరం బాధితుం ।**
**పయః ప్రసృతి పూరకం కిమునధారకం సారసం ।**
**అయత్నమలమల్లకం పథిపటచ్చరం కచ్చరం ।**
**భజంతి విబుధా ముధా హ్యాహహ కుక్షితః కుక్షితః ॥** (1)

కడుపులోని ఆకలి మంట చల్లార్చడానికి, కళ్లాల్లోరాలిన (శిలం=ఉంచవృత్తి) ధాన్యాన్ని ఏరుకొంటే చాలదా? కొలనులోని ఒక పుడిసెలి నీరు త్రాగితే ప్రాణాధారం కాదా! దారిలో పడియుండే ప్రాతగుడ్డ పేలిక అయత్నంగా దొరకుతుంది - అదిగోచికి సరిపోదా? బుద్ధిమంతులైన వారుకూడా కుక్షితః=పొట్టకోసం, కుక్షితః=దుర్మార్గ ప్రభువులను సేవించు చున్నారే=అయ్యోయ్యో !

**జ్వలతు జలధి క్రోడ క్రీడత్కృపీట భవప్రభా ।**
**ప్రతిభట పటుజ్వాలా మాలాకులో జఠరానలః ।**
**తృణమపి వయం సాయం సంపుల్ల మల్లిమ తల్లికా ।**
**పరిమళము చావాచా యాచామహే న మహీశ్వరాన్ ॥** (2)

సముద్రంలోని బడబాగ్ని నీళ్లలోనే పుట్టి ఆరిపోకుండా ఆనీళ్లనే మ్రింగుతూ జ్వలిస్తూ ఉంటుంది. కడుపులోని ఆకలి మంటకూడా అటువంటిదే. మన ప్రేగుల్లో వుంటూ,నీరువంటి పదార్థాల మధ్య ఉంటూ జ్వలిస్తూనే ఉంటుంది. ఆ బాధను ఓర్చుకొంటాం. భగవదనుగ్రహం వల్ల కలిగిన మా పవిత్ర వాణి అప్పుడే వికసించిన మల్లెలవలె గుబాళిస్తుంది. అట్టి మా మధుర వాక్కులను ప్రభువుల వద్దచేరి, వారిని పొగడుతూ వారిని ఒక గడ్డిపరకను గూడా యాచించము. ప్రాణంపోతే పోవుగాక. వారిని పొగడే నీచ కార్యాన్ని చేయము. రాజును పొగడవద్దు - ఆయన వద్ద వుంటే చాలు కదా అనే దానికి సమాధానము.

**దురీశ్వర ద్వార బహిర్వితర్ధికా ।**
**దురాసికాయై రచితో2 యమంజలి ।**
**యదం జనాభం నిరపాయ మస్తిమే ।**
**ధనంజయ స్యందన భూషణం ధనమ్ ॥** (3)

దుష్ట నరపాలుర వాకిట్లో అరుగుపైన చేతులు జోడించుకొని కూర్చునే పనికి దండం పెడుతున్నాను. డబ్బు ఎట్లావస్తుంది అంటావా ? కాటుకవంటి నల్లనిది, నిరపాయమైనది, ధనంజయుడైన అర్జునుని తేరుకు భూషణమైనది అయిన ఆ ధనం నాకు సిద్ధంగా వుంది - ఆ కృష్ణ పరమాత్మ ఒక్కడుంటేచాలు - చతుర్ధ భువనాల సంపద

నా చేతిలో వుంటుంది.

సాధనంవుండే అది కాటుక వంటిది-కంటికి మంచిది-సాధనం నిరపాయమైనది-మామూలు ధనంతో అన్నీ ఆపదలే అది క్షీణించి పోతుంది-దాయాదులకు దొంగలకు దాని మీదే కన్ను-సాధనం వుండే అది ధనంజయుని అభ్యుదయానికి కారణం పార్థరథానికి భూషణము-అందువల్ల మాకేమియు దిగులు లేదు.

**శరీర పతనావధి ప్రభునిషేవణా పాదనా ।**
**దభింధన ధనంజయ ప్రశమదం ధనం ।**
**ధంధనమ్। ధనంజయ వివర్ధనం ధనముదూఢ గోవర్ధనం।**
**సుసాధన మబాధనం సుమనసా సమారాధనమ్ ॥** (4)

ధనంధనం అంటావా ! దేహ పతనం వరకు ప్రభువుల సేవ చేసి సంపాదించే ధనము కేవలము జఠరాగ్నిని చల్లార్చేది - ఎంతో కష్టపడి సంపాదిస్తే అది ఇచ్చేది స్వల్ప ఫలం - దంధనం=తచ్ఛమైనది. అది నిజమైన ధనము కాదు. అయితే నిజమైన ధనమేది అంటావా? ధనంజయుని అభ్యుయాన్ని కోరేది; ఉదూఢ గోవర్ధనం=ఎత్తబడిన గోవర్ధన పర్వతము కలది. అది సుసాధనం; అబాధనం=బాధకలిగించనిది. మంచిమనస్సు గలవారికి సమారాధనం=ఆనందాన్ని కలిగించేది. అట్టి శ్రీకృష్ణ పరమాత్మయే నా మహాధనం - అబాధనం=బాధలులేనిది. బాధఅనగా దోషములు=ఏ దోషములు లేనిది. అంతేకాక పుణ్యాత్ములకు ఆనందం కలిగించేది. అబాధనం=నిఖిల హేయ(దోష) ప్రత్యయనీకం (1) సకల కళ్యాణ గుణనిధిత్వం (2) ఈరెంటినీ ఉభయలింగాలంటారు. లక్ష్మీపతిలో ఈ రెండూ లెక్కింపరానివి - దోషాలూ గుణాలను ఎవరూ లెక్కించలేరు. గుణాలు సముద్ర తీరంలోని ఇసుక రేణువులవలె లెక్కింపరానివి - దోషాలు అసలులేవు - అందుచేత లెక్క బెట్టలేము కొంగు బంగారంలాంటి శ్రీకృష్ణ పరమాత్మ నాకున్నాడు.

**నాస్తి పిత్రార్జితంకించిత్ । నమయాకించిదార్జితమ్ ।**
**అస్తిమేహస్తి శైలాగ్రే । వస్తుపైతామహం ధనమ్ ॥** (5)

పిత్రార్జితం కొంచెంకూడాలేదు - నేను సంపాదించనూలేదు. అయినాదిగులులేదు. కానీ పితామహుడు (బ్రహ్మ) సంపాదించినధనం కరిగిరి = కంచి =క= బ్రహ్మ, అంచు= పూజించుట = మీద నెలకొని యున్న వరదరాజులున్నాడు అక్కడ అష్టదిగ్గజములు స్వామిని పూజించినవి కావున దానిని హస్తిగిరి అని అంటారు. అక్కడ బ్రహ్మపూజించాడు. వరదుని

**తేన స్వయంభువా తేనసాపురీ నిత్యమంచితా॥**
**తతఃకాంచీతి విఖ్యాతాచతుర్వర్గ ఫల ప్రదా ।**
**అర్థపంచక తత్త్వజ్ఞా ః పంచసంస్కారతత్పరా ః ।**
**అకారత్రయ సంపన్నా మహా భాగవతావృతా ॥ (6)**

I. అర్థపంచకము=ప్రాప్యస్యబ్రహ్మణోరూపం । ప్రాప్తుశ్చప్రత్యగాత్మన :1 ప్రాప్త్యుపాయః ఫలంప్రాప్తే : తదాప్రాప్తి విరోధిచ - (1) పొందదగిన పరమాత్మ రూపము, (2) పొందెడు జీవాత్మ స్వరూపము, (3) పరమాత్మను పొందే ఉపాయము (4) అట్లుపొందుట వలన కలిగే లాభము (5) దానికి వుండే అడ్డంకులు:-

వైరాగ్యపంచకంలో అర్థపంచకం వివరించబడినవి.

II. పంచ సంస్కారములు : (1) తప్తచక్రాం కనము (2) ఊర్ధ్వపుండ్రములు (3) ఆచార్యుడు పెట్టేపేరు (4) అష్టాక్షరీమహామంత్రము (5) భగవదారాధనాక్రమము.

III. అకారత్రయము :- (1) అనన్యార్హ శేషత్వము నారాయణుని కంటే ఇతరదేవతలకు శేషుడు కాకుండుట. (2) అనన్యశరణత్వము = ఇతర దేవతలను శరణుపొందకుండుట (3) అనన్యభోగత్వము = అన్యదేవతలకు భోగ్యము కాకుండుట.

# శివ మహిమ్నః స్తోత్రం
# పుష్పదంత ప్రణీతమ్

పుష్పదంతుడు గంధర్వరాజు, పరమ శివభక్తుడు; అతడు నిత్యం ఇంద్రోద్యానంలోని కల్పవృక్ష కుసుమాలతో పరమేశ్వరుని పూజించేవాడు. ఇంద్రోద్యానం నానాటికి పుష్పరహిత మవుతున్నందుకు శచీపతికి ఆగ్రహం కలిగింది. పూలదొంగను పట్టవలసినదిగా ఆజ్ఞ చేశాడు. ఉద్యానపాలకులు చోరుని బంధింపలేక బృహస్పతి నాశ్రయిస్తే ఆయన శివనిర్మాల్యం వనమంతా వెదజల్లండని ఉపాయం చెప్పాడు. పుష్పదంతుడు పూలకై వచ్చి చీకటిలో శివనిర్మాల్యము త్రొక్కి ప్రభావహీనుడయ్యాడు.

తన్ను రక్షింపుమని సదాశివుని పరిపరి విధాల ప్రార్థించి సఫలీకృత మనోరథుడయ్యాడు.

శివ మహిమ్న స్తోత్రం భక్తుల పాలిటి పెన్నిధి. ఇహపర సాధకమైన ఈ దివ్యస్తవమునకు దేశంలో అనన్య సామాన్యమైన ప్రచారముంది

# శివ మహిమ్నః స్తోత్రమ్

**మహిమ్నః పారంతే పరమ విదుషో యస్యస దృశీ**
**స్తుతిర్బ్ర హ్మాదీనామపి తదవసన్నా స్త్వయి గిరః,** 1
**అథావాచ్యః సర్వస్స్వమతి పరిణామావధి గృణన్**
**మమాప్యేష స్తోత్రేహర నిరపవాదః పరికరః !!** (1)

హర=హరా! తేమహిమ్నః=నీ మహిమ యొక్క; పరం=శ్రేష్ఠమైన; పారం అవిదుషం=తెలియని వాని; స్తుతిః=స్తోత్రము; అసదృశీయది=యోగ్యముగా లేనిచో; తత్=అపుడు; బ్రహ్మాదీనాం=బ్రహ్మాదుల; గిరో2పి=వాక్కులు కూడ; త్వయి=నీ విషయమున; అవసన్నాః=దుర్బలము లైనవి; అథా=లేక; సర్వః=సర్వజనులు; స్వమపి పరిణామావధి=తమ బుద్ధిబలము కొద్దీ; గృణన్=పొగడుచు; అవాచ్యః=నిర్దోషుడగునేని; స్తోత్రే=స్తుతియందు; మమ=నాయొక్క; ఏషః=ఈ; పరికరో2పి=ఉద్యోగమైనను; నిరపవాదః=నిర్దుష్టమైనదే;

శంకరా! నీ మహామహిమను తెలియుటకు నీకన్ననూ గొప్పవాడు మరొకడుండ వలయును. అట్టివాడు లేడు ఎవడు నిన్ను కీర్తించిననూ, అది అసంపూర్తిగనే యుండును. నిన్ను పొగుడుటలో బ్రహ్మాదులు కూడా అసమర్థులే. అయిననూ వారు తమకున్న బుద్ధిబలముతో నిన్ను కీర్తించి కీర్తి పొందినారు. కావున నేనుకూడా అల్పజ్ఞుడనని తెలిసి కూడ యథాశక్తితో స్తుతించి, ఇదియే నిర్దోషమగు పద్ధతియని భావించుచున్నాను. పరమేశ్వరుని మహిమ అపారమైనది. దానిని తెలియని వారు వర్ణించుట హాస్యాస్పదమైనను, యథాశక్తితో శివుని ప్రార్థించుటలో దోషమేమియూ లేదు:-

**అతీతః పంథానం తవచ మహిమా వాఙ్మనసయో**
**రతద్వ్యా వృత్యాయం చకిత మభిధత్తే శ్రుతిరపి**
**సకస్య స్తోతవ్యః కతి విధగుణం కస్య విషయః**
**పదేత్వర్వా చీనే పతతి నమనః కస్యనవచః!!** (2)

తవ=నీ;మహిమా=మహిమ; వాఙ్మనసయోః=మనోవాక్కులయొక్క; పంథానం= మార్గమును ; అతీతః=మించినది; చ=మరియు; యం=ఏ నీ మహిమను గూర్చి; శ్రుతిరపి=వేదము కూడా; అతద్వ్యా వృత్త్యా=అన్యవ్యావృత్తి రూపముతో; చకితం= భయపడినట్లుగా; అభిదత్తా=చెప్పుచున్నదో; సః=అది; కస్య=ఎవనికి; స్తోతవ్యః=స్తుతింప శక్యము? కతి విధగుణః=వివిధ గుణములు గల ఆ మహిమ; కస్య=ఎవనికి;

విషయః=గోచరమగును; తు=కానీ; అర్వాచీనే=ఇటీవలి; పదే=మహిమ విషయము నందు; కస్య=ఎవని; మనః=మనస్సు; వచః=వాక్కు; న పతతి=ప్రవర్తించదు?

శివా! నీ మహిమను వేదముకూడా సూటిగా చెప్పక, భయముతో శివ మహిమ కన్న వేరులేదులేదని (నేతి, నేతి) అని అభిదావృత్తితో (పేరుతో పిలిచినట్లు గాక) అన్యవస్తు నివృత్తి (రెండవది లేదనుట) ద్వారా చెప్పుచున్నది. నీ మహిమమనోవాచమగోచరము. అట్టి అపార మహిమను ఎవరు వర్ణించగలరు? ఎవరికి తెలియును. అయితే ఉపాసకులు మాత్రము ఇటీవల నీ గుణగణములను సంకల్పించు కొని, త్రినేత్రుడు. త్రిపురారి, ఉమాపతి, త్రిశూలపాణి అని నీ మనోహర రూపమును వర్ణించుచున్నారు. (శివుని నిర్గుణ స్వరూపము గూఢము. సగుణము విశదము. సగుణ రూపమును వర్ణించుటకు అందరికీ అధికారమున్నది):-

**మధుస్ఫీతా వాచః పరమమృతం నిర్మితవత**
**స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగు రోర్విస్మయ పదమ్**
**మమత్వే తాంవాణీం గుణకథన పుణ్యేన భవతః**
**పునామీ త్యర్థే2స్మిన్ పురమథన బుద్ధిర్వ్యవసితా !! (3)**

బ్రహ్మన్=సర్వవ్యాపీ; పరమం=శ్రేష్ఠమైన; అమృతం=అక్షయముగా; మధుస్ఫీతా= మధురరస భరితములైన; వాచః=వేదవేదాంతాది వాక్కులు; నిర్మితవతః=సృజించినట్టి; తవ=నీకు; సురగురోః=బృహస్పతి యొక్క; వాగపిః=వాక్కులుకూడా; విస్మయపదం= ఆశ్చర్యమును; కిం=అగునా? తు=మరియు; పురమథనా=త్రిపురారీ! భవతః=నీయొక్క; గుణకథన పుణ్యేన=గుణములను గానము చేయుటచే కలిగిన పుణ్యముచేత; ఏతాం=ఈ; వాణీం=వాక్కును; పునామి=పవిత్రము చేసికొనుచున్నాను; ఇతి=ఇట్లని; అస్మిన్=ఈ; అర్థే=ప్రయోజనమందు; మమ=నాయొక్క; బుద్ధి=మతి; వ్యవసితా= ఉద్యుక్తమైనది;

ఓ సర్వవ్యాపీ! శాశ్వతమైన తేనెలొలుకు వేదరాశిని నిర్మించిన ఈశానుడవైన నీకు వాచస్పతియైన దేవగురువు యొక్క కవిత్వము కూడా ఆశ్చర్యపరచదు. అయితే నీ పవిత్ర చరిత్రను నుతించుట వలన నావాక్కు కూడా పవిత్రమగుననియే గానీ, ఆ లాభము కొరకేగానీ, నా బుద్ధివైభవముతో నీకు సంతోషము కలిగించుటకు కాదు:-

**తవైశ్వర్యం యత్త జ్జగదుదయ రక్షా ప్రలయకృత్**
**త్రయీ వస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు,**
**అభవ్యానా మస్మిన్ వరద రమణీయా మరమణీం**
**విహస్తుం వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః!! (4)**

వరద=వరములిచ్చు శివా! తవ=నీయొక్క; యత్=ఏ; ఐశ్వర్యం=మహిమ కలదో; తత్=ఆశక్తి; జగదుదయ రక్షాప్రలయకృత్=జగత్తు యొక్క సృష్టి, స్థితి, సంహారములకు కారణమైన; గుణభిన్నాసు=గుణములచే ప్రత్యేకింపబడిన; తిసృషు=మూడైన; తనుషు=బ్రహ, విష్ణు, రుద్రాత్మకమైన శరీరములలో; వ్యస్తం=ప్రతిష్ఠితమైనది; త్రయీవస్తు=వేదముల తాత్పర్యము; ఇహ=ఈ లోకమందలి; ఏకే=కొందరు; జడధియః=మందబుద్ధులు; అస్మిన్=ఈ ఐశ్వర్య విషయమున; విహంతుం= ఖండించుటకు; అభవ్యానాం=అమంగళులగు వారికి; రమణీయాం=రమ్యమైన; అరమణీం=విచార హీనమైన; వ్యాక్రోశీం=ఆక్షేపణపు కేకను; విదధతే=వేయుచున్నారు:-

ప్రభూ! నీ ఈశ్వరత్వము ఇంతింతన రానిది. ఆ మహిమ వల్లనే సత్త్వరజస్తమో గుణాత్మకములైన, బ్రహ్మ, విష్ణు. రుద్రాత్మకములైన త్రిమూర్తులను కల్పించి, వానితో జగత్తు యొక్క సృష్టి, స్థితి, సంహారములను చేయించుచున్నావు. దీనిని వేదములు చెప్పుచున్నవి. కానీ ఈలోకములోని కొందరు మందబుద్ధులు, తమబోటి అవివేకులకు రుచించునట్లు, అమంగళకరమైన, యుక్తిహీనములగు ఆక్షేపముల చేయుచున్నారు.

**కిమీహః కిం కాయః సఖలు కిముపాయ స్త్రిభువనం**
**కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతిచ,**
**అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసర దుఃస్థో హతధియః**
**కుతర్కో2యం కాంశ్చిన్ ముఖరయతి మోహాయ జగతః!!** (5)

సః=ఆ; ధాతా=ఈశ్వరుడు; కిమీహః=ఏ కోరికతో; కిం కాయః=ఏ శరీరము కలవాడై; కిము పాయః=ఏ సాధనములతో; కిమాధారః=ఏ ఆధారముతో; కిము పాదానః=ఏ సామగ్రి కలవాడై; త్రిభువనంచ=ముల్లోకములను; సృజతి=పుట్టించుచున్నాడు? ఇతి=ఇట్లు; అతర్క్యైశ్వర్యే=ఊహాతీతమైన మహిమగల; త్వయి=నీయందు; అనవసరదుస్థః=వ్యర్థమైన తుచ్ఛమైన; అయం=ఈ; కుతర్కః=కుతర్కము; జగతః=జగముయొక్క; మోహాయ=భ్రాంతి కొరకు; హతధియః=బుద్ధిహీనులై; కాంశ్చిత్=కొందరిని; ముఖరయతి= వదరు బోతుల చేయుచున్నది:-

ఈశ్వరుడు జగత్తును సృష్టించుచున్నాడంటే:- ఎందుకోసం సృష్టించాడు? ఏదేహంతో పుట్టించాడు? అందుకే సామగ్రిని ఉపయోగించాడు ఏయే సాధనాలతో చేసాడు? ఎక్కడ నిలుచున్నాడు? ఏ విధంగా చేయును? ఇటువంటి ఆక్షేపణలతో (తార్కికులు, నైయ్యాయికులు) లోకులకు భ్రాంతి గలిగించుచున్నారు. (నీవు అఘటనఘటనా సమర్థుడవు నీవు సర్వకర్తవు. నీ మహిమ అపారమైనదని వారికి తెలయదు)

**అజన్మానో లోకాః కిమవయవ వన్తోఽపి జగతా**
**మధిష్ఠాతారం కిం భవ విధిరనా దృత్య భవతి,**
**అనీశోవా కుర్యాద్భువన జననే కః పరికరో**
**యతో మందా స్త్వాం ప్రత్యమరవర సంశేరత ఇమే!!** (6)

అమర వర=దేవశ్రేష్ఠా; యతః=ఎందువలన; ఇమే=ఈ; మందాః=మూఢులు; త్వాంప్రతి=నిన్ను గూర్చి; సంశేరతే= సంశయించుచున్నారో; లోకాః=లోకములు; అవయవ వంతో=అంగములు కలవియైనను; అజన్మానః=పుట్టుక లేనివి; కిం=అవునా? భవవిధిః=సృష్టి పద్ధతి; అధిష్ఠాతారం=కర్తను; అనాదృత్య=అపేక్షింపకయె; భవతి= అగుచున్నదా? వా=లేక; అనీశః=జీవుడెవడైన; కుర్యాత్=చేయగలడా? భువనజనే= జగత్సృష్టియందు; కః=ఏ; పరికరః=సామగ్రి కలదు?:-

శంకరా! ఈ జగత్సృష్టి విషయంలో నీ కర్తృత్వమును కొందరు మూఢులు సందేహించుచున్నారు. ఈ జగత్తులో స్థావర జంగమాత్మక అనేక అంగములు కలిగి చావు పుట్టుకలు కలిగియున్నవి. వీటికి జన్మము లేదని ఎవరైనను చెప్పగలరా? కర్తలేకయే కార్యమెట్లు సంభవించును? దేవుడు కాక జీవుడే సృష్టించుచున్నాడ నగలమా? వానికి మాత్రము సృష్టి సామగ్రి కావలయును కదా? (ఆదిలో సూక్ష్మశక్తి రూపముగనున్న జగదాదులు శివేచ్ఛననుసరించి వివిధ రూపములబొందుచున్నవి.)

**త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవ మితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ,**
**రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథ జుషాం**
**నృణా మేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవ ఇవ!!** (7)

త్రయీ= వైదిక కర్మ కాండమంతయు; సాంఖ్యం=సాంఖ్యమతము; యోగః =యోగశాస్త్రము; పశుపతి మతం=పాశుపతము; వైష్ణవం=వైష్ణవము; ఇతి=ఇట్లుగా; ప్రభిన్నే=అనేక విధములుగ; ప్రస్థానే=దర్శన శాస్త్రమందు; ఇదం=ఇది; పరం=శ్రేష్ఠమైనది; చ=మరియు; అదః=అది; పథ్యం=హితకరమైనది; ఇతి=ఇట్లు; రుచీనాం=అభిరుచుల యొక్క; వైచిత్ర్యాత్=భిన్నత వలన; ఋజు కుటిల నానాపథజుషాం=వంకరైనట్టియు, చక్కనైనట్టియు వేర్వేరు త్రోవల నడచుచున్న; నృణాం=జనులకు; త్వం=నీవు; ఏకః=ఒక్కడవే; పయసాం=జలములకు; అర్ణవ ఇవ= సముద్రమువలె; గమ్యః= పొందదగిన వాడవు; అసి=అయివున్నావు:-

వైదిక కర్మలు, పంచవింశతి తత్త్వాత్మక సాంఖ్యము, పతంజలి యోగశాస్త్రము, పాశుపతము, కైంకర్య రూపవైష్ణవములను అనేక ఆత్మతత్త్వబోధక మతములెన్ని

యోగలవు. ఎన్నిడొంక తిరుగుళ్ళు తిరిగిననూ, నేరుగా ప్రవహించిననూ నదులన్నియూ ఒక సముద్రమునే జేరునట్లు, తమ అభిరుచి భేదమువలన నరులు భిన్నమతమార్గముల ననుసరించిననూ, తుదకు నీవేశరణ్యుడవు:-

**మహోక్షః ఖట్వాంగం పరశు రజినం భస్మ ఫణినః**
**కపాలం చేతీయత్తవ వరద తన్త్రోప కరణమ్**
**సురాస్తాం తామృద్ధిం విదధతి భవద్భ్రూ ప్రణిహితాం**
**నహి స్వాత్మారామం విషయ మృగతృష్ణా భ్రమయతి!!** (8)

వరద=కామిత ఫలదా! మహోక్షః=వృద్ధ వృషభమును; ఖట్వాంగం=మంచపు కోడును; పరశుః=గండ్ర గొడ్డలి; అజినం=చర్మము; భస్మ=విభూతి; ఫణినః=పాములు; కపాలం=బ్రహ్మపుఱ్ఱె; ఇతి=ఇట్లు; తవ=నీకు; తంత్రోపకరణం=ప్రధాన సామగ్రి ఇయత్=ఇంతియే; తు=అయితే; సురాః=దేవతలు; భవద్భ్రూప్రణి హితాం=నీ కనుసైగలచే గ్రహింపబడిన; తాంతాం=ఆయా; ఋద్ధిం=సంపదను; దధతి=పొందు చున్నారు; స్వాత్మారామం=తనయాత్మ యందే రమించు పరమేశ్వరుని; విషయ మృగతృష్ణా=విషయాభిలాష యనెడి ఎండమావి; నభ్రమయతిహి=చలింప చేయదు కదా!

శివా! నీకు ముసలి ఎద్దు, మంచపుకోడు, గండ్రగొడ్డలి, ఏనుగుతోలు, బూడిద, పాములు, పుఱ్ఱెలు ఇవియేనీ సంపద., నీ కటాక్ష వీక్షణముల వలన ఇంద్రాది దేవతలు మహాపదవులను పొందిరి. నీవు ఆత్మానందఘనుడైన మహానుభావుడవు. అశాశ్వతమైన మృగతృష్ణ వంటి విషయ సుఖములు నిన్ను చలింపజేయలేవు కదా!

**ధ్రువం కశ్చిత్సర్వం సకల మపర స్త్వ ధ్రువ మిదం**
**పరోధ్రౌవ్యా ధ్రౌవ్యే జగతి గదతి వ్యస్త విషయే,**
**సమస్తే2ప్యే తస్మిన్ పురమథన తైర్విస్మిత ఇవ**
**స్తువన్ జిహ్రేమి త్వాం నఖలు నను ధృష్టా ముఖరతా!!** (9)

పురమథన=త్రిపురారీ! కశ్చిత్=ఒకానొకడు; సకలం=సమస్త; ఇదం=ఈ; జగత్=జగత్తునుధ్రువం=నిత్యమైనది గాను; అపరః= ఇంకొకడు, అధ్రువం =ఈనిత్యమైనదిగాను పరస్తు=వేరొకడు; సమస్తే2పి= సకలమైనట్టి; ఏతస్మిన్=ఈ; జగత్=జగత్తు; ధ్రౌవ్యా ధ్రౌవ్యే=నిత్యానిత్యములను; వ్యస్త విషయే=వేరు వేరు నియతములనియు; గదతి=చెప్పుచున్నారు; తైః=అట్టివారిచేత; త్వా=నిన్ను; స్తువన్=పొగడు చున్నట్టి; అహం=నేను; విస్మిత ఇవ=పరిహసింప బడిన వానివలెను న్నను; జిహ్రేమి=సిగ్గు పడుటలేదు; నను=అయితే; ముఖరతా=వాచాలత్వం; ధృష్టా=

దిట్టమైనది కదా!

హరా! కుమారిల భట్టుని భాట్టమతములో జగత్తు ప్రవాహరూపమున నిత్యమనియు, బౌద్ధులు క్షణిక మనియు జైనులు నిత్యానిత్యమనియు ఈశ్వరునికీ జగత్తుకు సంబంధము లేదని సిద్ధాంత పరంగా కోలాహలము చేయుచుండగా నేను నిన్ను జగత్కర్తగా స్తుతించుచుండగా నేను అల్పజ్ఞుడనని పరిహాసింప బడుచున్నాను. అయినను నేను సిగ్గు చెందను. నా ప్రాగల్భ్యము నాది:- నేను ఆస్తికుడను:-

**తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించి ర్హరి రధః**
**పరిచ్ఛేత్తుం యాతావనల మనల స్కంధ వపుషః**
**తతో భక్తి శ్రద్ధాభరగురు గృణద్భ్యాం గిరిశయత్**
**స్వయం తస్థే తాభ్యాం తవ కిమను వృత్తిర్న ఫలతి!! (10)**

గిరిశ=కైలాసవాసీ! అనలస్కంధవపుషః=జ్యోతి స్తంభాకార శరీరము కలిగినట్టి; తవ=నీయొక్క; ఐశ్వర్యం=మహిమను; యత్నోత్=ప్రయత్నము వలన; పరిచ్ఛేత్తుం= నిశ్చయించుటకు; విరించః=బ్రహ్మదేవుడు; ఉపరి=మీదికిని; హరిః=విష్ణువు; అధః=క్రిందికిని; యాతౌ=పోయిన వారై; యత్=ఎందువలన; అనలం=అసమర్థులైరో; తతః=పిమ్మట; భక్తిశ్రద్ధాభరగురు గృణద్భ్యాం=భక్తి శ్రద్ధల యొక్క నిరతి శయాధిక్యము ప్వాంగస్తోత్రమొనర్చునట్టి; తాభ్యాం=ఆబ్రహ్మ విష్ణువులకు; స్వయం=నీవు; తస్థే=ప్రత్యక్షమైతివి. తవ=నీయొక్క; అనువృత్తిః=అనుసరణము; నఫలతి=ఫలించదా?

ఓ కైలాస వాసీ! హరిబ్రహ్మలు ఒకప్పుడు నీ జ్యోతిర్లింగ స్వరూపమును దర్శించదలచి హరి వరాహరూపముతో పాతాళమునకు; బ్రహ్మ హంసరూపముతో ఆకాశమువైపు చాలా కాలము ప్రయాణముచేసి, నీ ఆద్యంతములను గ్రహించలేక పోయిరి. నీవు భక్తిగమ్యుడవని తెలిసి వారు భక్తి తత్పరులై నిన్ను ప్రార్థించిరి. అపుడు నీవు వారికి ప్రత్యక్షమైతివి. నీపై భక్తి అమోఘము తప్పక ఫలించును:-

**అయత్నా దాసాద్య త్రిభువన మవైర వ్యతికరం**
**దశాస్యో యద్బాహూ నభృత రణకణ్డూ పరవశాన్**
**శిరః పద్మశ్రేణీ రచిత చరణాంభో రుహబలేః**
**స్థిరాయాస్త్వద్భక్తే స్త్రిపురహర విస్ఫూర్జిత మిదమ్!! (11)**

త్రిపురహర=త్రిపుర సంహారీ; దశాస్యః=రావణుడు; అయత్నాత్=అనాయాసముగ; త్రిభువనం=మూడులోకములను; అవైరి వ్యతికరం=శత్రువుల సంబంధం లేని వానినిగా; ఆపాద్య=పొంది; రణకండూ పరవశాన్=యుద్ధకండూతి చేరేగిన; బాహూన్= భుజములను; యత్=ఎందువలన; అభృత=ధరిచెనో; తత్=ఈ ధారణ సామర్థ్యము.

శిరః=పద్మశ్రేణీ రచిత చరణాం భోరుహబలేః=శిరములనెడి పద్మముల పంక్తి చేత చేయబడిన నీ పాదములనెడు కమలముల యొక్క అర్చనగల; భక్తేః=భక్తి యొక్క; విస్ఫూర్జితం=విజృంభణము:-

ఓత్రిపురారీ! రావణుడు నీమీది భక్తితో తనపడితలలను నరకి నీ పాదపద్మముల కర్పించి, నీవలన వరముల పొంది అనాయాసముగ వైరులు లేకుండ ముల్లోకములకధిపతియై తన బాహువుల తీటతీర్చుకొనుటకు అవకాశమే లేకుండ చేసుకొనెను. ఇది నీ అనుగ్రహము వలన లభించినది.

**అముష్యత్వత్సేవా సమధిగత సారం భుజవనం**
**బలాత్కైలాసే2 పి త్వదధివసతౌ విక్రమయతః**
**అలభ్యా పాతాలే2ప్యలస చలితాంగుష్ఠ శిరసి**
**ప్రతిష్ఠా త్వయ్యాసీత్ ధ్రువ ముపచితో ముహ్యతిఖల :** (12)

త్వత్సేవాసమధి గతసారం=నీసేవచేత పొందబడిన శక్తి గలిగి నట్టి, భుజవనం=బాహుసమూహమును గూర్చి, త్వదధివసతౌ=నీ నివాస స్థానమైన, కైలాసే 2 పి=కైలాసమునందును, బలాత్=బలవంతముగా. విక్రమయతః=పరాక్రమము చూపింపదలచిన, అముష్య=ఈరావణునికి, త్వయి=నీవు, అలసచలితాంగుష్ఠశిరసి= మెల్లన కదలింపబడిన కాలిపెద్దవేలి యొక్క కొనగలవాడవుకాగా, పాతాలే2పి= పాతాళమునందును, ప్రతిష్ఠా=వునికి, అలభ్యా=దుర్లభమైనట్టిది, ఆసీతో=అయెను, ఉపచితః ఔన్నత్యమునందిన, ఖలః=దుష్టుడు, ముహ్యతి = వివేకహీనుడగు చున్నాడు.

ఈ రావణుడు నీ అనుగ్రహము వలననే బాహుబలము పొందియు, నీనిలయమగు కైలాసము మీదనే వాటిని ప్రయోగింపదలచినపుడు, నీవు కాలి వ్రేలిని మాత్రమే కదలించి, అణచితివి. అంత రావణుడు పాతాళములో కూడ నిలకడ దొరకక అధఃపతిత డయ్యెను. భక్తుడైనను పరమేశ్వర తిరస్కారమువలన దుర్గతి నొందును.

**యదృద్ధిం సుత్రామ్ణోవరద పరమోచ్చైరపి సతీ**
**మధశ్చక్రే బాణః పరిజనవిధేయ త్రిభువనః,**
**న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయో**
**ర్నకస్యాప్యున్నత్యై భవతి శిరస స్త్వయ్యవనతిః** (13)

వరద=వరదా; పరిజన విధేయ త్రిభువనః=సేవకులవలె లొంగదీయబడిన త్రి లోకములుగల; బాణః=బాణాసురుడు; సుత్రాన్ణః=ఇంద్రుని యొక్క; పరమోచ్చై స్సతీం=మిక్కిలి అభ్యున్నతి నందిన; బుద్ధిమపి=సంపదను కూడా; యత్=ఎందుకు; ·గశ్చక్రే =తిరస్కరించెనో; తత్=అది; త్వచ్చరణయోః=నీ పాదముల యొక్క,

తస్మిన్=ఆ; వరివసితరి=భక్తునియందు; నచిత్రం=ఆశ్చర్యము కాదు; త్వయీ=నీ విషయమై; శిరసః=శిరస్సు యొక్క; అవనతిః=వంచుట; కస్యై=ఏ; ఉన్నత్యై=సమృద్ధి కొరకు; నభవతి=కాదు?.

శంకరా! బాణాసురుడు ముల్లోకములను తన సేవకులవలె చేసుకొని స్వర్గాధిపతియగు ఇంద్రుని మహైశ్వర్యమును కూడ లెక్కసేయక సుఖియై యుండెననుట సుప్రసిద్ధమే. కానీ, నీ యనన్యోపాసకుడగు ఆ బాణునియందు, ఈ త్రిభువనాధిపత్య ప్రాప్తి ఏమియు ఆశ్చర్యముకాదు. నిను కొల్చిన వారికి సకలైశ్వర్యములు లభించకుండునా?.

బాణుని కథ:- కుమారస్వామి యొక్క పరిక్రమమును గాంచి, బాణుడు తానును శివపుత్రుడు గావలెనని ఘోరతపస్సు చేయ శివుడు ప్రసన్నుడై అటులే బాణుని పుత్రునిగా స్వీకరించాడు. పిమ్మటనే బాణుడు ఇంద్రాదుల జయించగలిగాడని పూర్వగాధ. (హరివంశం)-ప్రస్తుతము త్రిభువనాధి పతియైనా కైలాసమును శివుని కూడా ఏలినాడా అను ప్రశ్నకు, శివుడు బాణునిఇంట కావలిగాచెనను కథకూడా సమాధానముగా చెప్పవచ్చును.

**అకాండ బ్రహ్మాండక్షయ చకిత దేవాసుర కృపా**
**విధేయస్యాసీ ద్యస్త్రినయన విషం సంహృతవతః**
**సకల్మాషః కంఠే కురుతే నశ్రియ మహో**
**వికారోఽపి శ్లాఘ్యో భువన భయ భంగవ్య సనినః!!** (14)

త్రినయన=ఓ ముక్కంటీ! అకాండ...విధేయస్య=అకాలము నందు బ్రహ్మాండము యొక్క నాశముచేత భీతులైన దేవదానవుల యందుగల కృపవలన వశుడవైనట్టియు; విషం=కాలకూటమును; సంహృతవతః=పానమొనర్చినట్టియు; తవ=నీయొక్క; కంఠే=కంఠమునందు; యః=ఏ; కల్మాషః=నలుపు; ఆసీత్=అయ్యెనో; సః=అది; శ్రీయం=శోభను; నకురుతేన=కలిగించలేదని కాదు; అహో=ఆశ్చర్యము; భువనభయ భంగ వ్యసనినః=లోకముల భయము యొక్క నాశము నందు ఆసక్తిగల వానికి; వికారోఽపి=వికారమైనను; శ్లాఘ్యః=శ్లాఘింప దగినదియే.

ఓ ముక్కంటీ! అకస్మాత్తుగా పుట్టిన హాలాహలము యొక్క తీవ్ర జ్వాలలకు జగములు మాడిపోవునను భయముతో నీకు శరణాగతులైన దేవదానవులను కరుణించి విషమును మ్రింగి నీగొంతును నల్లగా చేసుకొంటివి. అదియును ఒక అలంకారమువలె కాంతిలీనుచున్నది. లోక రక్షణకు పూనిన వానికి వికారము కూడా అలంకారముగా వుండును కదా!

**అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే**
**నివర్తన్తే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః**
**సపశ్యన్నీశ త్వామితర సురసాధారణ మభూత్**
**స్మరః స్మర్త వ్యాత్మా నహివశిషు పథ్యః పరిభవః!!** (15)

ఈశ=ఈశ్వరా! నిత్యం=ఎల్లప్పుడు; జయినః=జయశీలుడైన; యస్య=ఏమన్మధుని యొక్క; విశిఖాః=బాణములు; సదేవాసురనరే=దేవ, దానవ, మానవులతో కూడిన; జగతి=జగత్తులో; క్వచిదపి=ఒకప్పుడైనను; అసిద్ధార్థాః=ఫలింపని ప్రయోజనము గలవియై; నైవ నివర్తన్తే=వెనుకకు మరలవో; సః=అట్టి; స్మరః=మన్మధుడు; త్వాం=నిన్ను; ఇతరసుర సాధారణం=ఇతర దేవతల సమానముగా; పశ్యన్=చూచువాడై; స్మర్తవ్యాత్మా=స్మరింపదగిన శరీరముగలవాడు; అభూత్=అయ్యేను; హి=కదా; వశిషు=ఇంద్రియ నిగ్రహముగల వారియందు; పరిభవం=తిరస్కారము; నపథ్యః= హితకరము కాదు.

ఈశ్వరా! ఎల్లప్పుడు జయించే మన్మధుని బాణములు ఒక్కప్పుడు కూడ నిష్ఫలము కాలేవు. ఆ బాణములు దేవ, దానవ, మానవులను జయించినవి. ఈ మన్మధుడు నిన్ను కూడా ఇతర దేవతలవలె భావించి తన బాణముల నీమీదనే ప్రయోగించి, అశరీరియయ్యేను. స్మర=స్మర్యతే; జనైః=జనులచే స్మరింపబడువాడు. ఇపుడు ఈనామము సార్థకమైనది. తానే ఒకప్పటి తన శరరముగూర్చి, ఇప్పుడు తలచుకుంటున్నాడు-జితేంద్రియులను పరాభవింప పూనుట మంచిదికాదు.

**మహీపాదా ఘాతా ద్ర్వజతి సహసా సంశయపదం**
**పదం విష్ణోర్భ్రామ్య ద్భుజపరీఘు రుగ్ణ గ్రహ గణమ్**
**ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్య నిభృత జటాతాడిత తటా**
**జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా!!** (16)

జగద్రక్షాయై=లోకముల రక్షించుటకు; త్వం=నీవు; నటసి=నృత్యము చేయు చున్నావో(అపుడు); మహీ=భూమి; పాదాఘాతాత్=పాదముల ద్రేటువలన; సహసా= ఒక్కసారిగా; సంశయపదం=సందేహాస్పదమును; వ్రజతి=పొందుచున్నది; విష్ణోఃపదం= ఆకాశము; భ్రామ్యద్భుజ పరిఘురుగ్ణ గ్రహగణం=తిరుగుచున్న భుజములనెడి గడియలచేత పీడింపబడిన, సూర్యాది గ్రహములు కలదై; ద్యౌః=స్వర్గలోకము; అని భృతజటా తాడిత తటా=చంచలములైన జడలచేత కొట్టబడిన ఒడ్డుకలదై; ముహుర్ముహుః=మాటి మాటికి; దౌస్థ్యం=దురవస్థను; యాతి=పొందు చున్నది; విభుతా=ప్రభుత్వము; వామైవనను=వక్రమైనదే కదా!

నీవు లోకరక్షణార్థమై తాండవనృత్యము చేయునప్పుడు నీ పాదా ఘాతమునకు భూమి చలించిపోతున్నది. అంతరిక్షము నీ దీర్ఘబాహువుల దెబ్బలకు సూర్యాది గ్రహములు ముక్కలై పోవుచున్నవి. నీ దీర్ఘ జడల వ్రేటులకు స్వర్గలోకము ఇటునటు కొట్టుకొనుచు, వినాశభీతితో వున్నది. ఇది యంతయు, ఒకే మారు కలుగుచున్నది. కావున నీవు లోకహితముకై నటించినను బాధలు తప్పుట లేదు. ప్రజాపాలనమునందు, ఒక విధముగ మేలుచేయవలయునన్న, వేరొక విధముగ కీడుకూడా కలుగుట తప్పదు గదా!

**వియ ద్వ్యాపీ తారాగణ గుణిత ఫేనోద్గ మరుచిః**
**ప్రవాహో వారాంయః పృషతలఘుదృష్టః శిరసితే,**
**జగద్వీపాకారం జలధి వలయం తేన కృతమి**
**త్యనేనై వోన్నేయం ధృతమహిమ దివ్యం తవ వపుః!! (17)**

వియద్వ్యాపీ=ఆకాశమును వ్యాపించినట్టియు; తారాగణ గుణిత ఫేనోద్గమరుచిః= చుక్కల గుంపు చేత ఇబ్బడిగా చేయబడిన నురుగుల పుట్టుక చేత శోభ కలిగినట్టియు; వారాం=గంగాజలము యొక్క; యః=ఏ; ప్రవాహః=ప్రవాహము; తే=నీయొక్క; శిరసి=తలమీద; పృషతలఘు=జలబిందుల వలె చిన్నదిగా; దృష్టః=చూడబడెనో; తే=ఆ ప్రభావము చేత; జగత్=భూలోకము; జలధివయ=సముద్రమే అగడ్తగా గల; ద్వీపాకారం=ద్వేపమువలె; కృతం=చేయబడినది; ఇత్యనేనైవ=ఇట్లనుట చేతనే; ధృత మహిమ=ధరింపబడిన మహిమ గలిగినట్టి; దివ్యం=ప్రకాశవంతమైన; తవ=నీయొక్క; వపుః=దేహము; ఉన్నేయం=ఊహింపదగినది:-

మహాదేవా! నీ అద్భుతమైన ఆకారమును ప్రత్యక్షముగా చూచుటకు సాధ్యము కాకున్నను, ఆకాశమునంతటినీ ఆక్రమించుకొని యున్నట్టియును, తన యందు ప్రతిబింబించుచున్న చుక్కలయొక్క తెల్లని కాంతి వలన నురుగులచే గప్పిన దానివలె యున్నట్టియు, విశాలమైన గంగా ప్రవాహమును ఒకచిన్ని నీటి బొట్టువలె జడలో ధరించుటయు, అగస్త్యపానము వలన ఎండిపోయిన సముద్రమును నీ గంగాజలము చేతనే పూరింపబడుటయు చూడగా ఆ యాకారము దివ్యమైనదనియు, అద్భుతమైనదనియు ఊహింపవచ్చును:-

**రథః క్షోణీ యంతా శతధృతి రగేన్ద్రో ధను రథో**
**రథాంగే చంద్రార్కౌ రథ చరణ పాణిః శర ఇతి,**
**దిధక్షోస్తే కో2యం త్రిపురతృణ మాడంబర విధిః**
**విధేయైః క్రీడన్త్యో నఖలు పరతంత్రాః ప్రభుధియః!! (18)**

త్రిపుర తృణం=మూడు పురములనెడు గడ్డిపోచను; దిధక్షోః=దహింపదలచిన. తే=నీకు; క్షోణీ=భూమి; రథః=రథము; శతధృతిః=బ్రహ్మ; యంతా=సారథి; అగేంద్ర=మేరుపర్వతము; ధనుః=విల్లు; అథో=మరియు; చంద్రార్కౌ=సూర్యచంద్రులు; రథాంగే=చక్రములు; రథచరణపాణిః=సుదర్శన చక్రధారి; శరః=బాణము; ఇతి=ఇట్లు; అయం=ఈ, ఆడంబర విధిః=ఆడంబర వ్యాపారము; కః=ఎట్టిది?; ప్రభుధీయః= రాజచిత్తములు; విధేయైః=సేవకులతో; క్రీడంత్యః=ఆడుచున్నవియై; పరతంత్రాః= పరాధీనములైనవి; నఖలు=కావుగదా!

శంకరా! లోక కంటకులైన తారకాక్ష, కమలాక్ష, విద్యున్మాలి, అను ముగ్గురు తారకాసురుని పుత్రులు నిర్మించుకొనిన మూడు పట్టణములను, కాల్చుటకు నీవు చేసిన సర్వ స్వతంత్రమైన ప్రభుత్వమును కొనియాడవలసినదే. నీవు తలంచినచో వాటిని ఒక గడ్డి పోచవలె కాల్చివేసియుందువు. కానీ, భూమిని రథముగానూ, బ్రహ్మను సారథిగానూ, మేరువును విల్లుగానూ, సూర్యచంద్రులను చక్రములుగానూ, హరిని శరముగానూ ఏర్పరచుకొని యుద్ధయాత్రను సాగించితివి. ఇంతటి యాడంబర మేల కావలసి వచ్చినది? రాజుల చిత్తములు సర్వతంత్ర స్వతంత్రములైనవి. సేవకులను వినోదార్థముగ వాడుకొనుట సహజమే కదా!

**హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో**
**ర్యదేకోనే తస్మిన్నిజ ముదహర న్నేత్ర కమలమ్,**
**గతో భక్త్యుద్రేకః పరిణతి మసౌ చక్రవపుషా**
**త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతామ్॥** (19)

త్రిపురహర=త్రిపురారీ; హరిః=శ్రీహరి; పతే=నీ యొక్క; పదయోః=పాదములందు; సాహస్రం=ఒక వేయి; కమలబలిం=కమలములతో పూజను; ఆధాయ=ఒనర్చి; తస్మిన్= ఆపూజ; ఏకోనే=ఒకటి తక్కువ కలది కాగా; నిజం=తనదైన; నేత్రకలమలమ్=కన్ను అనేది పద్మమును; యత్=ఎందువలన; ఉదహరత్=సమర్పించెనో (ఆకారణము వలన)అసౌ=ఈ; భక్త్యుద్రేకః=భక్తి విశేషము; చక్రవపుషా=సుదర్శన చక్రాకారముతో; పరిణతిం=పరిణామమును, గతః=పొందినదై; త్రయాణాం=మూడు విధములైన; జగతాం=లోకములయొక్కరక్షాయై=సంరక్షణ కొరకు; జాగర్తి=జాగరూకమైయున్నది.

ఓ పురహరా! శ్రీ విష్ణువంతటి వాడు సహస్రకమలములతో నీపాదపూజగావింప నుద్యమింపగా, అందొక్కకమలము తక్కువయ్యెను. అప్పుడుతడు తన కమలమువంటి నేత్రమునే పెరికిపూజను పూర్తి చేసెను. ఈ భక్త అతిశయమునకు నీవుమెచ్చి ముల్లోకముల సంరక్షింపజాలు సుదర్శనచక్రమును విష్ణువునకు

ప్రసాదించితి గాదే ! జనార్ధనునకు త్రిలోకరక్షణ సామర్థ్యము నీ అనుగ్రహము వలననే లభించినది కదా !

**క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం**
**క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధన మృతే,**
**అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదాన ప్రతి భువం**
**శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా దృఢపరికరః కర్మసు జనః॥** (20)

క్రతుమతాం=యజ్ఞమొనర్చు వారికి; ఫలయోగే=ఫలరూపమైన, స్వర్గము సంబంధము నందు. క్రతౌ=యజ్ఞము; సుప్తే=నిద్రించు చుండగా; త్వం=నీవు; జాగ్రత్= జాగరూకుడవు; అసి=అయివున్నావు; కర్మ=యజ్ఞరూపమైన కర్మ; ప్రధ్వస్తం=నష్టమైనదై; పురుషారాధనమ్=పరమపురు షుని పూజను; ఋతే=విడిచి; క్వ=ఎచ్చోట; ఫలతి= ఫలించు చున్నది? అత:=అందుచే; క్రతుషు=యాగములందు; ఫలదాన ప్రతిభువం= ఫలము నొసంగుట యందు బాధ్యుడవైన; త్వాం=నిన్ను; సంప్రేక్ష్య=చూచి; శ్రుతౌ= వేదము నందు; శ్రద్ధాన్=విశ్వాసమును; బాద్ధ్వా=కట్టుకొని; జనః=యజమానుడు; కర్మసు=క్రియలందు, కృతపరికరః=ప్రయత్నింపబడిన సాధనము గలవాడు (అయివున్నాడు).

(కర్మమే చేతనమగుచో, చేయగానే కర్మ ఏల ఫలించుట లేదు? అను మీమాంసకుని కేవాలకర్మ జడవాదమునకు ప్రత్యుత్తరము ఇవ్వబడుచున్నది. యాగాది కర్మ ఫలమును శివుడే అనుగ్రహించును. కర్మఫలదాత పరమ పురుషుడైన శివుడే).

కర్మాధ్యక్షా! యజమాను డొనర్చిన యాగము జడమైయూరక యుండుటయే కాని తత్ఫలమునను గ్రహించు నీవు మాత్రమే ఎల్లప్పుడూ జాగరూకుడవై వెలుగుచున్నావు. పరమపురుషుడవగు నీ యొక్క యారాధన లేకయే, అగ్నియందు వేల్వబడిన యజ్ఞహవిస్సు (కర్మము) యెప్పటి కప్పుడు నష్టమొందుచుండ ఫలమెట్లు కల్గును? నీ నామస్మరణతో అట సమర్పింపబడుచున్నది కావు ననే నీవు ఫలము ననుగ్రహింతువు. కావున నిన్నే ఫలదాతవుగా తెలికొనిన జనము వేదములందు విశ్వాసముంచి యాగముల కొరకు ఇంత అట్టహాసముగా సామగ్రిని కూర్చుకొని వ్యయము చేయుచున్నది.

**క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశస్తను భృతా**
**మృషీణా మార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః**
**క్రతుభ్రేషస్త్వత్తః క్రతుఫల విధాన వ్యసనినో**
**ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయహి మఖాః ॥** (21)

శరణద=ఓ రక్షకా!; క్రియాదక్ష=కార్యనిర్వహణ సమర్థుడును, తను భృతాం=

ప్రాణులకు; అధీశః=పాలకుడును అగు, దక్షః=దక్ష ప్రజాపతి, క్రతుపతి=యజమానుడు; ఋషీణాం=ఋషుల యొక్క; ఆర్త్విత్యం=ఋత్విజత్వము, సురగణాః=దేవతల సమూహములు, సదస్యాః=సభ్యులు; క్రతుఫల విధాన వ్యసనినః=యజ్ఞఫలము నిచ్చుటలో నాసక్తుడవైన, త్వత్తః=నీ వలన; క్రతుభ్రేషః=యజ్ఞము యొక్కనాశము (కల్గెను); హి=ఏలననగా, శ్రద్ధా విధురం=విశ్వాసములేనట్లుగా (చేయబడిన); కర్తుః= యజమానుని యొక్క; మఖాః=యజ్ఞములు; అభిచారాయఅనర్థము కొరకు (కదా)!

ఓ రక్షకా! యాగాది క్రియలందు సకలసామర్థ్యము గలవాడును, బ్రహ్మకు ప్రతి బ్రహ్మయైనవాడును, లోకపాలకుడును యగు దక్షుడు స్వయముగా యజమానత్వము వహించి, భృగ్వాదిమహర్షులు ఋత్విజము చేయగా, దేవతలు సభలో నిండియుండ యజ్ఞమును నిర్వహింప మొదలిడెను గానీ యజ్ఞఫలదాతవగు నీవలననే యజ్ఞ ధ్వంసము కలిగినది. ఎంతటి సామర్థ్యముగలవాడైనను నీయందు భక్తి శ్రద్ధలులేనిచో ఆక్రతువువలన ఫలము పొందక పోవుటయేగాక అనేకములైన అనర్థములకు గురియై నశించును కదా!

**సతాం వర్త్మ త్యక్త్వా శ్రుతిసమధిగమ్యం సహభువం**
**ఘృణామప్యున్మాల్య స్వజన విషయ స్నేహగుణితాం।**
**ద్విజః కృంతన్ పాదే పితరమపరాద్ధం త్వయి విభో**
**మనుష్యత్వం సద్యస్త్రిదశ పరిణామేన విజహౌ॥** **(22)**
(ఈశ్లోకము కొన్ని ప్రతులలో లేదు)

విభో=ఓ సర్వవ్యాపీ! ; ద్విజః=బ్రాహ్మణుడు (కాటకోటడు); శ్రుతి సమధిగమ్యం= వేదవేద్యమైన; సహభువం=తోబుట్టువైన; సతాం=సత్పురుషుల; వర్త్మ=మార్గమును; త్యక్త్వా=విడిచిపెట్టి, స్వజనవిషయ స్నేహగుణితాం=తనవాడికి (తండ్రికి) సంబంధించిన ప్రేమ చేత ఎక్కువగా చేయబడిన; ఘృణామపి=దయను కూడ, వున్మాల్య=పెరికివైచి, త్వయి=నీ యందు; అపరాద్ధం=తప్పు చేసిన; పితరం=తండ్రిని; పాదే=పాదము నందు; కృంతన్=ఛేదించినవాడై; సద్యః=వెంటనే; త్రిదశపరిణామేన=దేవత్వము నొందుటతో; మనుష్యత్వం=మానవత్వమును; విజహౌ=విడిచెను.

విభో! ఆ బ్రాహ్మణుడు పెద్దల మార్గమును, వేదబోధితములైన యాచారముల నెరిగి సహజమైన దయగలిగిన వాడైనను, వీటన్నిటి నీ త్రోసిపుచ్చి, నీ విషయమున అపచారమొనర్చినట్టి తన తండ్రి యొక్క పాదమనికూడ లెక్కచేయకనరకి వైచెను. అతని శివభక్తికి నీవు మెచ్చి అతనికి మానవజన్మము నుండి విముక్తి నొసగి ప్రమథపదవి ననుగ్రహించితివి..

**ప్రజానాథం నాథ ప్రసభమభికం స్వాం దుహితరం**
**గతం రోహిద్భూతాం రిరమయిషు మృశ్యస్యవపుషా,**
**ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృత మముం**
**త్రసన్తం తే2ద్యాపి త్యజతి న మృగవ్యాధ రభసః ॥ (23)**

నాథ=నాథా; రోహిద్భూతాం=లేడి రూపము నొందిన; స్వాం=తనయొక్క; దుహితరం=కుమార్తెను; ఋశ్యస్య=జింక యొక్క; వపుషా=దేహముతో; గతం= వెన్నంటినవాడును; ప్రసభం=బలాత్కారముగా; రిరమయిషుం=రమింపనిచ్ఛ గలవాడును; అభికం=కాము కుడును; సపత్రాకృతం=బాణముతోకొట్ట బడినవాడును; త్రసంతం=భయగ్రస్తుడును, దివం=స్వర్గమును గూర్చి, యాతమపి=వెళ్లిన వాడైనను; అముం=ఈ; ప్రజానాథం=బ్రహ్మను; ధనుష్పాణేః=చేతధనుస్సుగల; తే=నీ యొక్క; మృగవ్యాధ రభసః=వేటగాని వంటి సంభ్రమము; అద్యాపి=ఇప్పటికినీ; నత్యజతి= విడుచుట లేదు.

ఈశ్వరా! తానే పుట్టించిన తనకూతురైన ఒక సుందరిని బ్రహ్మ కామోద్రిక్తుడై వెంటబడెను. ఆమె ఆడజింకరూపము పొందగా, బ్రహ్మమగలేడి రూపమును బొంది,దానిని బలాత్కరింప దలచెను. అంత నీవు పినాకపాణివై బ్రహ్మను స్వర్గమునకు పారిపోవుచున్నను వదలక కిరాత రూపముతో బాణమును ప్రయోగించి శిక్షించితివి, ఇప్పటికీ ఆపినా కపాణిత్వము చూడగా, ఆ వేటకాని తనమింకను వదలినట్లు లేదు. పితామహుడైనను నీ శాసనమునకు లోబడియున్నాడు కదా! (ఈ కథకు మూలము ఐతరేయ బ్రాహ్మణము, శతపదబ్రాహ్మణము, స్కంద,మత్స్య, శివపురాణములందు కలదు. ఆమె పేర్లు-ద్యౌ,ఉషా,గాయత్రీ, సతీ, సావిత్రీ అని వేర్వేరుగా కలవు.)

**స్వలావణ్యాశంసా ధృత ధనుష మహ్నాయ తృణవత్**
**పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి**
**యది స్త్రైణం దేవీ యమనిరత దేహార్ధ ఘటనా**
**దవైతి త్వామద్ధాబత వరదముగ్ధా యువతయః॥ (24)**

పురమథన=ఓపురారీ! ; దేవీ=పార్వతీ దేవి; స్వలావణ్యాశంసా=తన సౌందర్యము యొక్క ప్రశంసగలదై, ధృత ధనుషం=విల్లును ధరించిన; పుష్పాయుధం=మన్మధుని; పురః=ఎదుట; తృణవత్=గడ్డి పోచవలె, అహ్నాయ=వెంటనే; ప్లుష్టం=కాల్చబడిన వానినిగా; దృష్ట్వాపి=చూచి కూడా; యమనిరతదేహా=తపోవశము చేయబడిన దేహము కలదై; అర్ధఘటనాత్; శరీరార్థభాగమును సంఘటించినందువలన; త్వాం=నిన్ను; స్త్రైణం=కాంతాలోలునిగా; అవైతియది=భావించుచో; అద్ధా=సరియే; వరద=వరదా!;

యువతయః=తరుణులు; ముగ్ధాః=మూఢులుగా; బత=ప్రసిద్ధము.

వరదా! త్రిలోకసుందరియైన పార్వతి లోకేశ్వరుడైన నిన్ను భర్తగా పొందగోరి, కాముని ద్వారా పుష్పబాణమును నాటించి, నిన్నుకామోద్రేకునిగా చేయ ప్రయత్నించెను. కానీ నీవు క్షణమాత్రమున మారుని కాల్చివైచితివి. అప్పుడామె నిన్ను గూర్చి తపమాచరించగా భక్తవశంకరుడవైన నీవు ఆమెను అర్ధాంగిగా చేసికొంటివి. ఈ రహస్యమును తెలియని ఆమెనిన్ను స్త్రీలోలునిగా భావించుచున్నది. ఇదియువతుల ముగ్ధత్వమేకాని నీవు మోహాతీతుడవు ఆయన భక్తవరంకరుడే కానీ కామవశుడు కాదు:- కామదహనము చేసినవాడు శివుడు-

**శ్మశానే ష్వాక్రీడా స్మరహర పిశాచాస్సహచరా**
**శ్చితాభస్మా లేపః స్రగపి నృకరోటీ పరికరః**
**అమంగల్యం శీలం తవ భవతు నామైవ మఖిలం**
**తథాపి స్మర్తౄణాం వరద పరమం మంగలమసి॥ (25)**

స్మరహర=మారహరా! తవ=నీకు; శ్మశానేషు=శ్మశానములలో; ఆక్రీడా=విహారము; పిశాచాః=దయ్యములే; సహచరాః=చెలికాండ్రు; చితాభస్మ=కాటిబూడిద; ఆలేపః= గంధము, నృకరోటీపరికరో2పి=నరులపుఱ్ఱెలగుంపు కూడా; స్రక్=పూలదండ; ఏవం= ఇట్లు; అఖిలం=సమస్తమైన; శీలం=నడవడి; అమంగల్యం=అశుభమైనదిగా: భవతునామ=అగుగాక; వరద=భక్త వరదా! తథాపి=అటులైనను; స్మర్తౄణాం= భజించువారికి; పరమం=శ్రేష్ఠమైన; మంగళం=కళ్యాణ రూపము; అసి=అయి యున్నావు.-

శంకరా! నీకు క్రీడాస్థలము శ్మశానము. స్నేహితులు పిశాచములు కాటి బూడిద యే నీశరీరమునకు పూత గంధము., కపాలమాలయే హారము., నీనడవడి అంతా అశుభమే కానీ, నిన్నుస్మరించు భక్తులందరికీ నీవుపరమకళ్యాణ స్వరూపుడవు:- మంగళ కరుడవు.

**మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్త మరుతః**
**ప్రహృష్యద్రోమాణః ప్రమద సలిలోత్సంగి తదృశః**
**యదాలోక్యాహ్లాదం హ్రదఇవనిమజ్జ్యామృతమయే**
**దధత్యంతస్తత్త్వం కిమపి యమినస్తత్కిల భవాన్ ॥ (26)**

అత్తమరుతః=నిరోధింపబడిన ప్రాణములుగల; యమినః=యోగీశ్వరులు; ప్రత్యక్చితే=వాసనారహితమగు ఆత్మ యందు; సవిధం=విధ్యుక్తముగా; మనః= మనస్సును; అవధాయ=చేర్చి; అమృతమయే=అమృత స్వరూపమైన; హ్రదే=మడుగు నందు; నిమజ్య=మునిగిన; ఇవ=వలె; ప్రహృష్యద్రోమాణః=పులకితములైన

రోమములుగల వారును; ప్రమదసలిలోత్సంగిత దృశః=ఆనంద భాష్పములతో నిండిన దృష్టి కలవారును; ఐ, కిమపి=ఎద్దియోయైన, యత్=ఏ; తత్త్వం=పరవస్తువును; ఆలోక్య=చూచి; అంతః=లోపల; ఆహ్లాదం=ఆనందమును; దధతి=ధరించుచున్నారో తత్=ఆ చిదానంద వస్తువు; భవా2న్కిల=నీవే కదా!

శివా! ప్రాణాదులను నిరోధించిన యోగేశ్వరులు పరమాత్మయందు మనస్సును నిలిపి, గగుర్పాటుతో ఆనందాశ్రువులురాల్చుచు; అవాఙ్మానస వస్తువును దర్శించి; అమృత సరస్సులో ఓలలాడిన వారివలె మహాసుఖము ననుభవింతురో; ఆసచ్చిదానందమూర్తివి నీవేకదా!-

**త్వమ ర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహ-**
**స్త్వమాపస్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితి చ**
**పరిచ్ఛిన్నామేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం**
**నవిద్మస్తత్తత్వం వయమిహతు యత్త్వం న భవసి॥ (27)**

త్వయి=నీయందు; పరిణతాః=వినమ్రులైనవారు; "పండితులు" ; త్వం=నీవు; అర్కః=సూర్యుడవు; త్వం=నీవు; సోమః=చంద్రుడవు; త్వం=నీవు; పవనః=వాయువు; అసి=అయివున్నావు; త్వం = నీవు; వ్యోమ= ఆకాశము; త్వం=నీవు; ధరణిః=భూమి; చ=మరియు; త్వం=నీవు; ఆత్మా=యజమానుడవు; ఇతి=ఇట్లు; పరిచ్ఛిన్నాం= పరిమితిగల; గిరం=వాక్కును, బిభ్రతు=ధరింతురు గాక; తు=అయితే; వయం=మేము; ఇహ=ఈ లోకమున; త్వం=నీవు; యత్=ఏవస్తుస్వరూపుడవు?; నభవసి=కావో; తత్=ఆ; తత్త్వం=వస్తువును. నవిద్మహ=తెలియము.

శంకరా! నీ భక్తులైనవారును, నీ విషయము తెలిసిన పండితులైనవారును, కొందరునిన్ను సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, జలము, ఆకాశము, భూమి, ఆత్మ (యజ్ఞపతి) యని ఒక పరిమితికిలోబరచి చెప్పుదురు. ఈ విశ్వమున నీవు కానటువంటి పదార్థము ఏదికలదో మేము మాత్రము ఎరుగము. సర్వమూ. నీవే. శివుడు అష్టమూర్తి అని ఆగమసిద్ధాంతము.

**త్రయాం, తిస్రోవృత్తీ, స్త్రిభువన మథో, త్రీనపి సురా**
**నకారాద్యై ర్వర్ణై స్త్రిభి రభిదధ త్తీర్ణ వికృతి**
**తురీయం తే ధామ ధ్వనిభి రవరున్ధాన మణుభిః**
**సమస్త వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితిపదమ్॥ (28)**

శరణద=ఓరక్షకా! ఓమితి=ఓంకారమనెడు; పదం=పదము త్వాం నిన్ను; సమస్తం= సంపూర్ణనీగాను, వ్యస్తం=వ్యష్టిరూపుడుగాను, అభిదధత్=చెప్పుచున్నదై, త్రయాం=

వేదత్రయమును; తిస్రః=మూడైన; వృత్తీః=గుణ వ్యాపారములను; త్రిభువనం=ముల్లోకములను; అథో=మరియు; త్రీన్=ముగ్గురైన; సురానపి=దేవతామూర్తులను; అకారాద్యైః=అకార, ఉకార, మకార రూపములైన; త్రిభిః=మూడైన; వర్ణైః=అక్షరముల చేతను; అణుభిః=సూక్ష్మములైన,ధ్వనిభిః=నాదముల చేతను, తీర్ణ వికృతి=దాటబడిన వికారము గలగి నట్టియు, తురీయం=కడపటిదైనట్టియు, అవరుంధానం= సర్వాతిశయ మైనట్టియు; తే=నీ యొక్క; ధామ=తేజస్సును; గృణాతి=పొగడుచున్నది.

ఓ సర్వ రక్షకా! వేదములకెల్ల మూల భూతమైన ఓంకార ప్రణవము నీ చరాచరాత్మకమైన స్వరూపము నిట్లు పొగడుచున్నది. ఈ ఓంకారము నందు అ,ఉ,మ్ అనెడు మూడక్షరములు కలవు. ఇవి ఋగ్యజుస్సామములనెడు మూడు వేదములను, సత్త్వరజస్తమస్సులనెడి మూడు గుణములను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తులను సూచించునదై నాద బిందు కళలనెడి మూడు ధ్వనులతో, అపక్షయ, వినాశ, పరిణామములనెడు వికారములు లేనట్టియు, వ్యస్త, అవ్యస్త, వ్యస్తావ్యస్తములనెడు రూపములకంటె అతీతమైనట్టియు, సర్వానర్థకరమగు మాయావరోధకమైనట్టియు నీదివ్య తేజమును స్తుతించుచున్నవి. ఓంకారము యొక్క తత్త్వమును విచారింప నదెల్లయు నీ గుణ ప్రతిపాదనను చేయుచున్నది. కావున నీవే ప్రణవ స్వరూపుడవు. నిత్య చిదానంద ప్రకాశ స్వరూపుడవు.

**భవః శర్వోరుద్రః పశుపతిరథోగ్రః సహమహాం-**
**స్తథా భీమేశానావితి యదభిధానాష్టక మిదం।**
**అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతిరపి**
**ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యోఽస్మి భవతే ॥** (29)

దేవ=దేవా; భవః=భవుడవు; శర్వః=శర్వుడవు; రుద్రః=రుద్రుడవు; పశుపతిః=పశుపతివి; అథ=మరియు; ఉగ్రః=ఉగ్రుడవు; సహమహాన్=మహాదేవుడవు; తథా=అటులే; భీమేశానౌ=భీముడవు, ఈశానుడవు; ఇతి=ఇట్లు; యత్=ఏ; ఇదం=ఈ; అభిధానాష్టకం=నామాష్టకము; అముష్మిన్=దీని యందు; ప్రత్యేకం=ప్రతియొక్క నామము తోకూడ; శ్రుతిరపి=వేదమైనను; ప్రవిచరతి=ప్రవర్తించుచున్నది; అస్మై=ఈ; ఈ=భవాది శబ్దరూపమగు; ధామ్నే=తేజోరూపమగు; ప్రియాయా=ప్రియమైన; భవతే=నీకొరకు; ప్రణిహిత నమస్యః=చేయబడిన నమస్కారములు గలవాడను; అస్మి=అగుచున్నాను.

దేవా! భవ, శర్వ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహాదేవ, భీమ, ఈశానులనెడు ఈ ఎనిమిది నామములు నీముఖ్యావాచకములుగా శ్రుతియే చెప్పుచున్నది. కావున

అశబ్దవాచ్యుడవును, తేజోరూపుడవును, భక్తవత్సలుడువును అగు నీకు ఎల్లప్పుడూ విధేయుడనై నమస్కరించుచున్నాను.

1. భవుడు=పృధ్వీమూర్తి, 2. శర్వుడు=జలమూర్తి; 3. రుద్రుడు=వాయుమూర్తి; 4. పశుపతి=యజ్ఞమూర్తి 5. ఉగ్రుడు=తేజోమూర్తి; 6. మహాదేవుడు=సోమమూర్తి 7. భీముడు=ఆకాశమూర్తి; 8. ఈశానుడు=సూర్యమూర్తి. వీరు అష్టమూర్తులుగా ఈశ్లోకమున వర్ణించ బడినది.

**నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో**
**నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయచ నమః**
**నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో**
**నమ స్సర్వస్మై తేతదిద మతి సర్వాయ చ నమః॥** **(30)**

ప్రియదవ=వనవాసప్రియుడా!; నేదిష్ఠాయ=మిక్కిలి దగ్గరగానున్న; చ=మరియు; నవిష్ఠాయ=మిక్కిలి దూరముగా నున్న, తే=నీకు; నమః=నమస్కారము; స్మరహర= మదనాంతకా; క్షోదిష్ఠాయ=అణువుగా నున్న; చ=మరియు; మహిష్ఠాయ=గొప్పగానున్న (నీకు); నమః=నమస్కారము; త్రినయన=ఓ ముక్కంటీ!; వర్షిష్ఠాయ=మిగుల కృద్ధుడవైన; చ=మరియు; యమిష్ఠాయ=మిక్కిలి యువకుడవైన (నీకు), నమః= నమస్కారము; చ=మరియు; అతిసర్వాయ=సర్వమును అతిక్రమించిన (నీకు); నమః= నమస్కారము;

ఓ ఏకాంతవాసీ! మహాదేవా! భక్తులకు మిక్కిలి దగ్గరగను, అజ్ఞానులకు దూరముగా నున్న వాడవును అగు నీకు నమస్కారము. ఓ మదనారీ! అణు స్వరూపుడవును, మహత్స్వరూపుడవును అగు నీకు నమస్కారము. ఓ త్ర్యంబకా! మిక్కిలి పురాణ పురుషుడవును, మిక్కిలి యువకుడవును అగు నీకు నమస్కారము. సర్వ స్వరూపుడవును, సర్వమును అతిక్రమించిన వాడవును, అగు నీకు నమస్కారము- నమస్కారము.

ఇందు శివుని యొక్క అణిమ, మహిమ, గరిమ, లహిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ యనెడు అష్టసిద్ధులు గంభీరముగాచెప్పబడినవి. ఇది అమూల్యమైన శ్లోకము.

**బహుల రజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః**
**ప్రబల తమసే తత్సంహారే హరాయ నమోనమః**
**జనసుఖ కృతే సత్త్వోత్పత్తౌ మృడాయ నమోనమః**
**ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః** **(31)**

విశ్వోత్పత్తౌ=జగత్తు యొక్కపుటుకలో; బహుళరజసే=ఎక్కువైన రజోగుణం గలిగి

నట్టి; భవాయ=కారణ భూతుడైన భవునకు; నమోనమః=అనేక నమస్కారములు; జనసుఖకృతే=సృష్టిలోని సమస్త ప్రాణుల సుఖముకొరకు, సత్త్వోత్పత్తౌ సత్త్వముయొక్క పుట్టుకలో; మృడాయ=సుఖకరుడైన మృడునకు; నమోనమః=నమస్సులు; తత్సంహారే= అజగత్తుయొక్క సంహారమందు; ప్రబల తమసే= అధికమైన తమోగుణము కల్గినట్టి, హరాయ= లయకరుడగు హరునకు నమోనమః= నమస్కారములు; నిస్త్రైగుణ్యే= త్రిగుణాతీతమైన; ప్రమహసిపదే= మిగుల శ్రేష్ఠమైన స్థానమునందు; శివాయ= కల్యాణ స్వరూపుడగు శివునకు; నమోనమః= నమస్కారములు.

విశ్వమును సృష్టించుటలో రజోగుణసంపన్నుడై భవుడుగాను, దాని రక్షణమందు సత్త్వ గుణముతో మృడుడుగాను, దాని సంహారమందు తమోగుణముతో హరుడుగాను, త్రిగుణా తీతమైన పరంధామ పదమునందు శివుడు గాను వున్నట్టి నీకు నమస్కారములు- నమస్కారములు. **ఈస్తుతి రుద్ర నమకమువలె యున్నది.**

**కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వచేదం**
**క్వ చ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః**
**ఇతి చకిత మమం దీకృత్యమాం భక్తి రాధాత్**
**వరద చరణయోస్తే వాక్యపుష్పోప హారమ్ ॥ (32)**

వరద=వరదా!; కృశపరిణతి=అల్పమైన పరిపాకముగల; క్లేశవశ్యం=దుఃఖమునక ధీనమైన; ఇదం=ఈ; (నా యొక్క); చేతః=మనస్సు; క్వచ=ఏడనో; గుణ సీమోల్లంఘినీ= గుణముల మర్యాదను మీరినట్టి; తవ=నీ యొక్క; శశ్వదృద్ధిః=లోకోత్తరమైన మహైశ్వర్యము; క్వచ=ఏడనో?; ఇతి=ఇట్లు; చకితం=చలించిన; మాం=నన్ను; భక్తిః= నీపదభక్తి; అమందీకృత్య=అభయమునిచ్చి; తే=నీ యొక్క; చరణయోః=పాదములందు; వాక్యపుష్పోపహారమ్=వాక్యములనెడు పుష్పమాలను; ఆధాత్=చేయించెను.

శంకరా! ముక్తిదాతా! నా బుద్ధి యేమో చాలా కొద్ది ప్రజ్ఞ కలది. సంసార తాపత్రయముచే దుఃఖ భరితమై యున్నది ఇట్టి నా అల్పబుద్ధి ఎక్కడ?. త్రిగుణాతీతమైన, అద్భుతమైన, నీ మహిమయెక్కడ? ఇట్లు తలపోసి కంపించు చుంటిని. కానీ నీపాదములందు నాకుగల భక్తి నాభయమును పోగొట్టి ఉత్సాహము కలిగించి నీ చరణయుగళమునందు నాఈస్తోత్ర రూపమైన పుష్పముల రప్పింపచేసి ధన్యుని గావించినది.

ఇతను పుష్పదంతుడు. ఇతని నోటి నుండి వచ్చునవన్నియు పుష్పములే.

**అసితగిరి సమం స్యా త్కజ్జలం సింధుపాత్రే**
**సురతరువరశాఖా లేఖి నీ పత్ర ముర్వీ**

**లి ఖతియది గృహీత్వా శారదా సార్వకాలం**
**తదపి తవ గుణానా మీశ పారం న యాతి ॥ (33)**

ఈశ=ఈశ్వరా!; అసితగిరిసమం=అంజనాద్రివంటి; కజ్జలం=కాటుకగా (సిరా); సింధుపాత్రే=సముద్రమనెడు పాత్రలో (సిరాబుడ్డి); సురతరువరశాఖా=కల్పవృక్షము యొక్క పెద్ద కొమ్మ; లేఖినీ=కలముగా; ఉర్వీ=భూమి; పత్రం=కాగితముగా స్యాత్= అగుచో; గృహీత్వా=గ్రహించి; శారదా=సరస్వతి; సార్వకాలః=ఎల్లప్పుడూ; లఖతియది= వ్రాయుచో; తదపి=అటులైనను; తవ=నీ యొక్క; గుణానాం=గుణముల యొక్క; పారం=తుదను; నయాతి=పొందదు.

ఈశ్వరా! సముద్రమునే సిరాబుడ్డిగా చేసి, అంజనగిరి యంతటి కాటుక నందుపోసి, ఎన్నటికి నీ అరుగని కల్పవృక్షము యొక్క పెద్ద కొమ్మను కలముగావించి, భూమి యంత కాగితముగా తేసుకోని, వాక్కుల రాణి వాణి నీ గుణగణములను యావజ్జీవితము వ్రాయబూనిననూ, వ్రాయజాలదు. నీవు అపారమహిముడవు. నిను పొగడుటకు ఎవరికీ సాధ్యము కాదు.

**అసురసుర మునీంద్రై రర్చిత స్యేన్దుమౌళే**
**గ్రథిత గుణమహిమ్నో నిర్గుణ స్యేశ్వరస్య**
**సకలగుణవరిష్ఠః పుష్పదంతాభిధానో**
**రుచిత ములఘు వృత్తైః స్తోత్ర మేతచ్చకార॥ (34)**

సకలగుణవరిష్ఠః=సమస్త సద్గుణాధికుడైన; పుష్పదంతాభిధానః=పుష్పదంతుడను పేరుగల. అసుర సురమునీంద్రైః=అసుర, సుర, మునీంద్రులచేత;అర్చితస్య= పూజింపబడినవాడును; ఇందుమౌళేః=చంద్రశేఖరుడును; గ్రధితగుణమహిమ్నః= పరికల్పింపబడిన గుణములనెడి మహిమ గలవాడును; నిర్గుణస్య= గుణాతీతుడైన;ఈశ్వరస్య=ఈశ్వరుని యొక్క; రుచిరం=రమ్యమైన; ఏతత్=ఈ; స్తోత్రం=స్తోత్రమును, అలఘువృత్తైః=చక్కని వృత్తములచే; చకార=చేసెను.

సద్గుణ భూషితుడును, పుష్పదంతనామము గలవాడును అగు వీరమాహేశ్వరుడు. దేవతలు, రాక్షసులు, మునులు కొలిచిన వాడును, ఎప్పటి కప్పుడు మహామహిమల సృజించువాడును, త్రిగుణాతీతుడును, చంద్రశేఖరుడు నగు ఆ పరమేశ్వరుని యొక్క ఈ రమ్యమైనస్తవమును చక్కని వృత్తములతో రచించెను.

ఫలశ్రుతి :-

**అహరహ రనవద్యం ధూర్జటేః స్తోత్ర మేతత్**
**పఠతి పరమ భక్త్యా శుద్ధ చిత్తః పుమాన్ యః**
**స భవతి శివలోకే రుద్రతుల్య స్తథా2త్ర**
**ప్రచురతన ధనాయుః పుత్రవాన్ కీర్తి మాంశ్చ॥** **(35)**

అహరహః=ప్రతి నిత్యమును; ధూర్జటేః=శివుని యొక్క; ఏతత్=ఈ; అనవద్యం=నిర్మలమైన; స్తోత్రః=స్తవమును; పరమభక్త్యా=మిక్కిలి భక్తితో; శుద్ధచిత్తః=నిర్మల మనస్సుతో; యః=ఏ; పుమాన్=దేహి; పఠతి=పఠించు చున్నాడో; సః=వాడు; శివలోకే=కైలాసములో; రుద్రతుల్యః=శివసమానుడును; అత్ర=ఈలోకము నందు; ప్రచురతర ధనాయుః=మిక్కిలి దీర్ఘాయుర్భాగ్యములు కలవాడును; పుత్రవాన్=సంతాన సంపన్నుడును; చ=మరియు; కీర్తిమాన్=కీర్తివంతుడును; భవతి=అగుచున్నాడు;

నిర్మలమైన ఈ శివస్తోత్రమును ఎవడు నిర్మల మనస్సుతో, ప్రతి నిత్యము మిక్కిలి భక్తితో పారాయణము చేయునో, వాడు ఈ లోకమున ఆయురారోగ్య భాగ్యములును, సంతానమును పొంది తరువాత కైలాస ప్రాప్తి కలిగి శివసాయుజ్యమును పొందగలడు.

ఈ దిగువ వ్రాయబడిన శ్లోకములు పుష్పదంత ప్రణీతములు కావని కొందరి యభిప్రాయము. ఐనను చాలాకాలముగా ఇవి పారాయణములో ఉన్నందున వ్రాయు చున్నాను.

**దీక్షాదానం తపస్తీర్థం స్నానం యాగాదికాః క్రియాః**
**మహిమ్నస్తవ పాఠస్య కలాం నార్హన్తి షోడశీమ్!!** **(36)**
**అసమాప్త మిదం స్తోత్రం సర్వమీశ్వర వర్ణనమ్,**
**అనౌపమ్యం మనోహరి పుణ్యం గంధర్వభాషితమ్!!** **(37)**

**వ్రతదీక్షలు, దానములు, తీర్థయాత్రలు, తపస్సులు, యాగములు, జ్ఞానము-వీటినన్నిటినీ కలిపినను, ఈ మహిమ్నస్తవ పఠనమువలన కలుగు ఫలములో పదారవవంతుకూడా సరిరావు. పుష్పదంత గంధర్వ నిర్మిత మైనదియు, పుణ్యమైనదనియు, అసమానమైనదియు, మనోహరమైనదియునగు ఈ స్తోత్రము సమాప్తము కాకపోయినను** ఈశ్వర వర్ణన కలిగియున్నది. కావున సర్వదా మంగళ కరముగా వెలుగును.

(అసమాప్తం=సమాప్తము కానిది అనియే సర్వత్ర కలదు. కానీ 'ఆ సమాప్తం' అనుపాఠమున్నుకలదు. అనగా స్తోత్రము యొక్క సమాప్తి అని చెప్పవచ్చును.)

వపుః ప్రాదుర్భావాదను మితమిదం జన్మని పురా
పురారే న క్వాపి క్షణమపి భవంతం ప్రణతవాన్
నమన్ ముక్తః సంప్రత్యహమత నురగ్రే2వ్య నతిమా
నితీశ క్షంతవ్యం తదిద మవరాధ ద్వయమపి!! (38)

ఓ పురారీ! నేను పూర్వజన్మములో నిన్ను పూజించలేదని ఈ దేహము వలన తెలుసుకొను చున్నాను. అపుడు నిన్ను పూజించి వుంటే ముక్తుడైపోయి ఈ దేహము వచ్చివుండేది కాదు. ఇపుడు నిన్ను స్తుతించుచున్నాను. కావున నేను తప్పక ముక్తి పొందెదను. నాకు ముందు జన్మము లేదు. కావున భవిష్యత్తులో నిన్ను స్తుతింపలేను. పూర్వజన్మలోనూ, రాబోవు జన్మలోనూ, నిన్ను స్మరింపలేదను ఈ రెండు అపరాధములను క్షమింపగోరుచున్నాను.

కుసుమ దశన నామా సర్వ గంర్వధరాజః
శిశు శశి ధరమౌళీ ర్దేవదేవస్య దాసః
సఖలు నిజమహిమ్నో భ్రష్ట ఏ వాస్యరోషాత్
స్తవన మిద మకార్షీ ర్దివ్య దివ్యం మహిమ్నః!! (39)

బాలచంద్రశేఖరుని, దేవదేవుని, శివుని, కేవల దాసుడైన పుష్పదంతుడను గంధర్వరాజు శివనిర్మాల్యమును దాటి, శివాపరాధము చేసినందున తనమహిమను పోగొట్టుకొనిన వాడై ఈ దివ్యమైన మహిమ్న స్తుతిని రచించి మరల శివప్రీతిని పొందెను.

సురవరముని పూజ్యం స్వర్గమోక్షైక హేతుం
పఠతి యది మనుష్యః ప్రాంజలి ర్నాన్యచేతాః
వ్రజతి శివసమీపే కిన్నరైః స్తూయమానః
స్తవన మిదమ మోఘం పుష్పదంత ప్రణీతమ్!! (40)

దేవతలకు, మునులకు, పూజ్యమైనట్టియు, స్వర్గమునకు, ముక్తికి కారణమైనట్టియు, అమోఘమైనట్టియు. ఈపుష్పదంత విరచిత స్తోత్రమును ఎవడు నిర్మల చిత్తము కలిగి భక్తితో ప్రాంజలియై పఠించునో వాని కీర్తిని కిన్నెరులు గానముచేతురు; వాడు శివ సాయుజ్యమును పొందును.

శ్రీ పుష్పదంత ముఖపంకజ నిర్గతేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ

**కంఠస్థితేన పఠితేన సమాహితేన**
**సుప్రీణితో భవతి భూతపతి ర్మహేశః!! (41)**

శ్రీ పుష్పదంతుని ముఖకమలము నుండి వెడలినట్టియు, పాపహరమైట్టియు, శివునికానందకరమైనట్టియు ఈ మహిమ్నస్తుతిని కంఠస్థముగావించి సమాధానముగా ఎవరైనను పఠించుచో, భూతపతియగు మహేశ్వరుడు ప్రసన్నుడై వరముల ననుగ్రహించును.

**మహేశా న్నాపరోదేవో మహిమ్నో నాపరాస్తుతిః**
**అఘోరా న్నాపరో మంత్రో నాస్తి తత్త్వం గురోః పరమ్!! (42)**

మహేశ్వరుని కంటే వేరుదైవము లేదు. మహిమ్నము కంటే వేరుస్తుతిలేదు అఘోరము కంటే వేరు మంత్రము లేదు. గురువుకంటే వేరు పరతత్త్వము లేదు.

అఘోర మంత్రం:- అఘోరేభ్యో అథగోరేభ్యో, ఘోరఘోర తరేభ్యో సర్వేభ్యోశర్వశర్వేభ్యో, నమస్తే అస్తురుద్ర రూపేభ్యః

**యత్కృత్యం తన్నకృతం, యదకృత్యం కృత్యవత్తథా చరితం!**
**ఉభయోఃప్రాయశ్చిత్తం, శివ తవ నామాక్షర ద్వయో చ్చరితం!! (43)**

ఓ మహేశా! చేయదగిన వాటిని వదలితిని. చేయకూడని వాటిని ప్రీతిగా చేసితిని. 'శివ' యను రెండక్షరముల నీనామస్మరణమే ఆరెండు అపరాధములకు ప్రాయశ్చిత్తము. అనగా ఆయపరాధములు నశించుటకు నీనామస్మరణమే సాధనము.

**సంసార సర్పదష్టానాం, జంతూనా మవివేకినాం!**
**చంద్రశేఖర పాదాబ్జ స్మరణం వరమౌషధం!! (44)**

సంసారమనెడి సర్పములతో కరవబడిన వారును, అవివేకులును అగుప్రాణులకు శ్రీ శివుని పాదపంకజ స్మరణమే గొప్పమందు. భవ సర్పవిషమునకు శివస్మరణ పరమౌషధమని తెలుసుకోవలసినది.

**ఏకకాలం ద్వికాలం వా, త్రికాలం యః పఠేన్నరః**
**సర్వపాప వినిర్ముక్తః శివలోకే మహీయతే!! (45)**

ఈస్తుతిని ప్రతినిత్యము మూడుమార్లు గాని, రెండుమార్లుగానీ లేక ఒక్కమారుగానీ వారివారి శక్తివంచన లేకుండా పఠించిన యెడల, సర్వపాపములనుండి విముక్తినొంది శివసన్నిధి చేరెదరు.

**తవ తత్త్వం నజానామి, కీదృశో2సి మహేశ్వర**
**యాదృశో2సి మహాదేవ, తాదృశాయ నమోనమః!!** **(46)**

ఓ మహా దేవా! ఓ మహేశ్వరా! నీవెట్టివాడివో, నీతత్త్వ మేమిటో నాకు తెలియదు. నీవు ఎట్టివాడవై యున్నావో, అట్టి నీకు నమస్కారములు.

**ఇత్యేషా వాఙ్మయీ పూజా, శ్రీమచ్ఛంకర పాదయోః**
**అర్పితా తేన దేవేశః ప్రీయతాం మే సదాశివః!!** **(47)**

ఈ విధముగ వాగ్రూపమైన పూజ శ్రీ శంకరుని పాదములందు సమర్పింప బడినది. దీనితో దేవదేవుడైన యా సదాశివుడు ప్రసన్నుడగు గాక!

## శ్రీ శివ మహిమ్నః స్తోత్రము సంపూర్ణం

# ప్రశ్నోత్తరి

**అపార సంసార సముద్ర మధ్యే సమ్మజ్జతోమే శరణం కిమస్తి!**
**గురోకృపాళో కృపయావదైత విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా!!** (1)

అపార సంసార సాగరంలో మునిగిపోవుచున్న నాకు దిక్కేది? కృపా సముద్రుడవైన ఓ గురువరా దయతో నాకు బోధించుము:- భగవానుని యొక్క పాద పద్మమనెడి గొప్ప నావయే దిక్కు:-

**బద్ధోహికోయో విషయానురాగీ/ కావా విముక్తి ర్విషయే విరక్తః!**
**కోవాస్తి ఘోరో నరకః స్వదేహః/ తృష్ణాక్షయః స్వర్గపదం కిమస్తి!!** (2)

బద్ధుడనగానెవడు? ప్రాపంచిక విషయములందు ఆసక్తి కలవాడు., ఘోర నరకమేది? నీ యొక్క దేహమే; స్వర్గపదవి ఏది? ఆశ క్షీణించుటే.

**సంసారహృత్కః శ్రుతిజాత్మ బోధా/ కోమోక్ష హేతుః కథితః సఏవ!**
**ద్వారం కిమేకం నరకస్యనారీ కాస్వర్గదా ప్రాణ భృతామహింసా!!** (3)

సంసారమును హరించునదేది? వేదాంతము వలన కలిగిన ఆత్మబోధ. మోక్షమునకు కారణము? పైనచెప్పినదే:- తన్ను తాను తెలుసుకొనుటే- నరకమునకు ద్వారమేది; స్త్రీయే; స్వర్గాన్నిచ్చేదేది? అహింసయే.

**శేతే సుఖంకస్తు సమాధి నిష్ఠో! జాగర్తి కోవా సదసద్వివేకీ!**
**కేశత్రవః సంతి నిజేంద్రియాణి/ తాన్యేవ మిత్రాణి జితాని యాని!!** (4)

సుఖంగా నిద్రపొయ్యేదెవరు? సమాధి నిష్ఠుడు, మేల్కొనిన వాడనగా ఎవడు? సత్యమగు పరమాత్మను అసత్యమగు జగత్తును తెలుసుకొనినవాడు. శత్రువులనగా ఎవరు? ఇంద్రియాలే; మిత్రులెవరు? స్వాధీనమైన ఇంద్రియములే;

**కోవాదరిద్రోహి విశాలతృష్ణః శ్రీమాంశ్చ కోయస్య సమస్త తోషః!**
**జీవన్మృతః కస్తు నిరుద్యమోయః కింవామృతం స్యాత్సుఖదా నిరాశా!!** (5)

దరిద్రుడనగా ఎవడు; అంతులేని ఆశగలవాడు; శ్రీమంతుడెవడు? తృప్తిగలవాడు; జీవన్మృతుడెవడు? ముక్తికి ప్రయత్నించని వాడు. అమృతమనగానేది? హాయినిచ్చే నిరాశయే:-

**పాశోహి కోయో మమతాభిమానః! సమ్మోహయత్యేవ సురేవ కాస్త్రీ!**
**కోవా మహంధో మదనాతురోయో! మత్యుశ్చకో వాపయశః స్వకీయమ్!! (6)**

పాశమేది? నాదిఅనెడి అభిమానము; కల్లువలె మోహింపజేసేది ఏది? స్త్రీయే; మహాకబోది ఎవడు? కామాతురుడు; మృత్యువనగా ఏది? నీ అపకీర్తియే:- -

**కోవాగురు ర్యోహి హితోపదేష్టా! శిష్యస్తుకో యోగురు భక్తఏవా!**
**కోదీర్ఘ రోగో భవ ఏవసాధో! కి మౌషధం తస్య విచార ఏవ!! (7)**

గురువనగా ఎవరు? హితోపదేశము చేయువాడు; శిష్యుడనగా ఎవరు? గురువుపై భక్తికలవాడు; గొప్పరోగమేది? జనన మరణాలే (భవమే) ఈ రోగానికి మందేది? ఆత్మ విచారము-నేనెవరు? అని విచారణ చేయుట:-

**కింభూషణాద్భూషణమస్తి శీలమ్! తీర్ధ పరంకిం స్వమనో విశుద్ధమ్!**
**కిమత్రహేయం కనకంచ కాంతా! శ్రావ్యం సదాకిం గురువేద వాక్యమ్!! (8)**

అలంకారమునకే అలంకారమైనదేది? శీలము=సత్ప్రవర్తనము:- ఉత్తమ తీర్థమేది? నిర్మలమైన మనస్సు; విడిచిపెట్టవలసినవి ఏవి? కాంతాకనకాలను విడిచిపెట్ట వలయును; నిరంతరం వినదగినదేది? గురువు యొక్కయు, వేదము యొక్క వాక్కులను:-

**కేహేతవో బ్రహ్మ గతేస్తు సన్తి! సత్సం గతి ర్దాన విచార తోషాః!**
**కేసంతి సంతోఖిల వీతరాగా! అపాస్త మోహాహ శివ తత్త్వ నిష్ఠా!! (9)**

పరబ్రహ్మమును జేరు మార్గమేది? సజ్జన సహవాసము, దానము, స్వాత్మవిచారము, సంతోషము., సజ్జనులనగానెవరు? అన్నిటియందును వైరాగ్యము గలవారును, మోహములేని వారును, ఆత్మతత్త్వమందు నిష్ఠగలవారును.

**కోవాజ్వరః ప్రాణభృతాంహి చింతా! మూర్ఖో 2స్తి కోయస్తు వివేకహీనః!**
**కార్యాప్రియాకా శివ విష్ణుభక్తిః! కింజీవనం దోషవివర్జితం యత్!! (10)**

జ్వరమనగానేమి? ఎట్లా బ్రతకడం అనేచింత; మూర్ఖుడనగా నెవరు? సత్యాసత్యముల విచక్షణా జ్ఞాన హీనుడు. చేయవలసిన పని ఏది? శివకేశవుల యందు భక్తి; జీవనమనగానేమి? పాప దోషములేని జీవనము:-

**విద్యా హికా బ్రహ్మగతి ప్రదాయా! బోధోహికో యస్తు విముక్త హేతుః!**
**కో లాభ ఆత్మా వగమో హియావై! జితం జగత్యేన మనోహియేన!! (11)**

విద్యయనగానేది? పరమాత్మను పొందింపజేయునది. బోధయనగా నెట్టిది? ముక్తికి హేతువైనది బోధ=జ్ఞానము; దాని వలన లాభమేమి? ఆత్మజ్ఞానమే లాభము. జగత్తును జయించిన వాడెవడు. మనస్సును జయించినవాడే:-

**శూరాన్ మహాశూరతమో 2స్తి కోవా! మనోజబాణై ర్వ్యథితో నయస్తు!**
**ప్రజ్ఞో2థ ధీరశ్చ సమస్తు కోవా! ప్రాప్తోనమోహం లలనా కటాక్షైః!! (12)**

శూరులలో కెల్ల గొప్పశూరుడెవడు? కాముని బాణములచే వేధింపబడని వాడు, బుద్ధిమంతుడును సమదృష్టి గలవాడును అగు ధీరుడెవడు? ఆడవారి కడగంటి చూపులచేత మోహమును పొందనివాడు.

**విషాద్విషం కిం విషయాన్సమస్తా! దుఃఖీసదా కో విషయాను రాగీ!**
**ధన్యోసికో యస్తు పరోపకారీ! కః పూజనీయః శివతత్త్వ నిష్ఠః!! (13)**

విషముకంటె గొప్ప విషమేది? సమస్త ప్రాపంచిక సుఖములు. నిరంతరము దుఃఖితుడెవడు? విషయములందాసక్తి కలవాడు. ధన్యుడెవడు? పరోపకారముచేయు వాడు; పూజింపదగినవాడెవడు? మంగళప్రదమైన పరమాత్మ తత్త్వమునందు నిలకడ బొందినవాడు.

**సర్వాస్వవస్థా స్వపికిన్న కార్యమ్! కింవావిధేయం విదుషా ప్రయత్నాత్!**
**స్నేహంచపాపం పఠనంచ ధర్మమ్ సంసారమూలం హి కిమస్తి చింతా!! (14)**

ఏ అవస్థ యందైనను చేయరానిదేది? దుష్టసహవాసము; పాపము ఏ అవస్థయందైనను బుద్ధిమంతుడు చేయవలసినదేది? గ్రంథపఠనము, ధర్మము. సంసారమునకు మూలమేది? చింతయే కదా!

**విజ్ఞానమహా విజ్ఞతమో 2స్తి కోవా, నార్యా పిశాచ్యా నచ వంచితోయః!**
**కాశృంఖలా ప్రాణభృతామ్ హినారీ, దివ్యం వ్రతం కించ సమస్త దైన్యమ్!! (15)**

జ్ఞానులలో మిగుల గొప్పజ్ఞాని ఎవడు? స్త్రీ పిశాచముచే వంచింపబడని వాడు. జీవులకు సంకెళ్ళు ఏవి? స్త్రీయే; ఉత్తమమైన వ్రతమేది? వినయం.

**జ్ఞాతుం నశక్యంచ కిమస్తి సర్వై ర్యోషిన్మనో యచ్చరితం తదీయం!**
**కాదు స్త్యజా సర్వ జనైర్దురాశా, విద్యావిహీనః పశురస్తి కోవా!! (16)**

ఎవ్వరికైననూ తెలిసికొన శక్యము గానిదేది? స్త్రీయొక్క మనస్సు. దాని ప్రవర్తన అందరికినీ విడువశక్యముగానిదేది? దురాశ; పశువెవడు? విద్యలేని వాడు

**వాసోన సంగః సహకైర్విధేయో! మూర్ఖైశ్చ నీచైశ్చ ఖలైశ్చ పాపైః!**
**ముముక్షుణా కిం త్వరితం విధేయం, సత్సంగతి ర్నిర్మమ తేశ భక్తిః!! (17)**

ఎవరితో నివాసము సహవాసము చేయరాదు? మూర్ఖులతో, నీచులతో, దుష్టులతో, పాపాత్ములతో:- ముక్తిగోరువానికి వేగమే చేయదగిన పనియేది? సజ్జన సహవాసము, మమకార రాహిత్యము, పరమేశ్వర భక్తి.

**లఘుత్వమూలంచ కిమర్థితైవ, గురుత్వమూలం యదయాచనంచ!**
**జాతోహి కోయస్యపునర్న జన్మ; కోవామృతో యస్య పునర్న మృత్యుః!! (18)**

చులకన తనమునకు మూలమేది? చెయ్యిచాచి యాచించుటే; గొప్పదనమునకు మూలమేది? ఎవరినీ యాచించకుండుటయే; ఎవని జన్మ సార్థకమైనది? మరల జన్మించని వాని జన్మ; ఎవని మరణము మంచిది? తిరిగీ మరణించని వానిది.

**మూకో2స్తి కోవా బధిరశ్చ కోవా! వక్తుంనయుక్తం సమయే సమర్థః !**
**తథ్యంసు పథ్యం నశృణోతి వాక్యం! విశ్వాస పాత్రంన కిమస్తి నారీ!! (19)**

మూగవాడెవ్వడు? సమయమునకు తగిన మాటలు చెప్పలేని వాడు. చెవిటి వాడెవడు? సత్యమైన, హితకరమైన మాట వినని వాడు. విశ్వాస పాత్రము గానిదేది? స్త్రీయే.

**తత్త్వం కిమేకం శివమద్వితీయం కిముత్తమం సచ్చరితం యదస్తి!**
**త్యాజ్యం సుఖంకిం స్త్రియ మేవసమ్యగ్దేయం పరంకింత్వ భయం సదైవ!! (20)**

ఒకటేయగు ప్రముఖతత్త్వమేది? శివంకరమైన అద్వైత తత్త్వము. ఉత్తమమైనదేది? సత్ప్రవర్తన. విడిచిపెట్టవలసిన సుఖమేది? స్త్రీ సుఖాన్నే. ఉత్తమ దానమేది? అభయదానము.

**శత్రోర్మహా శత్రుతమో2స్తి కోవా! కామః నకోపాన్నృతలో భతృష్ణః!**
**నపూర్వ్యతేకో విషయైః స ఏవ కిందుఃఖమూలం మమతా భిమానమ్!! (21)**

శత్రువు కంటే గొప్ప శత్రువెవడు? కోపము, అసత్యము, లోభము, ఆశ వీటితో కూడిన కామము; విషయములచే తృప్తి చెందనిదేది? పైజెప్పిన ఆకామమే దుఃఖమునకు మూలమైనదేది? నేనునాది అనే అభిమానము.

**కింమండనం సాకర్షతా ముఖస్య! సత్యంచ భూతహితం సదైవ!**
**కిం కర్మ కృత్వానహిశోచనీయం! కామారి కంసారి సమర్చ నాఖ్యం!! (22)**

ముఖమునకు అలంకారమేది? సద్విద్య. చక్కనివాక్కు; నిజమైన కర్మఏది? అన్ని ప్రాణులకు ఉపకారము చేయుటయే; దేనిని చేసిన దుఃఖింప పనిలేదు? కాముణ్ణి జయించిన శివుని; కంసవైరి యగు కేశవుని- పూజించుటచే:-

**కస్యాస్తి నాశేమన సోహిమోక్షః క్వసర్వథానాస్తి భయం విముక్తే!**
**శల్యం పరంకిం నిజమూర్ఖతైవ! కేకే హ్యుపాస్య గురుదేవ వృద్ధాః!!** (23)

ఏది. నశిస్తే మోక్షము లభించును? మనస్సు; ఎంతమాత్రమూ భయములేని ప్రదేశమేది? విముక్తి యందు; (అద్వైతమందు) మిక్కిలి బాధపెట్టే ముల్లు ఏది? వాడిలోని మూర్ఖత్వమే; ఎవరెవరిని సేవించవలెను? గురువును, దేవుని, గొప్పవారిని.

**ఉపస్థితే ప్రాణహరే కృతాంతే! కిమాశుకార్యం సుధియా ప్రయత్నాత్!**
**వాక్కాయ చిత్తైః సుఖదం యమఘ్నం! మురారి పాదాంబుజ చింతనంచ!!** (24)

ప్రాణాలను కొనిపోవు కాలుడు సమీపించగా బుద్ధిమంతుడు చేయవలసిన పనిఏమి? మనోవాక్కాయములద్వారా సుఖదాయి అయిన, మృత్యువును హరించే హరిపాదాంబుజ స్మరణమే:-

**కేదస్యవః సన్తి కువాసనాఖ్యాః కః శోభతేయః సదసి ప్రవిద్యః!**
**మాతేవకాయా సుఖదాసు విద్యాకి మేధతే దానవశాత్సు విద్యా!!** 25

జ్ఞానధనాన్ని దొంగలించే దెవరు? దుర్వాసనలు, సభలో రాణించేదెవరు? ఉత్తముడైన విద్యాంసుడు తల్లివలె సుఖము నిచ్చేది ఏది? మంచి విద్య దానముచేసిన కొలదీ వృద్ధి చెందునదేది? విద్యయే. ?

**కుతోహిభీతిః సతతం విధేయా లోకోప వాదా భవకాననంచా!**
**కోవాతిబంధుః పితరశ్చ చకేవా! విపత్సహాయః పరిపాలకాయే!!** (26)

ఎల్లప్పుడు దేని వలన భయపడవలెను? లోకోపవాదము, సంసారాటివిచే. మంచి బంధువెవడు? ఆపదలో ఆదుకొనే వాడు. తండ్రులెవరు? పరిపాలించేవారు.

**బుధ్వాన బోధ్యం పరిశిష్యతేకిం శివప్రసాదం సుఖబోధ రూపమ్।**
**జ్ఞాతేతుకస్మిన్ విదితం జగత్స్యాత్సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే॥** (27.)

దేనిని తెలిసి కొనినచో ఇక వేరే దేనినీ తెలిసికోనక్కరలేదు- అదిఏది? మంగళస్వరూపమును, శుద్ధమును, జ్ఞానస్వరూపమగు పరమాత్మస్వరూపమును, దేనిని తెలిసి కొనినచో ఈ జగత్తు **తెలియబడుతుంది?** సర్వమునకాత్మ అయిన పరిపూర్ణమైన పరబ్రహ్మమును.

**కిందుర్ల భం సద్గురురస్తిలోకే., సత్సంగ తిర్బ్రహ్మ విచారణాచ।**
**త్యాగోహి సర్వస్య శివాత్మబోధః కోదుర్జయః సర్వజనైర్మనోజః ॥ (28)**

లోకమున దుర్లభమైన దేది? సద్గురువు, సజ్జన సాంగత్యము, బ్రహ్మ విచారము సర్వమును త్యాగముచేయుట; శివంకరమైన ఆత్మజ్ఞానము; ఎవరిచేతను జయింపరాని వాడెవడు? - మన్మధుడు=కామము.

**పశోః పశుః కోనకరోతిధర్మంప్రాధీతశాస్త్రో2పినచాత్మబోధః ।**
**కింతద్విషంభాతి సుధోపమంస్త్రీ। కేశత్రవో మిత్రవ దాత్మజాద్యాః ॥ (29)**

పశువును మించిన పశువెవడు? ధర్మం చేయనివాడు. శాస్త్రముల బాగాచదివినీ ఆత్మనెరుగనివాడు; అమృతము వలెకనబడే విషమేది? స్త్రీయే మిత్రులవలెకనబడే శత్రువు లెవరు? కొడుకులు మొదలగు వారు-

**విద్యుచ్చలం కింధనయౌవనాయుర్దానం పరంకించ సుపాత్రదానం । (30)**
**కంఠంగతైరప్యసుభిర్నకార్యం కింకిం విధేయం మలినం శివార్చ ॥**

మెఱుపు తీగవలె చంచలమైనదేది? ధనము, యౌవనము; ఆయువు, ఉత్తమదానమేది? పాత్రనెరిగి చేయుదానము; ప్రాణములు గొంతుపైకి వచ్చిననూ చేయకూడని దేది? చేయవలసినదేది? పాపముచేయరాదు చేయవలసినది శివపూజ

**అహర్నిశం కింపరిచింతనీయం । సంసార మిధ్యాత్వ శివాత్మతత్త్వం ।**
**కిం కర్మయత్ప్రీతి కరం మురారేః క్వాస్థాన కార్యా సతతం భవాబ్ధౌ (31)**

రాత్రింబవళ్లుదేనిని స్మరించవలెను? సంసారముయొక్క మిధ్యా స్వరూపమును, మంగళకరమైన ఆత్మ తత్త్వమును, ఎటువంటికర్మ చేయవలయును ? భగవత్ప్రీతి కరమైన కర్మ, సదానమ్మకమునెందుంచ రాదు?.. సంసారసాగరమున

**కంఠం గతావా, శ్రవణంగతావా, ప్రశ్నోత్తరా ఖ్యామణిరత్నమాలా ।**
**తనోతుమోదం విదుషాం సురమ్యం రమేశగౌరీశ కథేవ సద్య ః ॥ (32)**

ప్రశ్నోత్తరి యనెడి యీమణిరత్నమాల కంఠమునందున్నను, దీనిని వినినను, శివకేశవుల కథవలెనే వేగముగా పండితులకు ఆనందము కలుగజేయును.

**ఇతి శ్రీమత్ప రమహంసపరివ్రాజకాచార్య శ్రీ గోవింద భగవత్పూజ్య పాద శ్రీ మచ్ఛంకర భగవతః కృతౌ ప్రశ్నోత్తరి సమాప్త ః.**

# నాస్తికవాదము

**క్వా22 లింగనం భుజని పీడిత బాహుమూలం**
**భ్యుగ్యోన్నతస్తన మనోహర మాయతాక్ష్యాః**
**భిక్షోపవాస నియమార్క మరీచిదాహై ః**
**దేహోపశోషణ విధిః కుధియాం క్వచైషః ? (1)**

పీనకఠినోన్నతస్తన మనోహరమైన సుందరాంగుల మృదుబాహువులచే గావింపబడిన కౌగిలింత లెంతటి సుఖానందకరములు ! స్త్రీతిరస్కారమొనర్చువారు పరమమూర్ఖులు కాదా! ఉపవాసములు, భిక్షాటనము, ఎండలోను, అగ్నిహోత్రాదుల వల్లను దేహమును శుష్కింపచేసుకొని వెతలబడుట స్వర్గమోక్షాది సుఖములను కరతలామలకములుగ జేయుననుట, ఎట్టి మూఢత్వము. (ప్రబోధచంద్రోదయము)

**స్వర్గః కర్తృక్రియా ద్రవ్యవినాశో యదియజ్వానాం**
**తతోదావాగ్ని దగ్ధానాం ఫలంస్యాద్భూరి భూరుహామ్ ॥ (2)**

యజ్ఞము చేయుచున్నవారికి కర్తృ క్రియాద్రవ్యవినాశమై స్వర్గములభించుచో, దావాగ్ని దగ్ధములైన మహామహీరుహములకు మాత్రము మహాఫలము కలుగదా ?....

**మృతానపి జంతూనాం శ్రాద్ధంచేత్ తృప్తికారణం**
**నిర్వాణ స్యప్రదీపస్య స్నేహః సంవర్ధయేత్ శిఖామ్ ॥ (3)**

ప్రాణులు చనిపోయినను వాటికి శ్రాద్ధములు తృప్తికారణము లగుచో, ఆరిపోయిన దీపమునకు నూనెపోయుటచే ఉద్దీపనము చేయవలయును కదా ! (ప్రభోధచంద్రోదయము)

**అగ్నిహోత్రం త్రయోవేదాః త్రిదండం భస్మగుంఠనమ్**
**ప్రజ్ఞా పౌరుష హీనానాం జీవకేతి బృహస్పతి ః ॥ (4)**

అగ్నిహోత్రాదికర్మలు, వేదములు, త్రిదండము, విభూతినలదుకొనుట మొదలైనవి ప్రజ్ఞలేనివాని యొక్కా, పౌరుషహీనుల యొక్కా బ్రతుకుబాటయని, నాస్తిక ప్రవర్తకుడైన "బృహస్పతి" అనుబుద్ధిప్రమాణవాది చెప్పాడు. ఇహమేగానీ ,పరముగానీ, ఆత్మగానీ, దైవముగానీ లేవనిన్నీ, వేదాది ప్రమాణములంగీకరించవద్దనీ, - నాస్తికుల వాదనల సారాంశము - ఇదియే బుద్ధివాదము. (ప్రభోధచంద్రోదయము)

**యావజ్జీవం సుఖంజీవేత్ ఋణంకృత్వాఘృతం పిబేత్ ।**
**భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కృతః ॥ (చార్వాకం) (5)**

బ్రతికినన్నాళ్లు సుఖంగా బ్రతకవలె. అప్పుచేసియైనను ఆజ్యధారలతో శుభ్రముగా భోజనముచేయవలయును. దేహమున్నంతవరకేగానీ, చనిపోయాక అదిమట్టిలో కలిసి పోతుందేకానీ మళ్లీరాదుకథా !

**అనాదిసిద్ధ సంసారః కర్తకర్మవివర్జిత :**
**స్వయం ప్రాదుర్భవత్యేవ స్వయమేవ విలీయతే॥** (6)

ఈలోకమంతయు అనాదిగానున్నదే ! దీన్ని సృష్టించినవాడూలేడు.సృష్టీ జరుగలేదు. ఇదే స్వయంభువు అయినది.ఇది దానంతట అదేలయమునూ పొందుతుంది సృష్టికర్తఅయిన ఈశ్వరుడులేడు. (చార్వాకం)

**త్యాజ్యం సుఖం విషయ సంగమ జన్మపుంసాం**
**ధుఃఖోప సృష్టమితి మూర్ఖవిచారనైషా**
**వ్రీహీన్ జిహాసతి సితోత్తమ తండు లాఢ్యాన్**
**కోనామభోః తుషకణోప హితాన్ హితార్థీ -॥** (7)

విషయ సుఖములు అన్నీకూడా దుఃఖముతో కూడినవే, కానఅవిజీవులకు! త్యాజ్యములు ! అనుట మూర్ఖవాదము, ఎందుచేతనంటే వూకతోకూడినవని, తెల్లని బియ్యపు గింజలతో కూడిన వడ్లను బుద్ధిమంతుడెవ్వడూ విడిచి పెట్టుటలేదుగదా! (ఈపోలిక ఈసందర్భమున పూర్తిగావర్తించదు. విషయ సుఖములు ఎందువల్ల ఎవరికి త్యాజ్యములు? అనుదానిని బుద్ధిమంతులు ఆలోచించవలసిన విషయము.)

**పశుశ్చేన్నిహత స్స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతీ**
**స్వపితాయజమానేన తత్రకస్మాన్నహింస్యతే॥** (8)

జ్యోతిష్టోమాదులందు చంపబడినపశువు స్వర్గమునకు పోవుననిగదా మీరనేది. అట్లయిన యజమాని తనతండ్రినే యజ్ఞ పశువుగచేసిన అతణ్ణినేరుగా స్వర్గానికి పంపవచ్చునే! అట్లేలచేయరు ? (చార్వాకం)

**యూపంకృత్వా పశూన్ హత్వా రుదిరం కర్దమం**
**యద్యేవం గమ్యతే స్వర్గే నరకేకేన గమ్యతే॥** (9)

యజ్ఞములలో యూపస్తంభానికి పశువునుకట్టి దానినినరికి, నేలను నెత్తుటి బురదగా చేసినవాడు స్వర్గానికి పోయేట్లైతే, ఇకనరకానికి పోయే వాడెవడు? (చార్వాకం).

**దీపోయథా నిర్వృతి మభ్యుపేతః నైవావనిం గచ్ఛతి నాంతరిక్షమ్**
**దిశం నకాంచిత్ విదిశం నకాంచిత్ స్నేహక్షయాత్ కేవల మేతిశాంతిమ్॥** (10)

స్నేహక్షయము అగుటతో, అనగా చమురు అయిపోవడంతో దీపము శాంతిని పొందినట్లే,జీవుడున్నూ మరణముతో నిర్వృతి నొందుచున్నాడు. భూమిమీదగానీ, అంతరిక్షంలోగానీ, దిక్కులలోగానీ, విదిక్కులలోగాని, మరెక్కడాగానీ, ఏరూపంలోనూ జీవుడు మరణానంతరము అస్తిత్వంలోవుండుటలేదు.

**పిబఖాదచ జాతశోభనే! యదతీతం వరగాత్రితన్నతే**
**నహీభీరు గతం నివర్తతే! సముదయమాత్రమిదం కళేబరం ॥ (11)**

గతించిపోయినదేదీ తిరిగిరాదు సూమా! ఓసుగాత్రీ! అందుచే ఉన్నంతసేపేనుతిను, త్రాగు, అనుభవించు. సుందరీ! పోయినది లేనిదానిలోలెక్కకొరకై ఆశనొందకు ఈకళేబరము కేవలము పంచభూతముల కలయికవలన పుట్టినదేకాని, వేరేమియు లేదని తెలుసుకో. ఓభీరురాలా! (బృహస్పతిచార్వాకం)

(ఆత్మ అనేదిలేదని, శ్రుతులు ప్రమాణములు కావని, ఇంద్రియాదుల ప్రత్యక్ష అనుభవమే పరమస్వీకార్యము అనునదే చార్వాకుల సిద్ధాంతము.)

# గుర్వష్టకమ్

**శరీరం సురూపం తథావాకలత్రం యశశ్చారు చిత్రం ధనంమేరుతుల్యం**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతః కిం తతఃకిం తతఃకింతతః కిమ్ (1)**

మంచిఅందము గల దేహము, అటువంటిదేభార్య, మంచికీర్తి, మేరు సమ సంపద – అన్నీఉన్నాయి. కానీ గురుపాద పద్మములందులగ్నముకాని మనస్సున్నచో ఆతర్వాత ఏమి? ఆ తర్వాత ఏమి ? ఆతర్వాత ఏమి ?ఆతర్వాత ఏమి ?

**కలత్రంధనం పుత్రపౌత్రాది సర్వం,గృహం బాంధవాః సర్వమే తద్ధిజాతమ్**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (2)**

భార్యధనము పుత్రపౌత్రాదులు, ఇల్లు,బంధువులు అన్నీ ఉన్నాయి. కానీ గురుపాద ప. ములందు లగ్నముకాని మనస్సుంటే, వాని గతి తర్వాత ఏమి? వానిగతి తర్వాత ఏమి ?

**షడంగాది లేదో ముఖేశాస్త్ర విద్యా, కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతఃకిం తతఃకిం తతఃకిం తతః కిమ్ (3)**

షడంగాది వేదములు, శాస్త్రవిద్యలు వచ్చును - గద్యపద్యాలతో కవిత్వం చెప్పగలర గురుపాద పద్మములందులగ్నము కాని మనస్సుంటే తర్వాతవానిగతేమి ? ... గతేమి తర్వాత వానిగతిఏమి ? ..... గతి ఏమి

**విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః సదాచార వృత్తేషు మత్తోనచాన్యః**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (4)**

విదేశాలలో సన్మానము, స్వదేశంలో పేరు ప్రతిష్ఠలు, ఇతరులకంటే సదాచారం కలవాడు కానీ, గురుపాదపద్మములందు లగ్నము కాని మనస్సుంటే తర్వాత వాని గతి ఏమి?... తర్వాత వాని గతి ఏమి?... గతి ఏమి.

**క్షమామండలే భూపభూపాలబృందైః సదాసేవితం యస్యపాదారవిందమ్**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (5)**

భూమండలంలోని గొప్ప భూపాలులందరూ అతని పాదారవిందాల్ని సేవిస్తారు కాని గురుపాదపద్మములందులగ్నముకాని మనస్సు గలవానియొక్క తర్వాతిగతి ఏమి?తర్వాతిగతి ఏమి ? ..........ఏమి ?

గుర్వష్టకమ్

**యశోమేగతిందిక్షుదాన ప్రతాపా । జ్జగద్వస్తుసర్వం కరేయత్ప్ర సాదాత్**
**మనశ్చేన్నలగ్నంగురోరంఘ్రిపద్మే । తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (6)**

తన కీర్తి తనదాన ప్రతాపముచేదిక్కులంతటా వ్యాపించియుంది -జగద్వస్తువు లన్నిటినీఅర్థు లకీయగలడు కానీగురు పాద పద్మములందు మనస్సులేనివాని తర్వాతి గతి ఏమి ? ... గతిఏమి ?

**నభోగేనయోగేనవా వాజిరాజౌ ! నకాంతాముఖేనైవ విత్తేషు చిత్తమ్**
**మనశ్చేన్నలగ్నంగురోరంఘ్రిపద్మే ! తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (7)**

భోగమందుకానీ, యోగమందు కానీ అశ్వశ్రేష్ఠములందుగానీ మనసు లేకపోయిననూ గురుపాదపద్మములందు మనస్సులేనివాని గతి ఏమి ? ..... గతి ఏమి

**అరణ్యేనవాస్వస్యగృహేనకార్యేన్నదేహే మనోవర్తతేమే త్వన ర్ఘ్యే**
**మనశ్చేన్నలగ్నంగురో రంఘ్రిపద్మే ! తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్ (8)**

అడవిలోకానీ, స్వంత ఇంటిలోకానీ,ఏదోకార్యమందుకానీ,దేహముపై మనస్సుంచితే.

**గురోరష్టకం యఃపఠేత్ పుణ్యదేహీయతి ర్భూపతి ర్బ్రహ్మచారీ చగేహీ**
**లభేద్వాంచితార్థం పదం బ్రహ్మసంజ్ఞం గురోరుక్తవాక్యేమనోయస్యలగ్నమ్ (9)**

పుణ్యాత్ముడు,యతి,భూపతి,బ్రహ్మచారీ గృహస్థుడు ఈ అష్టకమును పఠించుచు గురువు బోధించిన వాక్యములను మనస్సు నందులగ్నము చేసినచో వానికి వాంఛి తార్థములు కలుగును-తుదకు బ్రహ్మపదమును పొందును- గురువేభగంతుడు. భగవత్పాదములే గురుపాదములు.

# త్రివిధాపరాధములు

**యాత్రామయా వ్యాపకతాహతాతే స్తుత్యుక్తిభిః వాగ్పరతా హతాతే**
**ధ్యానేన చేతః పరతాహతాతే క్షమస్వశంభోత్రివిధావరాధాన్ (1)**

శంభో, నీవుసర్వ వ్యాపకుడవని తెలిసికూడా ఆసేతుహిమాచలప్యాంతమూ యాత్రలు చేసి నీ సర్వవ్యాపకత్వాన్నితుడిచి పెట్టినాను. ఇది నేను దేహముతో చేసిన అపరాధము. నీవు వాక్కుల కందని వాడవని తెలిసీనిన్ను స్తుతించి నీయొక్క వాక్కుల కందని స్థితిని కించ పరచి నాను అదినేను నోటితో చేసిన అపరాధము. నీవు మనస్సుకు కందనివాడవు -నేను ధ్యానం చేసి నిన్నుపొందదలచాను. నీవు మనస్సుకు అందని వాడవు కావున నేను మనస్సుతోనీ ఎడ అపరాధము చేసినాను. మనో వాక్కాయములతో నేను చేసిన త్రివిధా పరాధములను క్షమించు (శంకరభగవత్పాదులు)

**అన్న మాచార్యులు కూడా తన త్రివిధాపరాధములను పాడుకొంటాడు.**

**అది నాయపరాధ మిదినాయపరాధ**
**మదియు నిదియునాయపరాధము**
**నెరయ రూపము లెల్ల నీరూపమెకా**
**నరయనిది నాయపరాధము**
**పరిపూర్ణుడగునిన్ను పరిచ్ఛిన్నునిగా**
**నరయుట నాయపరాధము**
**జీవాత్మునిగా చింతింపదలచుట**
**అవంకనది నాయపరాధము**
**సేవించి నిను నాత్మ చింతింప కుండుట**
**ఆవలనిది నా యపరాధము**
**ఈడెరుగక వెంకటేశుడునిను/గొనియాడుట నాఅపరాధము**
**ఏడజూచిననా ఎదురనుండగ నిన్ను**
**అడఈడ వెదకుట అపరాధము.**

# సూక్తి రత్న మంజరి

ఏకశ్లోకి :-

కిం జ్యోతిస్తవ భాను మాన హనిమేరాత్రౌప్రదీపాదికం
స్యాదేవం రవిదీపదర్శన విధౌ కిం జ్యోతి రాఖ్యాహిమే
చక్షుః తస్యనిమీలనాది సమయేకిం ధీః ధియోర్దర్శనే
కిం తత్రాహమతో భవాన్ పరమకం జ్యోతిస్తదస్మిప్రభో

**ప్రశ్న= నీవు దేని సహాయమున సమస్తమును తెలుసు కొనుచున్నావు. జావాబు= పగలు సూర్యుని వెలుగు వలన ; రాత్రి, దీపములు, చంద్రనక్షత్ర కాంతులచే; ప్రశ్న= ఆ సూర్యుని, దీపాలను దేనిచే తెలుసుకొను చున్నావు? జావాబు=కన్నులచే; ప్రశ్న= కన్నులు మూసు కొంటే? జవాబు= బుద్ధిచే ప్రశ్న= ఆబుద్ధిని దేని చే విశ్లేషించెదవు? జావాబు= నా చేతనే (నా ఆత్మ చేతనే)**

కావున ఆత్మ స్వప్రకాశకము కదా! అదియే నీవని ఎరుగుము అట్లగుట యే మోక్షము, స్వామి! తమ అనుగ్రహముచే తెలిసికొంటిని.

**పుంఖానుపుంఖ విషయేక్షణ తత్పరో2పి బ్రహ్మావలోకన ధియం నజహాతియోగీ
సంగీత తాళయ నృత్తవశం గతో2పి మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీః నటీవ,**

సంగీత, తాళ, లయనృత్తాదులతో మనస్సును లగ్నము చేసియు, శిరస్సుపై యుంచుకొనిన కుండను పడిపోనీయక నిలిపి రక్షించు కొనుటలో ఏకాగ్రత చెందియున్న నటి వలెనే, నిరంతరము గుంపులు గుంపులుగా పైబడుచున్న విషయములను చూచుచుండియూ యోగి తన యాత్మ యందు రమించుట మానలేదు:-

**శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
బ్రహ్మాసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నా పరః**

కోట్లగ్రంథాల సారమంతటినీ అర్ధశోకంలో చెప్పెదను బ్రహ్మమే సత్యము. జగత్తు మిథ్య జీవుడు బ్రహ్మమే కానీ వేరు కాదు:-

**ఐశ్వర్యస్యసమగ్రస్య ధర్మస్య యశసశ్రేయః
జ్ఞానవైరాగ్య యోశ్చైవషణ్ణాం భగఇతీరణా,**

సమగ్రమైన ఐశ్వర్యము, ధర్మము, యశము, శ్రేయము, జ్ఞానము వైరాగ్యము, ఈ

ఆరున్నూ భగవంతుని యందున్నవి,

**జీవశ్శివ శ్శివో జీవస్సజీవః కేవలశ్శివః**
**తుషేణ బద్ధో వ్రీహిస్స్యాత్తుషా భావేన తండులః**

జీవుడే శివుడు. శివుడే జీవుడు- ఆ జీవుడే సాక్షాత్ శివుడు పొట్టుతో ఉన్నప్పుడది వడ్లగింజ పొట్టు పోతే బియ్యం.

**ఏవంబద్ధా స్తథాజీవః కర్మనాశే సదాశివః**
**పాశం బద్ధాస్తథా జీవః పాశముక్తస్సదా శివః**

కర్మచేకట్టబడితే జీవుడు. కర్మనాశంతో వాడు సదాశివుడు పాశబద్ధుడైనపుడు జీవుడు. సంసారపాశముక్తుడైతే సదాశివుడు.

**దేహబుద్ధ్యాతుదా సో2హం జీవ బుద్ధ్యాత్వదంశకః**
**ఆత్మబుద్ధ్యాత్వమే వాహం ఇతిమే నిశ్చితామతిః**

దేహబుద్ధితో నేను నీకు దాసుడ. నేను జీవుడని భావించి నప్పుడు నేను నీ అంశను. ఆత్మభావం కలిగినపుడు నీవే నేను

**దాసస్తే2హందేహదృష్ట్యాస్మిశంభో/ జాతస్తే2ంశో జీవదృష్ట్యాత్రిదృష్టే**
**సర్వస్యాత్మనాత్మ దృష్ట్యాత్వమేవే/ త్యేవంమే ధీర్నిశ్చితా సర్వశాస్త్రైః**

శంభో! దేహమే నేనను దృష్టితో చూచినచో నేను నీ దాసుడను త్రినేత్రా నేను జీవుడను దృష్టితో చూచినపుడు నేను నీ అంశామాత్రుడను. ఆత్మయేనేనను దృష్టితో చూచి నపుడు అందరికీ పరమాత్మవే నీవు కదా! నీవే నేను. శివా! సర్వశాస్త్రాలను పరిశీలించిన నా బుద్ధి ఈ నిశ్చయమునకు వచ్చినది.

**అసితగిరి సమంస్యాత్కజ్జలం సింధుపాత్రే/ సురతరు వరశాఖా లేఖినీ పత్రముర్వీ.**
**లిఖతియది గృహీత్వాశారదా సర్వకాలం.తదపి తవగుణానా మీశపారం నయాతి.**

" కాటుక కొండమసి, సముద్రమే (సిరా) పాత్ర, కల్పవృక్షశాఖలే కలములు, భూమియే వ్రాయుటకు పత్రము, ఈ పరికరాలతో సరస్వతీదేవి సర్వకాలమూ వ్రాసినా, మీ గుణాల అంతు తెలియదు:-

**ధర్మోవిశ్వస్యజగతః ప్రతిష్ఠా లోకేధర్మిష్ఠః ప్రజా ఉపసర్పంతి**
**ధర్మేణ పాపమపనుదతి ధర్మేసర్వం ప్రతిష్ఠితం తస్మాద్ధర్మం పరమంవదంతి:-**

సమస్త జగత్తుకూ ధర్మమే ఆధారము ధర్మపరులనే లోకులు ఆశ్రయించెదరు. ధర్మము

పాపమును పోగొట్టును. అన్నిటికీ ఉనికి ధర్మమే. అందుచే ధర్మము గొప్పదని చెప్పబడుచున్నది.-

**ధర్మాబహూ విధాలోకే శ్రుతి భేదముఖోద్భవాః**
**దేశధర్మాశ్చదృశ్యంతేకుల ధర్మాస్తథైవచ**
**జాతిధర్మా వయోధర్మా గుణధర్మాశ్చ శోభనే**
**శరీర కాల ధర్మాశ్చ ఆపద్ధర్మాస్తథైవచ॥**
**ఏతద్ధర్మస్యనానాత్వం క్రియతే లోకవాసిభిః॥**

లోకమున ధర్మములనేక విధములుగా యుండును. దీనికి కారణములు వేదములు అనేక విధములుగా యుండుటయే. దేశధర్మములు, కులధర్మములు, జాతి ధర్మములు, వయోధర్మములు, గుణధర్మములు, శరీరధర్మములు, కాలధర్మములు ఆ పద్ధర్మములు మొదలగునవి ఎన్నియో కలవు. లోకులు అనేక ధర్మముల నేర్పరచుకొని వాటిని అనుసరిస్తూంటారు

**వేదః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః**
**ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్॥ (మనుస్మృతి:- 2-12)**

వేదములు, స్మృతులు, సత్పురుషుల నడవడి, ఆత్మకు ప్రియమైనది- ఈ నాలుగున్నూ ధర్మము యొక్క లక్షణములు.

**ధారణాద్ధర్మ మిత్యాహుః ధర్మోధారయతి ప్రజాః**
**ప్రభవార్థాయ భూతానాం ధర్మ ప్రవచన కృతమ్ ॥**

ధరించునది కావున ధర్మము. ధర్మమే ప్రజలను నిలబెట్టుచున్నది. జీవుల ఉత్పత్తి స్థితుల కోసం ధర్మప్రవచనము చేయబడుచున్నది.

**ధృతిః క్షమా దమో2స్తేయం శౌచమింద్రియనిగ్రహః**
**ధీర్విద్యా సత్యమ క్రోధో దశకం ధర్మ లక్షణమ్ ॥**

ధైర్యము, ఓర్పు, మనోనిగ్రహము, పరధనముల నాశింపకుండుట, ఇంద్రియ నిగ్రహము, బుద్ధిమత్వము, విద్య శుచిత్వము, సత్యము, క్రోధములేకుండుట- ఇవి పదియును ధర్మ లక్షణములు (మనుస్మృతి 6-9)

**శ్రుతిర్విభిన్నాః స్మృత యశ్చభిన్నాః మహామునీనాం మతయశ్చభిన్నాః**
**ధర్మస్యతత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గతః సపంథాః ॥**

**శ్రుతులు చెప్పిన మార్గములు భిన్నములు. స్మృతులు కూడా భిన్నములే ఏది ధర్మమో ఏది అధర్మమో నిర్ణయించుట కష్టమైన పని. అందుచే మన పెద్దలు నడచినదే మనకూ మంచి మార్గము.**

**తర్కో2ప్రతిష్ఠశ్శ్రుతయో2పిభిన్నాః నైకోఋషిర్యస్యవచః ప్రమాణమ్**
**ధర్మస్తతత్త్వం నిహితం గుహాయాం మహాజనోయేన గతస్స పంథాః**

తర్కమునకు ఆధారములేదు. ఏవైపులాగితే ఆవైపుకు పడిపోతుంది- శ్రుతులు కూడా భిన్నంగానే ఉన్నవి- ఏ ఒక్కమహర్షి ఆదేశము కూడా ప్రమాణమని చెప్ప వీలులేదు. ధర్మము యొక్క యదార్థతత్త్వము నిగూఢమైనది కావున మహాత్ములైన మనపూర్వులు చనిన మార్గమే మేలు:-

**ధర్మఏవ హతోహంతి। ధర్మోరక్షతి రక్షితః ।**
**తస్మాద్ధర్మో నహంతవ్యో। మానోధర్మోహతో2వధీత్।**

ధర్మమును బాధిస్తే అదే తిరిగీ మనల్ని బాధిస్తుంది. మనము ధర్మాన్ని రక్షిస్తే అదిమనలను రక్షిస్తుంది. కనుక ధర్మమునకు హాని కలిగించరాదు. మీ వినాశమును మీరు కోరరు కదా!-

**సత్యం దమ తపశ్శౌచం। సంతోషోహ్రీః క్షమార్జవమ్।**
**జ్ఞానం శమో దయా ధ్యానం । ఏషధర్మస్సనాతనః॥**

సత్యము, ఇంద్రియ నిగ్రహము తపస్సు, శుచి, సంతోషములజ్జ, ఓర్పు, ఋజుత్వము, జ్ఞానము-మనోనిగ్రహము. దయధ్యానము ఇవియే సనాతన ధర్మములు

**ఊర్ధ్వ బాహుర్వి! రౌమ్యేష నచకశ్చి చ్ఛృణోతి॥**
**ధర్మాదర్థశ్చ కామశ్చ సధర్మః కింన సేవ్యతే-॥**

నేను చేతులెత్తి ఆక్రోశిస్తున్నాను.- కానీ ఈ ఆక్రోశాన్ని ఎవడూ వినడెందుకు? ధర్మము వల్లనే అర్థ కామములు కలుగుచున్నవి. అట్టి ధర్మముల నెవడునూ ఆచరించుట లేదే?

**పరోపదేశే పాండిత్యం। సర్వేషాం సుకరం నృణామ్।**
**ధర్మేస్వయ మనుష్ఠానం। కస్య చిత్తు మహాత్మనామ్॥**

ఇతరులకు ధర్మోపదేశం చేయడంలో అందరూ పండితులే. ధర్మములను అనుష్ఠించడం అరుదుగా ఎవరో మహానుభావులు గానీ చేయలేరు.

**మద్వంశజాః పరమహీపతి వంశజావా యేభూమిపాః సతత నిర్మలధర్మచిత్తాః**
**మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి తత్పాదపద్మ యుగళం శిరసానమామి:-**

నావంశస్థులు గానీ, ఇతర రాజ వంశమువారుగానీ ఎవరు నిరంతరము నిర్మలమైన ధర్మము నాచరించుటలోనే మనస్సునులగ్నము గావించునాధర్మమునసె నడపెదరో అట్టి

మహనీయుల పాదద్వయమునకు తలవంచి నమస్కరించెదను. (శ్రీ రామచంద్రుడు వేయించినదిగా భావింపబడుచున్న రాగిశాసనము)

**జానామి ధర్మం నచమే ప్రవృత్తిః జానామ్యధర్మం నచమే నివృత్తిః**
**కేనాపి దేవేన హృదిస్థితేన యథాప్రవృత్తో స్మితథా కరోమి!!**

నేను ధర్మమును బాగుగ నెరుగుదును. కానీ దానిని నేను చేయను. అధర్మమనగానేమీ నాకు తెలుసును. దాని ఎడ విముఖత లేదు. నా హృదయమున ఏదో దైవముండి నాచే ఈ పనులు చేయించుచున్నట్లున్నది. ఆ దైవమెట్లు చేయమంటే దానినే చేస్తున్నాను- అంతే:-

ఇది దుర్యోధనుడు మహర్షులకు చెప్పిన సమాధానము :- ధర్మాధర్మముల తెలిసి కూడా, పెద్దల మాటలు వినకుండా పాడు పనులు చేసే వారంతా ఈ విధంగానే సమాధానాలిస్తారు.

**మృతం శరీర ముత్సృజ్య! కాష్టలోష్ట సమంక్షితే!**
**విముఖా బాంధవా యాంతి! ధర్మస్తమను గచ్ఛతి!!**

మృతదేహాన్ని ఏదో కొయ్యముక్కనో, మట్టిగడ్డనో పారేసినట్లు, నేలమీద పడవేసి బంధు మిత్రాదులంతా వెనక్కి తిరిగి చూడకుండా పోతారు. మరణించిన వాని వెంట వచ్చేది వాడు చేసిన ధర్మమొక్కటే. (పాప పుణ్యములు):- (మనుస్మృతి=4-24)

**ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే! నారీ గృహద్వారి జనాః శ్మశానే**
**దేహశ్చితాయాం పరలోక మార్గే! ధర్మాను గో గచ్ఛతి జీవ ఏకః!!**

ధనమును భూమిలోను, పశువుల్ని కొట్టమందును, భార్యను ఇంటి వాకిట్లోనూ, జనులను శ్మశానం లోనూ, దేహమును చితి యందును వదలి పెట్టి జీవుడు ఒంటరిగా పరలోక మార్గమున పోవునపుడు ధర్మమొక్కటే అతని వెంట వచ్చేది:-

**క్షణం చిత్తం క్షణం విత్తం! క్షణం జీవిత మావయోః!**
**యమస్య కరుణా నాస్తి! ధర్మస్య త్వరితా గతిః!!**

చిత్త వృత్తులు, సంపదలు, జీవితములు క్షణ భంగురములు-యమునికి జాలి లేదు. ధర్మము యొక్క నడత చాలా వేగమైనది.

**కానీనస్యమునేః స్వసోదర వధూ వైధవ్య విధ్వం సినః నప్తారః**
**కిల గోళకస్య తనయాః కుండాః స్వయం పాండవాః**

**పంచైతేచ సమానయోని నిరతాః ఖ్యాతా జగద్వి శ్రుతాః**
**తచ్చారిత్ర మశేష పాప హరణం ధర్మ స్యసూక్ష్మా గతిః!!**

వ్యాసుడు కన్యాపుత్రుడు సోదరుడైన విచిత్ర వీర్యుని భార్యలు (విధవలు) యందు సంతానాన్ని కలిగించిన వాడు. అట్టి వ్యాసునికి మనుమలైన పాండవులు కుంతులు (తండ్రియుండగా ఇతరులకు పుట్టినవారు.) ఆ పాండవులైదుగురికీ ఒకే భార్య. ఇట్టి లోక విరుద్ధమైన అనుపూర్విగల పాండవులు జగద్విఖ్యాతులు. వారి చరిత్ర వింటే పాపములు నశించును. ఆహా ఎంత విచిత్రము:- ధర్మము యొక్క గతి ఎంత సూక్ష్మమైనది!

**భోజనాత్ పూర్వభాగేచ! భోజనాత్పరత స్తదా**
**క్షణే క్షణే మతిర్భిన్నా! ధర్మస్య త్వరితా గతిః!!**

భోజనం చేయుటకు ముందున్న బుద్ధి భోజనం చేసిన తర్వాత ఉండదు. బుద్ధి క్షణ క్షణమూ మారుతూంటుంది. ఏదయినా ధర్మ కార్యాన్ని తలపెట్టినప్పుడు వెంటనే చేయాలి. లేకపోతే బుద్ధి మారుతుంది.

**ధర్మార్థ కామ మోక్షాణాం! శారీరం సాధనం చయత్!**
**మహతా తత్ప్రయత్నేన! శారీర మిహ పాలయేత్!!**

ధార్మర్థ కామ మోక్షములను పొందుటకు శరీరమే ముఖ్యమైన సాధనము. కావున శరీరమును ఎంత ప్రయత్నము చేసి అయినను చక్కగా కాపాడు కోవలయును.

**నృదేహ మాద్యం సులభం సుదుర్లభం! ప్లవం సుకల్పం గురు కర్ణ ధారమ్!**
**మయాను కూలేన నభస్వ్య తేరితం! పుమాన్ భవాబ్ధిం నతరేత్స ఆత్మహా:!!**

ఎట్లనో మనుష్య దేహం లభించింది. అది అదృష్టమే. ఇట్టి అవకాశం మరలా రాదు. ఇదొక దృఢమైన నావ. కర్ణధారిగా గురువు కలడు. నేనే అనుకూల వాయువునై శ్రుతిమూలకముగా మంచి దారిని నడిపెదను. ఇన్ని అవకాశములుండి కూడా సంసార సాగరాన్ని దాటని మూఢుడు ఆత్మహననయునే చేసుకొనువాడే యగును.

# స్త్రీలు

**జల్పంతి సార్థమన్యేన, పశ్యంత్యన్యం సవిభ్రమాః!**
**హృద్గతం చింత యంత్యన్యం ప్రియః కోనామ యోషితాం!!**

ఒకనితో తీయగా మాట్లాడెదరు. ఒకరిని ఒయ్యారంగా చూచెదరు. ఒకనిని మనస్సులో తలచెదరు. స్త్రీలకు ప్రియుడెవరు?

**స్త్రీణాం ద్విగుణ ఆహారో! బుద్ధిశ్చాపి చతుర్గుణా**
**సాహసం షడ్గుణంచైవ! కామో2ష్ట గుణ ఉచ్యతే!!**

తినడంలో రెండు రెట్లు, బుద్ధిలో నాలుగు రెట్లు, సాహసంలో ఆరురెట్లు కామంలో ఎనిమిది రెట్లు స్త్రీలు కలిగి ఉంటారు.

**ఘృతకుంభ సమానారీ తప్తాంగార సమః పుమాన్!**
**తస్మాత్ ఘృతంచ వహ్నించ నైకత్ర స్థాపయే ద్బుధః!!**

స్త్రీ నేతికుండ వంటిది. పురుషుడు మండుచున్న నిప్పు వంటివాడు. బుద్ధిమంతులు ఆ రెంటినీ ఒక చోట చేర్చరు.

**అగ్నిగుండ సమానారీ, ఘృత కుంభ సమోనరః!**
**సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జ యేత్!!**

స్త్రీ అగ్నిగుండం. పురుషుడు నేతికుండ కనుక అగ్ని వద్దయుండు నేయి కరిగిపోవు నట్లు స్త్రీ దగ్గరయుండు పురుషుని మనస్సు కరిగిపోవును.

**కార్యేషు దాసీ కరణేషు మంత్రీ! రూపేషు లక్ష్మీః క్షమయాధరిత్రీ!**
**స్నేహే చమాతా శయనేతు వేశ్యా! షట్కర్మ యుక్తా కులధర్మ పత్నీ!!**

గృహకృత్యములందు దాసిగాను, కార్యాలోచనయందు మంత్రిగాను, రూప సంపదలందు లక్ష్మిగాను, ఓరిమి యందు భూదేవివలెను, స్నేహమందు తల్లివలెను, కూటమియందు వేశ్యవలెను ప్రవర్తించుటలో నేర్పు గలదియే కులధర్మ పత్నియన నగును.

**యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః!**
**యత్రై తాస్తున పూజ్యంతే సర్వాస్తత్రా2 ఫలాఃక్రియాః!!**

స్త్రీలు పూజింపబడు చోటులందు దేవతలు క్రీడింతురు. స్త్రీలకు గౌరవ మీయబడని చోటులందు జరుగు క్రియలన్నియూ నిష్ఫలములే.

**శతాపరాధై ర్వనితాం! పుష్పేణాపిన తాడయేత్!**
**దోషాన్నగణ యేస్త్రీణాం! గుణానేవ ప్రకాశయేత్!!**

స్త్రీ నూరు తప్పులు చేసిననూ ఆమెను పుష్పముతోనైననూ కొట్టరాదు. వారి దోషముల బైటపెట్టరాదు. సద్గుణములనే వెల్లడి చేయవలెను.

**వనితాయాం తథా శక్ర దురితంనైవ విద్యతే!!**

స్త్రీ యందు పాపమనే పదార్థమే యుండదు.

**పరోపకార పుణ్యాయ పాపాయ పరిపీడనమ్!!**

సర్వ శాస్త్రములు చెప్పేవి రెండే: పరోపకారము పుణ్యము పరులను పీడించుట పాపము.

**గృహే గృహే పుస్తక భార భారం! పురే పురే పండిత యూథ యూథం!**
**మఠే మఠే తాపస బృంద బృందం! నబ్రహ్మవేత్తాన కర్మయుక్తా!!**

ప్రతి యింటిలోనూ పుస్తకాల దొంతరలే-ప్రతి ఊరిలోనూ పంకిత బృందములే . కానీ కలికాలంలో కర్మ కర్తగానీ, బ్రహ్మవేత్తగానీ, కలికంలోకైనా కానరారు. (భవిష్య పురాణం)

**గమ్యతే యది మృగేంద్ర మందిరం! లభ్యతే కరి కపోల మౌక్తికమ్!**
**జంబుకాలయగతే చప్రాప్యతే! వత్స ఖరచర్మ ఖండనమ్!!**

సింహపు గుహలోనికి పోతే గజకుంభాలలోని ముత్యాలు దొరుకును. నక్క గుహలోకి పోతే, గాడిద చర్మ ఖండాలు దొరుకుతాయి.

**వైద్యరాజ నమస్తుభ్యం! యమరాజ సహోదర!**
**యమస్తు హరతి ప్రాణాన్! వైద్యః ప్రాణాన్ ధనానిచ!!**

యముని సోదరా! వైద్యరాజా! నీకు నమస్కారం యముడు ప్రాణాలనే హరిస్తాడు. వైద్యుడు ధనాన్నీ ప్రాణాన్నీ హరిస్తారు.

**ద్వారం ద్వారం అటన్భిక్షుః! శిక్షత్యే వన్మ యాచతే!**
**అతత్వా మాదృశో2 భూత్! దత్వాత్వం త్వాదృశోభవ!!**

భిక్షువు ప్రతిద్వారం ముందట నిలబడి యాచిస్తాడు. అతడు చేయునది యాచః కాదు. మనకు గుణపాఠం చెప్పుచున్నాడు. "పోయిన జన్మలో నేను సంపన్నుడనే యాచకుడికి బిచ్చం పెట్టలేదు. ఈ జన్మలోనాకీ గతిబట్టింది. అట్టి దుస్థితి నీకు కలు/ కుండుగాక"-అని బోధిస్తున్నాడు.

**ఏక ఏవ ద్విధాకర్తుం! బహవస్సన్తి ధన్వినః!**
**మార ఏకోమహా ధన్వీ! ద్వయమేకం కరోత్యసౌ!!**

ఒకటిని రెండుగా చేసే విలుకాండ్రు లోకంలో చాలామంది కలరు. ఇద్దర్ని ఒకటిగా చేసే మహా విలుకాడు మన్మధుడే సుమా.

**సింహోబలీ ద్విరద సూకర మాంసభోజీ! సంవత్సరేణ కురుతే రతి మేక వారం!!**
**పారావత స్తృణ శిఖా కణ మాత్రజీవీ! కామీభవే దనుదినం వదకో2 త్రహేతుః!!**

సింహము బలమైనది. ఏనుగు, పంది మాంసాలను తింటుంది. కానీ ఏడాది కొకసారిమాత్రం కామభోగమనుభవిస్తుంది. పావురము గడ్డి గింజల్ని తినే శాకాహారి అయిననూ నిత్యమూ రతి కార్యం చేస్తూంటుంది. దీనికి కారణమేమో చెప్పు!-

**గతి శీఘ్రీ శిరఃకంపీ తథా లిఖిత పాఠకః!**
**అనర్థ జ్ఞో2 ల్పకం ఠశ్చ షడేతే పాఠకాధమః!!**

రాగాలు తీస్తూ చదివేవాడూ, తొందరగా చదివేవాడూ, తల ఆడించుతూ చదివేవాడూ, చూచి చదివేవాడూ, అర్థం తెలియక చదివేవాడూ, ఈ ఆరుగురూ పాఠకాధములు:

**నభోగ హార్యా నచబంధు హార్యా! నభ్రాతృ హార్యా నచరాజ హార్యా!**
**స్వదేశ మిత్రం పరదేశ బంధుః విద్యాసుధాం యేపురుషాః పిబంతి!!**

విద్యనెంత అనుభవించినను తరగదు. బంధువులు దోచుకోలేరు. దాయాదులకు పొరకనిది. రాజులు కూడా హరించలేరు. స్వదేశంలో స్నేహితుని వంటిది. పరదేశంలో బంధువు వంటిది. అట్టి విద్యా మృతమును సేవించిన వారు ధన్యులుకదా!

**విద్యాదదాతి వినయం! వినయాద్యాతి పాత్రతామ్!**
**పాత్రత్వాద్ధన మాప్నోతి! ధనాద్ధర్మం తతస్సుఖమ్!!**

విద్యవలన వినయము, దానివల్ల పాత్రత, దానివలన ధనము, ధనము వలన ధర్మము- ఆపైన సుఖమును పొందెదరు.

**నచోరహార్యం నచరాజ హార్యం! నభ్రాతృ భాజ్యం నచ భారకారి!**
**వ్యయేకత వర్ధత ఏవ నిత్యం! విద్యాధనం సర్వధనాత్ ప్రధానమ్!!**

విద్యను దొంగలెత్తుకొని పోరు, రాజులు లాగుకొనిపోరు, దాయాదులు పంచుకోలేరు. మోసే దానికి భారం కాదు. వ్యయం చేసేకొద్దీ నిత్యమూ పెరుగుతుంది. కావున సమస్త సంపదల కంటెను విద్యా సంపద శ్రేష్ఠమైనది.

**మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే! కాంతేవ చాభిరమయ త్యపనీయ ఖేదమ్!**
**కీర్తిం చదిక్షు వితనోతి లక్ష్మీం! కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా!!**

విద్య తల్లివలె కాపాడుతుంది. తండ్రివలె హితమునుపదేశిస్తుంది. కాంతవలె శాంతి నిస్తుంది. అన్ని దిక్కులకు కీర్తిని వ్యాపింపజేస్తుంది. అంతటను లక్ష్మిని చేకూర్చుతుంది. కల్పలతవలె కోర్కెలనన్నింటిని సాధించిపెడుతుంది.

**మాతా శత్రుః పితావైరీ! యేన బాలోన పాఠితః**
**నగర్భ చ్యుతి మాత్రేణ! పుత్రోభవతి పండితః!!**

బిడ్డను చదివించని తల్లిదండ్రులు వారికి శత్రువులే- కని పారేసినంతమాత్రాన ఏ పుత్రుడును పండితుడు కాలేడు.

**చితా చింతా ద్వయోర్మధ్యే! చింతానామ గరీయసీ!**
**చితాదహతి నిర్జీవం! చింతా ప్రాణయుతం వపుః!!**

చితా చింతా అను ఈ రెంటిలోనూ చింతయే బహు దారుణమైనది. "చిత" అనునది నిర్జీవమైన దానిని కాలుస్తుంది. కానీ చింత సజీవమైన శరీరాన్నే కాల్చేస్తుంది.

**అసారేఖలు సంసారే! సారం శ్వశుర మందిరమ్!**
**హిమాలయే హరశ్శేతే! హరి శ్శేతే మహోదధౌ!!**

సారహీనమైన సంసారంలో అత్తగారిల్లొక్కటే సారవంతమైనది. అందుచేతనే శివుడు హిమాలయంలోనూ, విష్ణువు పాల సముద్రంలోనూ పండుకొని వుంటారు.

**బంధుః కోనామ దుష్టానాం! కుప్యతే కోన యాచితః!**
**కో2ను తృప్యతి విత్తేన! కుకృత్యే కోన పండితః!!**

దుర్మార్గుడికి బంధువెవడు? యాచించిన వానిపై కోపపడని వాడెవడు? ధనముః తృప్తి పొందిన వాడెవడు. పాడు పనులు చేయుటలో పండితుడు కాని వాడెవడు?.

**ఆరోప్యతే శిలాశైలే! యత్నేన మహతాయథా!**
**నిపాత్యతే క్షణేనా 2ధః! తథాత్మా గుణ దోషయోః!!**

కొండమీదికి గండశిలను ఎక్కించడం ఎంత కష్టమైన పని. దాన్ని క్రిందకు నెట్టడానికి క్షణం పట్టదు. అటులే మానవులకు మంచి గుణాలనెక్కించుట కష్టము. చెడు పనుల్లోకి దించడము చాలా సులభము.

**అనాయాసేన మరణం! వినాదైన్యేన జీవనం!**
**దేహాంతే తవసాయుజ్యం! దేహిమే పార్వతీ పతే!!**

అనాయాస మరణం, దైన్యంలేని జీవనం, ఓ పార్వతీ పతీ! దేహపతనం తర్వాత నీసాయుజ్యం నాకిమ్ము.

**సత్యాను సారిణీ లక్ష్మీః! కీర్తిః త్యాగాను సారిణీ!!**
**అభ్యాసాను సారిణీ విద్యా! బుద్ధిః కర్మాను సారిణీ!!**

లక్ష్మి సత్యమునసరించి ఉంటుంది. కీర్తి త్యాగం వెంట పోతుంది. సాధన వెంట విద్యఅనుసరించి ఉంటుంది. వాడు చేసుకొనిన కర్మననుసరించి బుద్ధిపోతూంటుంది.

ఔషధం సేవించేప్పుడు చెప్పుకోవలసిన మంత్రాలు.

**శరీరే జర్ఝరీ భూతే! వ్యాధిగ్రస్తే కళేబరం!**
**ఔషధం జాహ్నవీ తోయం! వైద్యోనారాయణో హరిః!!**
**అకాల మృత్యు హరణం! సర్వవ్యాధి నివారణమ్!**
**సర్వపాప క్షయకరం! శ్రీ విష్ణోః పాదోదకం పావనం శుభమ్!!**
**వాగ్వాదో అర్థ సంబంధః! పరేషాం దార భాషణమ్!**
**యత్ర మిత్రత్వ మిచ్ఛన్తి! తత్ర త్రీణీన కారయేత్!!**

మిత్రత్వము కోరువారు 1. వాగ్వాదము 2. పైకం లావాదేవీలు 3 ఇతరుల భార్యలగూర్చి మాట్లాడుట- ఈ మూటినీ చేయరాదు:

**కపిరపిచ కాపి శాయన! మదమత్తో, వృశ్చికేన సందష్టః!**
**అపిచపిశా చగ్రస్తః! కిం బ్రూమ స్తస్యవై చిత్ర్యమ్!!**

మనసు కోతి వంటిది. కోతి కల్లు త్రాగింది. దాన్ని తేలు కుట్టింది. పైగా దయ్యం పట్టింది. ఇంక అది చేసే పనులు ఎంత చిత్రంగా యుంటాయే ఎవరు చెప్పగలరు.

మద్యమంటే మదము, తేలు అంటే అసూయ, దయ్యమే అహంకారము. ఇవి

మనస్సులో వుంటే వాడు ఎలా ప్రవర్తిస్తాడో దానికి మందు భగవద్ధ్యానమే:

**నీచాశ్రయో నకర్తవ్యం! కర్తవ్యో మహదాశ్రయః!**
**ఈశాశ్రయే మహానాగాః! ప్రప్రచ్ఛ గరుడం సుఖమ్!!**

నీచుల నాశ్రయించరాదు. గొప్ప వారినే ఆశ్రయించ వలెను. నాగులకు గరుత్మంతు కంటేనే భయం అవి శివుని ఆశ్రయించినవి. గరుత్మంతుడు పరమేశ్వరుని దర్శించడా నికిరాగా అవి గరుత్మంతుని "క్షేమంగా యున్నావా?" అని అడగ గలిగినవి.

**అదాన దోషేణ భవేత్ దరిద్రః! దారిద్ర్య దోషేణ కరోతి పాపం!**
**పాపాదవశ్యం నరకం ప్రయాతి! పునర్దరిద్రః పునరేవ పాపీ!!**

దానం చేయనందున దరిద్రుడై జన్మిస్తాడు. దరిద్ర దోషం వల్ల పాపాలు చేస్తాడు. పాపపు పనుల వల్ల తప్పక నరకానికి పోతాడు. మరలా దరిద్రుడుగానే పుట్టుతాడు. అందువల్ల తిరిగీ పాపి అవుతాడు. కావున తప్పక దానం చేయాలి.

**విద్యా వివాదాయ, ధనం మదాయ! పరేషాం పరపీడనాయ!**
**ఖలస్యసా ధోర్వి పరీత మేతత్! జ్ఞానాయ దానాయచ రక్షణాయ!!**

దుర్మార్గుడికి విద్య వివాదమునకు, ధనము గర్వమునకు, శక్తి పరులను పీడించుటకు ఉపయోగ పడుతుంది. అదే సజ్జనులకైతే, విద్యా విజ్ఞానమునకును, ధనము దానమునకును., శక్తి పరులను రక్షించుటకును ఉపయోగపడుతుంది.

**ఉద్యమేన హిసిద్ధ్యన్తి! కార్యాణి నమనోరథైః!**
**నహిసుప్తస్య సింహస్య! ప్రవిశంతి ముఖేమృగాః!!**

ప్రయత్నము వలననే కార్యములు నెరవేరుతాయి. కానీ కోరికల చేత మాత్రమే కాదు. నిద్రపోయే సింహము వద్దకు వచ్చి తమను ఆహారంగా భుజింపుమని దానిని కోరవుగదా?

**కాకః కృష్ణః పికః! కృష్ణః కోభేదః పిక కాకయోః!**
**వసంత కాలే సంప్రాప్తే! కాకః కాకః పికః పికః!!**

కాకి, కోకిల, రెండూ నల్లనివే. వసంతకాలం వచ్చికూస్తే ఏది ఏదో తెలిసిపోతుంది. వాటి గొంతును బట్టి భేదం తెలిసిపోతుంది సులభంగా.

**హంస శ్శుక్లో బకశ్శుక్లః! కోభేదః బకహంసయోః!**
**నీరక్షీర విభాగేతు! హంసో హంసః బకోబకః!!**

హంస, కొంగ రెండూ తెల్లనివే అయినా వాటికి భేదం వుంది. ఎలాగంటే పాలూ, నీళ్లూ కలిపి వాటి ముందు వుంచితే హంస ఆ రెంటినీ వేరు చేయగలదు. కానీ కొంగ చేయలేదు.

**నాస్తిచేత్ నాస్తినో హానిః! అస్తి చేత్ నాస్తికోహానిః!!**

పరమాత్మలేకుంటే నీతిగా ధర్మంగా నడచుకొనే మాకే హానియులేదు. ఆ పరమాత్మ వుంటే నాస్తికునికే హాని.

**పరస్యనిందా పైశున్యం! ధిక్కారంచ కరోతి యః!**
**తత్కృతం పాతకం ప్రాప్య! స్వపుణ్యం ప్రదదాతి సః!!**

ఎవరన్యులను నిందింతురో, చాడీలు చెప్పుదురో, అవమానించెదరో వారు అన్యులు చేసిన పాపములను పొంది, తాము చేసిన పుణ్యములను వారి కిచ్చుచున్నారు.

**జకారో జన్మ విచ్ఛేదః! పకారం పాప నాశనః!**
**జన్మచ్ఛేదకరో యస్మా! జ్జప మిత్యభిదీయతే!!**

జకారము జన్మనాశమును కలిగించును. ప కారము పాప నాశముగా వించును. అందుచేత అది జపమనబడుచున్నది.

**యదభావి నతద్భావి! భావిచేన్నత దన్యథా!**
**ఇతి చింతా విషఘ్నో 2యం! బోధో భ్రమ నివర్తకః!!**

ఏది జరుగనేరదో అది జరుగనే జరుగదు. జరిగేది ఏలానూ జరిగి పోతుంది అనే చింతారూపమగు విషమును నశింపజేసి భ్రాంతిని తొలగించునట్టిదీ జ్ఞానబోధ:

**శైలే శైలే నమాణిక్యం! మౌక్తికం న గజే గజే!**
**సాధవోనహి సర్వత్ర! చందనం నవనే వనే!!**

అన్నీ రాళ్ళే. మాణిక్యం అరుదు.., అన్నీ ఏనుగులే, కుంభస్థలంలో ముత్యాలుండేవి అరుదు. అన్నీచెట్లే-శ్రీగంధం చెట్లు అరుదు. సాధకులు చాలా మంది యున్నారు. కానీ అనుష్ఠానం కలవాళ్ళు అరుదు.

**గురవో బహవస్సంతి! శిష్యవిత్తాప హారకాః!**
**తమేకం దుర్లభం మన్యే! శిష్య హృత్తాప హారకాః!!**

శిష్యుల విత్తాన్ని హరించే గురువులనేకమంది యున్నారు. శిష్యుల హృదయ తాపమును పోగొట్టే గురువులు దుర్లభులు:-

**కృష్ణో జానాతి వై సమ్యక్! క్వచిత్ కౌంతేయ ఏవచ!**
**వ్యాసోవా వ్యాసపుత్రోవా! యాజ్ఞవల్క్యో2 థమైథిలః!!**

శ్రీ కృష్ణుడే గీతార్థమును బాగుగ ఎరిగిన వాడు. కానీ అర్జునుడు, వ్యాసుడు, శుకుడు యాజ్ఞవల్క్యుడు జనకుడు కొంత మాత్రమే ఎరిగిన వారు.

**అళీనళి వృశ్చిక వేణురంభా! వినాశ కాలే ఫలముద్భవంతి!**
**యథాతథా సజ్జన దుర్జనానాం! వినాశకాలే విపరీత బుద్ధిః!!**

తుమ్మెద, నళి, తేలు, వెదురు, అరటి వినాశ కాలమున ఫలముల కలుగజేయును. అట్లే సుజన దుర్జనులకు వినాశ కాలమున విపరీత బుద్ధులు కలుగచుండును.

**అనే కాని చశాస్త్రాణి! స్వల్పాయు ర్విఘ్న కోటయః!**
**తస్మాత్ శాస్త్రం విజానీయాత్! హంసక్షీర మివాంభసి!!**

శాస్త్రాలు అనేకం ఆయుస్సు స్వల్పం . విఘ్నాలు అనేకం పాలను నీటినుండి హంస వేరుచేసినట్లుగా, శాస్త్రసారమును గ్రహించుటకు వీలుగా మహాత్ముల నాశ్రయింప వలెను:

**అర్థాతురాణాం నగురు ర్నబంధుః! కామాతురాణాం నభయం నలజ్జా!!**
**విద్యాతురాణాం నసుఖం ననిద్రా! క్షుధాతురాణాం నరుచిర్న పక్వం!**

లోభికి గురవనీ బంధువనీ లేదు. కామాతురునికి భయమూ లజ్జాలేవు. విద్యాసక్తునికి నిద్రగానీ సుఖముగానీ అక్కరలేదు. ఆకలిగొన్నవానికి, రుచీపక్వము పనిలేదు.

**గంగా పాపం శశీతాపం! దైన్యం కల్పతరుస్తథా!**
**పాపం తాపంచ దైన్యంచ! హరతి సజ్జన దర్శనమ్!!**

గంగ పాపాన్నీ, చంద్రుడు తాపాన్నీ, కల్పవృక్షం దైన్యాన్నీ మాత్రం తొలిగిస్తాయి. కానీ సజ్జన దర్శనంతో ఈ మూడూ పోతాయి.

**కర్తా కారయితా చైవ! ప్రేర కశ్చాను మోదకః!**
**పుణ్యకార్యే పాప కార్యే! చత్వారస్సమ భాగినః!!**

చేయించువాడు, చేయువాడును, ప్రేరణ చేయువాడును చూచి సంతోషించు వాడును, ఈ నలుగురు పుణ్యకార్యములందు కానీ పాప కార్యములందు కానీ సమభాగస్తులగుచున్నారు.

**మాత్రాస్వస్రా దుహిత్రావా! నవివిక్తా సనోభవేత్!**
**బలవానింద్రియగ్రామో! విద్వాంసమపి కర్షతి!!**

తల్లితోనైననూ, కుమార్తెతోనైననూ, సోదరితోనూ వివిక్త దేశమున యుండరాదు. ఇంద్రియ సమూహము చాలా బలమైనవి. బ్రహ్మనిష్ఠని గూడ మోపింపజేయగలవి.

**గతాను గతి కోలోకో! నలోకః పారమార్థికః!**
**సేతౌ సైకతలింగేన! వినష్ట స్తామ్ర భాజనమ్!!**

ఒక యతీశ్వరుడు సముద్ర స్నానానికి పోయి తనచేతిలోని రాగి చెంబును, ఇసుకలో గుంటతీసి, దాని నందులో పెట్టి, గుర్తుకోసం దాని మీద ఇసుకను కుప్పగా చేసెను. వెనుక వచ్చిన వారు పాత్రను చూడలేదు. లింగాకారంలో ఉండే కుప్పను మాత్రం చూచినారు. అందరూ ఇసుక లింగాల్ని చేసి స్నానానికి పొయ్యారు. యతీశ్వరుడు స్నానం ముగించుకొని వచ్చిచూస్తే అన్నీలింగాలే. తనరాగి చెంబు ఏ లింగం క్రింద ఉందో!

**పుణ్యస్యఫల మిఛ్ఛన్తి! పుణ్యం నేఛ్ఛన్తి మానవాః!**
**నపాపఫల మిచ్ఛన్తి! పాపం కుర్వన్తి యత్నతః!!**

పుణ్యఫలాలు కావాలి-కానీ పుణ్యంచేయరు. పాపఫలములను కోరరు. అదే పనిగా పాపాలు చేస్తాము. పుణ్యఫలము సుఖము, పాప ఫలము దుఃఖము.

**విశ్వామిత్ర పరాశర ప్రభృతయో! వాతాంబు పర్ణాశనా!**
**తే2పిస్త్రీ ముఖపంకజం సులలితం! దృష్ట్వై వమోహం గతాః!**
**శాల్యన్నం, సఘృతం పయోదధియుతం! భుంజన్తి యేమానవాః!**
**తేషా మింద్రియ నిగ్రహోయదిభవే! ద్వింధ్యః ప్లవేత్సాగరే!!**

వాయు జల ఫల పత్రాదులను ఆహారంగా తీసుకొనిన విశ్వామిత్ర పరాశరాదులే స్త్రీల ముఖపద్మములను జూచి మోహంలో పడిపొయ్యారు. మంచి వరి అన్నము, పాలు,

పెరుగు, నెయ్యితినే మానవులు ఇంద్రియాలను నిగ్రహించ గలిగితే, వింధ్యపర్వతం కూడా సముద్రంలో తేలుతుంది:

**పరనిందా సమం పాపం! నాస్తీహ పృథిదీతలే!!**

పరనిందకు మించిన పాపం ఈ లోకంలోలేదు.

**జాతః బ్రహ్మకు లే2గ్రజో! ధనపతి ర్యత్కుంభకర్ణో 2నుజః!**
**పుత్రం శక్రజయీ, స్వయా! దశశిరః పూర్ణా భుజావింశతిః!!**
**దైత్యః కామచరోరథో స్యవిజయీ! మధ్యే సముద్రం గృహమ్!!**
**సర్వం నిష్ఫలితం తథైవ విధివా దైవబలే దుర్బలే!!**

పుట్టింది బ్రహ్మకులంలో కుబేరుడు అన్న కుంభకర్ణుడు తమ్ముడు ఇంద్రుని జయించినవాడు కొడుకు. పది తలలుండేవాడు. బలమైన ఇరవై చేతులు గలవాడు. పైగా కామరూపధరుడు దితి కొడుకు అప్రతిరథుడు సముద్ర మధ్యంలో ఇల్లు అయినా రావణుడు దైవబలం లేనందున అన్నీ నిష్ఫలములై పోయినవి.

**జాతః సూర్యకులే, పితాదశరథః! భూమౌచ భూపాగ్రణీ!**
**సీతాసత్య పరాజితా భగవతీ! భ్రాతా 2నుగో లక్ష్మణః!**
**దోర్దండస్ప మరే, పినాక విజయీ! ప్రత్యక్ష విష్ణు స్స్వయం!**
**సర్వం నిష్ఫలితం తథైవ విధినా! దైవేబలే దుర్బలే!!**

పుట్టింది సూర్యవంశంలో తండ్రి దశరథుడు, రాజులకెల్ల శ్రేష్ఠుడు పూజ్యురాలైన, అగ్ని చేత పరిపూత అయిన సీతకు భర్త లక్ష్మణుడు సోదరుడు. శివధనస్సును విరిచినవాడు. సాక్షాత్తు విష్ణువే:- దైవ బలం తగ్గినప్పుడు సర్వము నిష్ఫలమే.

**రత్యంతరే మూత్ర పురీష యోర్వా! చండాల వేశ్మన్య థవాస్మశానే!**
**కృతప్రయత్నో 2ప్యకృత ప్రయత్నః! సదాస్మరేత్కే శవనామ ధేయమ్!!**

రతికాలంలో కాని, మలమూత్ర విసర్జన సమయంలో కాని, మాల పల్లెలో గానీ, స్మశానంలో కానీ, శుచిగాకానీ, అశుచిగా కానీ, కేశవ నామస్మరణ చేయవచ్చును.

**పృథివ్యాం యాన్తి భూతాని! జిహ్వోపస్థ నిమిత్త కమ్!**
**జిహ్వోవస్థ పరిత్యాగే! కోనముచ్యేత బంధనాత్!!**

**(పాఠాంతరము= "పృథివ్యాం కింప్రయోజనమ్")**

ప్రాణి జాతమంతా జిహ్వోప స్థల నిమిత్తమై యుండునవియే. వాటిని వదలుకొనినచో

బంధమునుండి ఎవడు విడవడడు?

**ఇంద్రియా భ్యామ జయ్యా భ్యాం! ద్వాభ్యామేవ హతంజగత్!**
**అహో ఉపస్థ జిహ్వాభ్యాం! బ్రహ్మాది మశకావధి!!**

బ్రహ్మమొదలు దోమవరకు సర్వప్రాణులు జయింపబడని గుహ్యాజిహ్వేంద్రియముల రెంటిచే హతమొనర్ప బడుచున్నవి. ఆహా! ఎంత ఆశ్చర్యము?

**ఇంద్రియేషుచ సర్వేషు వాగుపస్థా మహాబలౌ**
**ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యో గి విశేషతః**

ఇంద్రియములన్నింటిలోనూ జిహ్వేంద్రియగు హ్యేంద్రియములు మహాబలము గలవి. అందువల్ల యోగి యైనవాడు మొట్టమొదట వాటిని జయించుటకు విశేషమైన కృషి చేయవలయును

**శుద్ధి ద్వయం మహత్కార్యం దేవానామపి దుర్లభమ్**
**కౌపీన శుద్ధిః ప్రథమా వాక్యశుద్ధి రనంతరా:-**

దేవతలకు కూడా ఈ మహత్కార్యమగు శుద్ధి ద్వయము చాలా కష్టము మొదటిది కౌపీన శుద్ధి రెండవది వాక్ శుద్ధి:- ఇవి లేనందున మహామోహంలో పడిపోతారు.

**శ్రుతం సత్యం తపశ్శీలం విజ్ఞానం విత్తమున్నతిమ్**
**ఇంధనీకురుతే మూఢః ప్రవిశ్య వనితా నలమ్**

మూఢుడైన వాడు శాస్త్రశ్రవణము సత్యము, తపస్సు, సౌశీల్యము, విజ్ఞానము, ధనము, ఉన్నతిని స్త్రీయైన అగ్నిలో ప్రవేశించి కట్టెలవలె కాల్చివేయుచున్నాడు.

**యుక్తి యుక్తము పాదేయం! వచనం బాలకాదపి!**
**అన్యతృణ వత్త్యాజ్యం! అప్యుక్తం పద్మజన్మనా!!**

యుక్తి యుక్త మగుచో బాలకుని వచనమైననూ గ్రహించవలెను. తద్విరుద్ధమగుచో బ్రహ్మదేవుని వాక్యమును కూడా త్యజించవలయును.

**ఆత్మబుద్ధి సుఖంచైవ! గురుబుద్ధిర్వి శేషతః!**
**పరబుద్ధి ర్వినాశాయ! స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః!!**

తన స్వంత బుద్ధి సుఖాన్నిస్తుంది. గురువుల బుద్ధి మేలైనది. ఇతరుల సలహాలు నాశాన్నిస్తాయి. స్త్రీ బుద్ధి ప్రళయాంతకం.

**ఆహార నిద్రాభయ మైధునంచ! సామాన్యమేతత్ పశుభిర్న రాణామ్!!**
**జ్ఞానం నరాణా మధికం విశేషం! జ్ఞానేన హీనః పశుభిస్సమానః!!**

ఆహార నిద్రాభయమైధునము ఇవి మనుష్యులకు పశువులకు సమానమే. కానీ మనుష్యులకు జ్ఞానం అనే విశేష గుణమొకటి కలదు. ఆ జ్ఞానములేని వాడు పశువుతో సమానం.

**యోజనానాం సహస్రాణి! యాతిగచ్ఛన్ పిపీ లికమ్!**
**అగచ్ఛన్ వైనతేయో2పి! పదమేకం నగచ్ఛతి!!**

నడిచేదానికి ప్రయత్నించి చీమ నడుస్తూ నడుస్తూ వేలకొలది యోజనములు పోగలదు. పోవుటకు ప్రయత్నించని గరుత్మంతుడు ఒక్క అడుగు కూడా ముందుకు పోలేడు.

**దయాసమం నాస్తి పుణ్యం! పాపం హింసా సమం నహి!**
దయకు సమానమైన పుణ్యం! హింసకు సమానమైన పాపం-లేదు

**!!"నారాయణత్వం తోషేణ! శోకేన నరతా భవేత్"!!**
నవ్వేవాడు నారాయణుడు; ఏడ్చే వాడు నరుడు.

**జ్ఞానం వ్యర్ధం అనాచారం** = ఆచరణలేని జ్ఞానం వృధా
**"శివాజ్ఞానం వినాకాపి సీమానయాతి"** = శివుడి ఆజ్ఞలేనిదే చీమకూడా కదలదు.
**"ఆదానంహి విసర్గాయ సతాం వారి ముచాం ఇవ"**= సత్పురుషుల సంపత్తి త్యాగం కోసమే. మేఘాలు నీరు సంపాదించేది వర్షించుటకే కదా!

**" పరోప కారాయ సతాం విభూతయః"**
మంచివారి సంపద పరోప కారార్థమే.

**"మిత భాషా సుఖాయ స్యాత్ అతి భాషా మతేఃహృతే"!**
మిత భాష అతి సుఖము, అతి బాష మతికే హాని

**వృశ్చికస్య విషం పుచ్ఛం! మక్షికస్య విషం శిరః!**
**తక్షకస్య విషం దంష్ట్రో! సర్వాంగం దుర్జనే విషమ్!!**

తేలుకు కొండెలో, కందిరీగకు తలలో, పాముకు కోరల్లో విషం ఉంటుంది. ఖలునకు నిలువెల్ల విషముంటుంది.

**నజాతి ర్నకులం తాత! నస్వాధ్యాయం శ్రుతం నచ!**
**కారణాని ద్విజత్వస్య! వృత్త మే వాస్య కారణమ్!!**

వత్సా! జాతి,కులం, వేదాధ్యయనం, పాండిత్యం మున్నగునవేవి బ్రాహ్మణత్వానికి కారణాలు కావు- ప్రవర్తన మొకటియే దానికి కారణము:-

**నయోనిర్నాపి సంస్కారో! నశ్రుతం నచ సంతతిః!**
**కారణాని ద్విజత్వస్య! వృత్తమే వాస్య కారణమ్!!**

బ్రాహ్మణత్వమునకు పుట్టుక కానీ, సంస్కారము కానీ, పాండిత్యము కానీ, సంతతి కానీ కారణము కాదు. నడవడి యొక్కటియే దానికి కారణము.

**జన్మనా జాయతే శూద్రః! కర్మణా జాయతే ద్విజః!**
**వేద పాఠంతు విప్రాణాం! బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః!!**

అందరూ జన్మతో శూద్రులే. వారు కర్మలచే ద్విజులగుచున్నారు. వారిలో వేదాధ్యయనంతో విప్రులగుచున్నారు. బ్రహ్మజ్ఞానాన్ని పొంది బ్రాహ్మణులగుచున్నారు.

**కృష్ణో భోగీ శుకస్త్యాగీ! నృపౌజనక రాఘవౌ!**
**వసిష్టః కర్మ కర్తాచ! పంచైతే జ్ఞానినః సమాః!!**

శ్రీకృష్ణుడు భోగి, శుకుడు త్యాగి, జనకుడు శ్రీరామచంద్రుడు మహారాజులు. వసిష్టుడు కర్మలకు కర్త. ఈ ఐదుగురూ ఆత్మవేత్తలే.

**నధనం నజనం నసుందరీం! కవితాంవా జగదీశ కామయే!**
**మమ జన్మని జన్మనీశ్వరో! భవతాత్ భక్తి రహైతు కీత్వయి!!**

జగదీశా! నాకుధనం, బంధువులు, సుందరులు, కవితావైభవములు వద్దు నాకు జన్మ జన్మలలోనూ నీయందు నిర్హేతుక భక్తి ప్రసాదించు:-

**దేహో దేవాలయః ప్రోక్తః! జీవోదేవో సనాతనః!**
**త్యజేద జ్ఞాన-నిర్మాల్యం! సోహం భావేన పూజయేత్!!**

శరీరమునే దేవాలయముగానూ, దానిలో జీవుని దేవుని గానూ భావించుతూ మనస్సులోని అజ్ఞానమనే నిర్మాల్యాన్ని తొలగించుకోవాలి. సోఽహం నేనే ఆ పరబ్రహ్మము అను భావంతో నిరంతరం మననం చేసుకొంటూ ఉండాలి.

**అరక్షతి తిష్ఠతి దైవరక్షితం! సురక్షితం దైవ హతం వినశ్యతి!**
**జీవత్యనా థోపి వనేవిసర్జిత ! కృతప్రయత్నో ఽపి గృహేన జీవతి!!**

దైవానుగ్రహమున్నచో ఇతర రక్షణలు లేకున్నను జీవించును. దైవోపహతుడు ఎంతటి సురక్షిత ప్రాంతములో యున్నను నశించియే తీరును. అడవిలో దిక్కులేని చోట పారవేసిననూ వాడు బ్రదికి బాగున్నాడు. గృహమున సురక్షణలో యున్నానూ మనకు దక్కక పోవుచున్నాడు. దీనికి కారణము మనకు తెలియని ఏదో మహాశక్తియే కదా!

**ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం రాత్రౌతదర్థం గతమ్!**
**తస్యార్థస్య పరస్యచా2ర్థ మపరం బాలత్వ వృద్ధత్వయోః!**
**శేషం వ్యాధి వియోగ దుఃఖ సహితం సేవాది భిర్నీయతే!**
**జీవే వారితరంగ చంచల తరేసౌఖ్యం కుతః ప్రాణినామ్!!**

నరుల ఆయుర్దాయము నూరేండ్లు. అందులో సగం రాత్రి అందులోనూ మరల సగభాగం బాల్యవార్థక్యాలు-మిగిలిన దాంట్లో కొంత రోగాలతో బాధలతోనూ, బంధు మిత్రుల వియోగ భారంతోనూ, పరదాస్య కష్టాలతోనూ, గడచిపోవును. నీటి కెరటముల వలె క్షణ భంగురమైన జీవితములో ప్రాణులకు సుఖమెక్కడిది?

**త్యజేత్ క్షుదార్తా మహిళాపి పుత్రం! ఖాదేత్ క్షుధార్తా భుజగీ స్వమండం!**
**బుభక్షితః కిం నకరోతి పాపం! క్షీణా నరా నిష్కరుణా భవంతి!!**

ఆకలి బాధతో తల్లి బిడ్డనైననూ వదలి వేస్తుంది. ఆకలిగొన్న ఆడ పాముతన గ్రుడ్లనే మ్రింగివేస్తుంది. ఆకలిగొన్న వాడు ఏ పాపం చేయడు? శుష్కించిన మనుష్యులలో కరుణ కూడా ఇంకిపోతుంది.

**కింకింకరోతి నప్రాజ్ఞః! ప్రేర్యమాణ స్వకర్మభిః!**
**ప్రాగేవహి మనుష్యాణాం! బుద్ధిః కర్మాను సారిణీ!!**

తాను చేసిన పనుల వల్లనే ప్రాజ్ఞుడు చేయనిదేమున్నది. మొదట్లోనే మనుష్యుల బుద్ధులు కర్మల బట్టియే నియతములగు చున్నవి గదా!

**వ్యాధస్యా చరణం ధ్రువస్యచ వయో విద్యా గజేంద్రస్యకా!**
**కుబ్జాయాః కిము నామరూప మధికం కింవా సుదామ్నో ధనమ్!**
**వంశః కోవిదురస్య యాదవ పతే రుగ్రస్య కిం పౌరుషం!**
**భక్త్యాతుష్యతి కేవలం నచగుణైః భక్తప్రియో మాధవః!!**

గుహుని నడవడి ఎట్టిది? ధ్రువుని వయసెంత? గజేంద్రుని చదువేపాటిది? కుబ్జ సౌందర్యమెంతటిది? కుచేలుడు ధనవంతుడా? విదురుని అభిజాత్య మెట్టిది? యాదవ పతి ఉగ్రసేనుని పౌరుషమెంతటిది? వీరందరి గుణ దోషములెట్టివైనను

మాధవుడు వీరందరిఎడ ఎంతో ప్రేమను జూపెను గదా! భక్త ప్రియుడైన మాధవుడు కేవలము భక్తినే జూచును గానీ, ఇతర గుణములను చూడడు.

**జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీః! జిహ్వాగ్రే మిత్ర బాంధవాః!**
**జిహ్వాగ్రే బంధన ప్రాప్తిః! జిహ్వాగ్రే మరణం ధ్రువమ్!!**

మన నాలుక చివరనే లక్ష్మియున్నది. (మంచి మాటలతోనే సంపద లభించున అటులనే మాటలచేతనే బంధు మిత్రాదులేర్పడు చున్నారు. మాట..నే బంధమేర్పడుతుంది. తుదకు మాటల వల్లనే మరణము ప్రాప్తిస్తుంది.

**దాతా దరిద్రో కృపణో ధనాఢ్యః! పాపీ చిరాయుః సుకృతీ! గతాయు**
**రాజా2 కులీనః సుకు లీచభృత్యుః! కలౌ యుగే షడ్గుణమాత్ర యంతి!!**

దాతకు ధనముండదు లోభికి ధనముంటుంది. పాపికి చిరాయువు. పుణ్యాత్ముడు అల్పాయువు. హీనకులుడు రాజు. ఉత్తమ కులజుడు సేవకుడగుట: ఈ ఆరు లక్షణములు కలియుగంలో యుంటాయి.

**హరిణాపి హరేణాపి! బ్రహ్మణాపి సురైరపి!**
**లలాట లిఖితా రేఖా! పరిమార్ష్టుం నశక్యతే!!**

నుదటి వ్రాతను చెరుపుటకు బ్రహ్మ విష్ణు, మహేశ్వరులకు గానీ దేవతలకు గానీ సాధ్యము కాదు.

**కాకస్య చుంచు యది హేమయుక్తో! మాణిక్య యుక్తౌ చరణౌ చతస్య!**
**ఏకైక పక్షే గజరాజ ముక్తా! తథాపి కాకః నచరాజ హంసః!!**

కాకిని పట్టి దాని ముక్కుకు బంగారు తావి! కాళ్లకు మాణిక్యాలను పొదిగి, రెక్కలకు ముత్యాలు చుట్టించినను, అది కాకిగనేయుండును. కానీ అది హంస కానేరదు.

**కృషితో నాస్తి దుర్భిక్షం! జపతో నాస్తి పాతకః!**
**మౌనేన కలహో నాస్తి! నాస్తి జాగరతో భయః!**

కృషి వలన క్షామముండదు. జపము చేసినచో పాతకములు పోవును. మౌనంవల్ల జగడాలు రావు. మేల్కొనివుంటే భయంలేదు.

**నజాతు కామః కామానాం! ఉపభోగేన శామ్యతి!**
**హవిషా కృష్ణ వర్త్మేవ! భూయ ఏవా2 భి వర్థతే!!**

కోరికలను అనుభవించుట వల్ల ఎన్నింటికినీ ఉపశమింపవు. నెయ్యిపోసే కొద్దీ అగ్ని

ప్రజ్వరిల్లునట్లు, అనుభవించిన కొలదీ విషయములందలి కోరికలు పెరుగుచూనే యుండును.

**రామే ప్రవ్రజనం, బలేర్నియమనం, పాండోస్సు తానాంవనం!**
**వృష్ణీనాం, నిధనం, నలేచ నృపతౌ, రాజ్యాత్పరి భ్రంశనమ్!**
**కారాగార నిషేవణం చమరణం! సంచింత్య లంకేశ్వరే!**
**దృష్ట్వా రాజ్య విడంబినా దుపగతం! దుఃఖం నతద్వాంఛతి!!**

శ్రీరామచంద్రుడు అడవులలో సన్న్యాసిగా తిరుగుట, బలి చక్రవర్తి బంధితుడగుట, పాండవులు అరణ్యముల పాలగుట, నల చక్రవర్తి రాజ్యభ్రష్టుడగుట, లంకేశ్వరుడైన రావణుడు, చెరసాలలో బంధింపబడుట, చంపబడుట వీటి నన్నింటినీ చూచి రాజ్యము వల్లనేకదా ఇట్టి దుర్గతియని తెలుసుకొని ఎవడు రాజ్యాధిపత్యమును కోరును?

**పురుషా బహవో రాజన్! సతతం ప్రియ వాదినః!**
**అప్రియస్య చపథ్యస్య! వక్తా శ్రోతాచ దుర్లభః!!**

రాజా! ఎప్పుడూ తీయగా మాట్లాడే వారెందరో యుంటారు. కానీ అప్రియమే అయిననూ, హితము పథ్యము వంటి మాటలను చెప్పువారు కానీ-వాటిని వినేవారు కానీ అరుదు కదా (భారతం)

**కన్యా వరయతే రూపం! మాతావిత్తం పితాశ్రుతం!**
**బాంధవాః కుల మిచ్ఛంతి! మృష్టాన్న మితరేజనాః!!**

కన్య వరుని రూపాన్ని కోరుతుంది. కన్య తల్లి ధనాన్ని కోరుతుంది. తండ్రి వరుని విద్యను చూస్తాడు. బంధువులు కులాన్ని కోరుతారు. ఇతరులు మృష్టాన్నాన్ని కోరుకొంటారు

**నాభోక్తం క్షీయతే కర్మ! కల్ప కోటి శతైరపి!**
**అవశ్యమను భవోక్తవ్యం! కృతం కర్మ శుభా శుభమ్!!**

ఎన్నికల్పములు గడచిననూ చేసిన పుణ్యాపాప కర్మల ఫలములననుభవించ వలసినదే. కర్మకు ప్రతిఫలముండియే తీరును.

**మతయో యత్రగచ్ఛన్తి! తత్రగచ్ఛన్తి వానరాః!**
**శాస్త్రాణి యత్ర గచ్ఛన్తి! తత్ర గచ్ఛన్తి తేనరాః!!**

మతులు పోయేచోట్ల కల్లా పొయ్యేవి కోతులు-శాస్త్రములు చూపిన దార్లలో పోవువారే నరులు:- (మతి మూలమున జ్ఞానమును క్రోడీకరించి తరతరముల అనుభవ జ్ఞానము సూత్రీకరించి చెప్పినవే శాస్త్రములు)

**ఆదిత్య చంద్రా వనిలో 2నలశ్చ! ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ!**
**అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే! ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్!!**

సూర్యుడు, చంద్రుడు, భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, హృదయము, యముడు రాత్రింబగళ్ళు, ఉభయ సంధ్యలు, ధర్మము ఇవన్నీయును మానవుని ప్రవర్తనను గమనించుచునే ఉంటాయి. (ఎవరూ చూడలేదని పాపములు చేయరాదు).

**అహింసా ప్రథమం పుష్పం! పుష్పమింద్రియ నిగ్రహః!**
**సర్వభూతదయా పుష్పం! క్షమాపుష్పం విశేషతః!**
**శాంతిః పుష్పం తపఃపుష్పం! ధ్యాన పుష్పం తథైవచ!**
**సత్య మష్టవిధం పుష్పం! విష్ణోః ప్రీతికరం భవేత్!!**

అహింస, ఇంద్రియనిగ్రహము, సర్వభూతములందు దయ; క్షమ, శాంతి, తపము, ధ్యానము, సత్యము-ఈ ఎనిమిది గుణములున్నూ విష్ణుదేవునికి అత్యంత ప్రీతి కరమైన పుష్పములు ఈ పూలతో పూజించినచో విష్ణువుకు తృప్తి కానీ ఇతరపూలతో కాదు:-

**ఆశాయాః యేదాసాః తే సర్వలోక స్యదాసాః!**
**ఆశాదాసీ యేషాం తేషాం దాసాయ తేలోకాః!!**

అశకు దాసులైన వారు లోకములన్నింటికీ దాసులే.-ఆశను దాసిగా చేసికొనిన వారికి లోకమంతా దాసీభూత మవుతుంది.

**వనేరణే శత్రు జలాగ్ని మధ్యే! మహార్ణవే పర్వత మస్తకేవా!**
**సుప్తం ప్రమత్తం విషమ స్తితంవా! రక్షంతి పుణ్యాని పురాకృతాని!!**

అడవిలో, యుద్ధరంగంలో. శత్రువుల మధ్యా, కార్చిచ్చులోనూ, నీటిలో, సముద్రమలో, కొండశిఖరాన, ఎక్కడ ఉండనీ, ఏ అవస్థలో యుండనీ, నిద్రలోవున్నా, మేల్కొని వున్నా, విషమావస్థలో యుండినా, ఎలా ఉన్నా, పురాకృత పుణ్యముంటే వాడు రక్షింపబడుతాడు.

**నాస్తి కామ సమోవ్యాధిః! నాస్తి మోహస మోరిపుః!**
**నాస్తి క్రోధస మోవహ్నిః! నాస్తి జ్ఞానాత్పరం సుఖం!!**

కామం వంటి వ్యాధి, మోహమువంటి శత్రువు, కోపానికి సమమైన అగ్ని-జ్ఞానము కన్న సుఖము వేరేలేదు.

**నరకాయతే మతిశ్చేత్! పౌరోహిత్యం సమాచర!**
**వర్షం యావత్కి మన్యేన! మఠచింతాం దినత్రయమ్!!**

నీకు నరకానికి పోవాలని వుంటే ఒక ఏడాది పాటు పౌరోహిత్యంచేయి. అంతకాలం వుండడానికి నాకు ఓపిక లేదంటావా మూడురోజుల పాటు మఠాధిపత్యంచేయి. నరకానికి పోతావు.(మఠాధిపతులు పురోహితులు తప్పక నరకానికి పోతారు)

**అశ్వాలంభం గవాలంభం! సన్న్యాసం పలపై తృకమ్!**
**దేవరాచ్చ సుతోత్పత్తిః! కలౌ పంచ విసర్జయేత్!!**

అశ్వమేధము, గోమేధము, సన్న్యాసం, పితృకర్మలలో మాంసము పెట్టుట, దేవరవలన పుత్రుని కనుట ఈ ఐదున్నూ కలియుగమున నిషిద్ధము:-

**శుష్క వేదాన్తినః కేచిత్! భిక్షుకా విఘ్న దేవతాః!**
**చరన్తి బ్రహ్మ విద్యాయాః! మాగచ్ఛన్తుము ముక్షువః!!**

శుష్క వేదాంతులు (బౌద్ధ సన్న్యాసులు) బ్రహ్మవిద్యకు విఘ్న దేవతలై తిరుగుచున్నారు. ముముక్షువులారా వారి జోలికి పోవద్దు.

**యతీనాం కాంచనం దత్వా! తాంబూలం బ్రహ్మచారిణామ్!**
**స్తే నానామభయం దత్వా! సదాతా నరకం వ్రజేత్!!**

సన్న్యాసులకు ధనము, విద్యార్థులకు తాంబూలము, దొంగలకు అభయము ఇచ్చువాడు నరకానికి పోతాడు:-

**సత్కార మానపూజార్థం! దండ కాషాయధారీ యః!**
**స సన్న్యాసీ సవక్తవ్యః! సన్న్యాసీ జ్ఞాన తత్పరః!!**

సత్కారం కోసం, ప్రతిష్ఠకోసం, పూజలందుటకు దండమూ, కాషాయములు ధరించేవాడు సన్న్యాసికాడు-జ్ఞానియే సన్న్యాసి:-

**జాతమాత్రం నరంకంచిత్! ముండయిత్వా మఠాధిపమ్!**
**కాషాయ వస్త్ర మాత్రేణ! కరిష్యంతి నరాధమాః!**
**మఠాధిపత్యం సేవాచ! ధన సంగ్రహ ఏవచ!**
**దాసీ గమన మీర్ష్యాచ! పంచధా తత్త్వ వాదినః!!**

అప్పుడే పుట్టిన వానిని, గుణశీలాదులు పరీక్షింపకయే, బోడి చేసి, కాషాయ గుడ్డలు కప్పి, మఠాదిపతిగా చేసెదరు. మఠాధిపత్యం, సేవింపబడుట, ధనార్జన, దాసీగమనము ఈర్ష్య ఈ ఐదుగుణములు గలవారిని తత్త్వ వాదులుగా భావించెదరు. (కలియుగమున అజ్ఞానము, లోకవంచన, వితండ వాదములకు సన్న్యాసి వేషము బాగుగా పనికి వచ్చును సౌరపురాణం.)

**అపూజిత లాభాంస్తు! జుగుప్సేత్రైవ సర్వశః!**
**అభిపూజిత లాభాశ్చై! యతిర్ము క్తోపి బద్ధ్యతే!!**

పూజా సత్కారములతో కూడిన భిక్షాదులను స్వీకరించుటకు సన్న్యాసులు విముఖులై యుండవలెను. వాటి మీది ఆసక్తిచే ముక్తులైన సన్న్యాసులు కూడా బంధమున పడెదరు. (మనువు)

**యతిత్వం జీవ నోపాయం! కుర్వంతః నలజ్జితాః!**
**మాతుః పణ్యమి వాలంబ్య! యథా కేచిత్ గత ఘృణాః!!**

తల్లిపడుపు వృత్తితో ఆర్జించిన దానితో తన బ్రదుకు వెళ్ళబుచ్చుకొనేవాడు సిగ్గుమాలిన వాడుగను, నిర్భాగ్యుడుగను ఎంచబడును. ఐనప్పుడు ఇక సన్న్యాసమును కూడా ధనోపార్జనకు ఉపయోగించుకొను వాడు ఎంత సిగ్గుమాలిన వాడో, ఎంత నిర్భాగ్యుడో చెప్పవలయునా!.

**ద్రవ్యార్థ మన్న వస్త్రార్థం! యః ప్రతిష్ఠార్థ మేవచ!**
**సన్న్యాసే దుభయ భ్రష్టః! నముక్తిం నాప్ను మర్హతి!!**

ఎవడైతే ధనార్జనకు, అన్నవస్త్రాదులకు కీర్తి ప్రతిష్ఠల కొరకు సన్న్యసించునో, వానికి ఇహ పరములు రెండూలేవు. ముక్తీలేదు. (పరమహంస పరివ్రాజికోప నిషత్తు)

**ఉపదేష్టుంచ వక్తుంచ! సర్వేఽపి జనాః పండితాః!**
**తదనుష్ఠాన వేళాయాం! మునయోఽపి నపండితాః!!**

ఉపదేశించుటలోనూ, చెప్పుటలోనూ అందరూ పండితులే. వాటిని ఆచరించుటలో మునులుకూడ పామరులే.

**భిక్షో మాంస నిసేవనం ప్రకురుషే? కింతేన మద్యంవినా!**
**మద్యంచాపి తవప్రియం? ప్రియమహో వారాంగ నాభిస్సహ!!**
**వారస్త్రీరతయే కుతస్తవ ధనం? ద్యూతేన చౌర్యేణవా!**
**చౌర్య ద్యూత రతిశ్చ కిన్ను భవతః? భ్రష్టస్య కావాగతిః?!!**

ప్ర= ఓ సన్నాసీ మాంసము తింటున్నావా? జ= కల్లు లేకపోతే?
ప్ర= కల్లుకూడా ఇష్టమా? జ= వేశ్యకూడా ఇంకా ఇష్టమే.
ప్ర= ఆ వేశ్యకిచ్చుటకు ధనమెక్కడిది? జ= జూదం కానీ చౌర్యము కానీ
ప్ర= దొంగతనము, జూదము, వ్యభిచారము ఇవి అయిన తరువాత గతి ఏమి? జ= ఒకసారి భ్రష్టుడైన తర్వాత ఎంతటికి దిగజారి పోడు? (భోజకాళిదాసుల సంవాదముః ప్రసిద్ధి)

# ఈశావాస్యోపనిషత్

# శాన్తి పాఠము

***ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే***
***పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥***

***ఓం శాన్తిః శాన్తిః శాన్తిః***

దేవాదిదేవుడు సమగ్రుడును, సంపూర్ణుడును అయివున్నాడు. అతడు సర్వ సంపూర్ణుడగుటచే అతని నుండి ఉద్భవించిన ఈ దృశ్యమాన ప్రపంచము మొదలగునవన్నియు సర్వసంపూర్ణములై ఒప్పారుచున్నవి. సంపూర్ణమునుండి కలిగింపబడిన దేదైనను తనంత అతని నుండి పెక్కు సంపూర్ణాంశము లుద్భవించినను అతడు సంపూర్ణుడై శేషించియే యుండును.

***ఈశావాస్య మిదగ్ంం సర్వం యత్కించ జగత్యాం జగత్***
***తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్॥ (1)***

పృథివియందు నశ్వరస్వభావము గల యే యే వస్తువు పరమాత్మచే నాచ్ఛాదింపబడ తగియున్నది. సర్వత్యాగభావముచే సర్వము ననుభవింపుము. ఎవరి ధనము నాశింపవలదు. ధనమెవ్వరిదియును గాదు. (సర్వకర్మ సన్న్యాసము మోక్షోపాయము).

***కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ంం సమాః***
***ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥ (2)***

మానవుడు ఆవిధముగా కర్మలొనరించుచు వంద సంవత్సరములు జీవింప నభిలషింపవచ్చును. ఏలయన అట్టి కర్మ అతనిని కర్మశాసనమునకు బంధింపదు. మానవున కింతకంటే వేరు మార్గము లేదు. (నిష్కామ కర్మము చిత్తశుద్ధిహేతువు).

***అసుర్యానామతే లోకా అంధేన తమసాఽఽ వృతాః***
***తాగ్ంం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనోజనాః॥ (3)***

కర్మ ఫలములైన యా సుప్రసిద్ధ జన్మపరంపర లేవి కలవో యవి యసురులకు చెందినవి. ఆ జన్మములు విచార శూన్యము లగుటచే అజ్ఞానావృతములగుచున్నవి. ఆత్మఘాతుకు లగు జనులెవరు గలరో వారలు మరణా నంతర మా యాసుర జన్మములను పొందుచున్నారు. (కర్మఫలము జన్మ మృత్యువులు)

***అనేజ దేకం మనసో జవీయో నైనద్దేవా అప్నువన్ పూర్వమర్షత్***
***తద్ధావతోఽ న్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి॥ (4)***

ఆత్మచలనము లేనిది మరియొకటి లేనిది. మనస్సు కంటె నెక్కుడు వేగము గలది. ఇంద్రియములు ఈ ఆత్మ తత్త్వమును పొందలేవు. ఆత్మతత్త్వము మనస్సుకంటె ముందుగా పరుగిడును. అది స్థిరముగా నుండియు కూడా, పరుగు లెత్తు మిగిలినవానిని దాటిపోవును. ఆత్మ తత్త్వముండుట చేతనే వాయువు సర్వప్రాణి చేష్టలను విభజించు చున్నది. (ఆత్మయే సర్వ వ్యవహార కారణము).

***తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే***
***తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః॥ (5)***

ఆ యాత్మతత్త్వము చలించును, చలించదు. దూరమున నుండును. అదేవిధముగ సమీపమున నుండును. అది సమస్త జగత్తునకు లోపల బయట గూడ కలదు. (సర్వము ఆత్మచే నాచ్ఛాదితము).

***యస్తు సర్వాణి భూతాన్యాత్మ న్యేవాను పశ్యతి***
***సర్వభూతే షు చాఽఽత్మానం తతో న విజా గుప్సతే॥ (6)***

ఎవ్వడైతే సమస్త భూతముల నాత్మ స్వరూపుడగు తనయందే చూచుచున్నాడో, సకల భూతములయందు నాత్మ స్వరూపుడగు తనను చూచుచున్నాడో, అట్టివాడు అట్టి జ్ఞానమును కలిగియుండుటచేత ఇతరు యెడ విముఖుడు గానేరడు. (ఆత్మరక్ష శబ్దార్థము).

***యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైభూ ద్విజానతః***
***తత్రకో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః॥ (7)***

ఆత్మ సాక్షాత్కారము పొందినవానికెపుడు సమస్త భూతములు స్వస్వరూపములే యగుచున్నవో, యపుడు తనకును ఇతర భూతములకును ఐక్యమును గుర్తెరింగిన వాడగుటచేత అతనికి శోకమోహములుండవు. (ఆత్మజ్ఞానికి శోకమోహములు లేవు).

**స వర్యగా చ్చు క్రమకాయమ వ్రణ మస్నావర గ్ం శుద్ధమపావ విద్ధమ్**
**కవిర్మనీషీ వరిభూ స్వయంభూర్యాథా తథ్యతోఽ ర్థా న్వ్యదధా**
**చ్ఛాశ్వతీ భ్యః సమాభ్యః (8)**

ఆ పరమాత్మ సర్వవ్యాపి, జ్యోతిస్స్వరూపి, శరీరము లేనివాడు, ఛిద్రము లేనివాడు, నాడులు లేనివాడు, నిర్మలుడు, ధర్మాధర్మాది పాపములు లేనివాడు, సర్వసాక్షి, మనస్సునకు ప్రభువు, అన్నింటికంటెను పై నుండువాడు, స్వయంభువు, కర్మఫలసాధనములగునట్లు కర్తవ్య పదార్థములను నిత్యులగు సంవత్సరములను పేరుగల ప్రజాపతుల కొరకు నిర్మించెను. (ఆత్మతత్త్వ స్వరూపము).

***అంధం తమః ప్రవిశన్తియేఽ విద్యాముపాసతే***
***తతోభూయు ఇవతే తమో యు ఉ విద్యాయాగ్ం రతాః॥ (9)***

ఎవరు విద్యకు విరుద్ధమగు కర్మ నాచరించెదరో వారదర్శనాత్మకమగు నజ్ఞానమున ప్రవేశించెదరు. ఎవ్వరు కేవల దేవతాస్వరూప జ్ఞానము నందు మాత్ర మాసక్త చిత్తులగుదురో నవ్వారదర్శనాత్మకమగు నజ్ఞానము కంటెను హీనతరమగు చీకటిన ప్రవేశించెదరు.

***అన్యదేవాహుర్విద్యయాఽ న్యదాహుర విద్యయా***
***ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్త ద్విచచక్షిరే॥ (10)***

దేవతా జ్ఞానముచే నొక ఫలము గల్గును. కర్మనిష్ఠచే మరియొక ఫలము గలుగునని వేదములు చెప్పుచున్నవి. ఈ విషయమునే ఉభయ తంత్ర కుశలులగు వేదవేత్తల వలన పారం పర్యముగ వినుచున్నాము.

***విద్యాం చావిద్యాం చ యస్తద్వేదో భయగ్ం సహ***
***అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే॥ (11)***

ఎవ్వడు దేవతాజ్ఞానమును కర్మను గూడ సముచ్చయము చేసి తెలిసికొనునో నతడు కర్మానుష్ఠానము చేత మృత్యువును దాటి దేవతా జ్ఞానము చేత దేవత్వమును బొందును.

***అంధం తమః ప్రవిశన్తి యేఽ సంభూతి ముపాసతే***
***తతోభూయ ఇవతే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః॥ (12)***

ఎవ్వరు కారణరూపమగు ప్రకృతిని మాత్రము పాసించెదరో వారదర్శనాత్మకమగు తమస్సును పొందుచున్నాడు. ఎవ్వరు హిరణ్యగర్భ

రూపమగు కార్య బ్రహ్మయందు మాత్రమే ఆసక్తి గల వారగుదురో వారంతకంటెను నధికమగు అంధకారమును పొందుచున్నారు. (నిర్గుణ బ్రహ్మేతరోపాసనములు మోక్షహేతువులు కావు).

***అన్యదేవాహుః సంభవాదన్య దాహు రసంభవాత్***
***ఇతి శుశ్రుమ ధీరాణం యే నస్తద్విచచక్షిరే॥ (13)***

కార్యబ్రహ్మోపాసనము వలన గలుగు ఫలము వేరనియు, ప్రకృత్యుపాసనము వలన గలుగు ఫలము వేరనియు, ఈ రెండింటి యొక్క సముచ్ఛయమున ఉత్కృష్ట ఫలము లభించుననియు ఉభయోపాసనా కుశలులగు పండితులు కూడా బోధించుచున్నారు.

కార్య బ్రహ్మోపాసనము వలన అణిమాద్యైశ్వర్య సిద్ధి కలుగును. అవ్యాకృతోపాసనము వలన ప్రకృతి లయ రూపమగు ఫలము కలుగును.

***సంభూతిం చ వినాశం చ యస్తద్వేదో భయగ్ం సహ,***
***వినాశేన మృత్యు తీర్త్వా సంభూత్యాఽ మృతమశ్నుతే॥ (14)***

అవ్యాకృత మనబడు ప్రకృతిని వ్యాకృతరూపమగు కార్యబ్రహ్మను రెంటిని ఒక్కడే ఉపాసించదగినదిగా తెలిసికొనినవాడు కార్యబ్రహ్మోపాసనముచే ననైశ్వర్యము నధర్మకామాదిదోష జాలమును దాటి అవ్యాకృతోపాసనముచే ప్రకృతి లయమును పొందుచున్నాడు.

***హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్***
***తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥ (15)***

జ్యోతిర్మయమగు పాత్రముచేత ఆదిత్యమండలాంతర్వర్తి యగు బ్రహ్మము యొక్క ద్వారము కప్పబడియున్నది. ఓ సూర్యుడా! సత్యమైన ధర్మము నాచరించు నా కొరకు, నీ సత్య స్వరూపమును చూచుటకై నీవట్టి పాత్రనుతొలగింపుము.

***పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజా పత్య వ్యూహ రశ్మీన్ సమూహ తేజో***
***యత్తేరూపం కల్యాణతమం తత్తేపశ్యామి యోఽ సావసౌ పురుషస్సోఽ హమస్మి॥ (16)***

సర్వజగత్పోషకుడై ఓ రవీ! ఏకాకివై సంచరించు ఓ ఏకర్షి' సర్వసంయమము కావించు ఓ యముడా! కిరణములు మన ప్రాణమ

లను, రసములను స్వీకరించు ఓ సూర్యదేవా! ఓ ప్రజాపతి పుత్రా! నీవు నీ కిరణములను తొలగించివేయుము. తాపకమైన నీ తేజస్సును ఏకీకరింపుము. అత్యంత కల్యాణ మయమైన నీరూపమును నీ యనుగ్రహముచేత చూచుచున్నాను. ఏ యీ పూరుషుడు కలడో అతడు నేనే అయివున్నాను.

***వాయు రనిల మమృత మథేదం భస్మాన్తగ్ శరీరమ్***
***ఓం క్రతో స్మర కృతగ్ం స్మర క్రతోస్మర కృతగ్ం స్మర॥ (17)***

నా ప్రాణవాయువు పరిమితమగు యీ శరీరమును విడిచి సర్వాత్ముడు, అమృత స్వరూపుడు, వాయు రూపుడునగు సూత్రాత్మను పొందుగాక! నాయీ శరీరము అగ్నిలో ఆహుతి చేయబడి భస్మాంతమై పోవుగాక! ఓంకార వాచ్యుడవు, అగ్నిరూపుడవునగు ఓ సంకల్పాత్మకా! నన్ను స్మరింపుము! కృతమును - ఇంతవరకు నేను సాధించిన దానిని స్మరింపుము! నన్ను స్మరింపుము. నే చేయు నుపాసనాదికమును స్మరింపుము.

***అగ్నేనయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్***
***యుయోధ్యస్మ జ్జు హు రాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తింవిధేమ॥***
***(18)***

ఓ అగ్నిదేవా! మమ్ము శోభనమైన మార్గమున కర్మఫల భోగము కొరకు గొనిపొమ్ము. ఉత్తరాయణ మార్గమున గొనిపొమ్ము. దక్షిణ మార్గము వలదు. నీకు అన్ని మార్గములును తెలుసు. మా యొక్క వంచనాత్మకమగు పాపములను నశింపజేయుము. మేము నీకొరకు పెక్కు నమస్కారముల చేయుచున్నాము.

***ఓం పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్పూర్ణముదచ్యతే***
***పూర్ణ స్యపూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే॥***

***ఓం శాన్తిః శాన్తిః శాన్తిః***

అది పూర్ణం. ఇది పూర్ణం. పూర్ణ కంటె పూర్ణం శ్రేష్ఠం. పూర్ణం యొక్క పూర్ణాన్ని తెలుసుకొంటే పూర్ణమే మిగులుతుంది.

# శాంతి మంత్రములు

**ఓంః పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే**
**పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణ మేవావ శిష్యతే - (1)**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఆ పరబ్రహ్మము పూర్ణము అనగా సర్వమును వ్యాపించియున్నది. అది సర్వవ్యాపి- విభిన్ననామ రూపాత్మకమైన ఈ జగత్తు పరబ్రహ్మము నుండి యుత్పన్నమై కారణము నుండి కార్యము వ్యతిరేకము కానటుల ఇది కూడా పూర్ణమే. పూర్ణం కంటే పూర్ణం శ్రేష్ఠం. పూర్ణం యొక్క పూర్ణాన్ని తెలుసు కొంటే పూర్ణమే మిగులుతుంది.

**తాపత్రయాలు శాంతించుగాక :**

(1) ఆధ్యాత్మికతాపం= దేహానికి కలిగే రోగాలు, మనస్సుకు కలిగే ఆందోళన, దుఃఖము.

(2) ఆధిభౌతిక తాపం= తేళ్లూ, పాములూ, మనుష్యులు మొదలగు ఇతర భూతముల వలన కలిగే దుఃఖము.

(3) ఆధిదైవిక తాపం= గాలివానలు, భూకంపములు అగ్ని ప్రమాదాలు. వీటి నుండి శాంతి కలుగు గాక:-

**ఓం= అప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుఃశ్రోత్ర**
**మథోబల మింద్రియాణిచ సర్వాణి, సర్వం**
**బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మనిరాకుర్యాం మామా**
**బ్రహ్మ నిరాకరోద నిరాకరణ మస్త్వనిరాకరణం మే2స్తు**
**తదాత్మని నిరతేయ ఉపనిషత్సుధర్మాస్తే మయిసన్తు**
**మయి సన్తు= ఓం శాన్తిః ఓం శాన్తిః ఓం శాన్తిః (2)**

**(సామవేదము; కేన, ఛాందోగ్యము)**

ఉపనిషత్తులచే ప్రతి పాదింపబడిన బ్రహ్మము నా యొక్క అంగములు, వాక్కు, నేత్రములు, ప్రాణము, చెవులు, బలము, ఇంద్రియములు మొదలగు వానిని తృప్తి పరచుగాక! వేదాంత ప్రతి పాద్యమైన బ్రహ్మమే సర్వము నగును, బ్రహ్మము నన్ను నిరాదరణ చేయకుండు గాక! నేను బ్రహ్మమును నిరాదరణ చేయకుండు నట్లు అనుగ్రహించును గాక! నా విషయమందు ఆదరణము గలుగు గాక! ఉపనిషత్తులు బోధించిన ధర్మములన్నియు నాయందుండుగాక!......

**ఓం= సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై ।**
**తేజస్వినావధీత మస్తు, మా విద్విషావహై**
**ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః (3)**

(కఠోపనిషత్తు)

గురు శిష్యులగు మాయిద్దరినీ బ్రహ్మము రక్షించుగాక! మేమిద్దరము వీర్యవంతులమై విద్యాఫలము ననుభవింతుము గాక! మేమభ్యసించు విద్య అర్థ జ్ఞానయోగ్యముగుగాక! మేముభయులము తేజోవంతుల మగుదుముగాక! మేముభయముల మొకరి నొకరము ద్వేషింపకుందుము గాక.

**ఓమ్=భద్రం కర్ణేభి శ్రుణుయామదేవా ః భద్రం పశ్యే**
**మాక్షభిర్యజత్రాః స్థిరైరంగైస్తుష్టువాం సస్తనూ భిర్వ్య**
**శేమదేవ హితం యదాయుః స్వస్తిన ఇంద్రో**
**వృద్ధ శ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః స్వస్తిన**
**స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥ (4)**
**ఓం శాంతిః ఓంశాంతిః ఓంశాంతిః**

**(ముండక, ప్రశ్న ఉపనిషత్తులు)**

ఓదేవతలారా ! గురు శిష్యులమగు మేము మీమంళకరమైన వాక్కులను చెవులార వినెదముగాక !పూజ్యులైన యజ్ఞదేవతలారా ! కన్నులచే మేము మీమంగళకరములైన రూపములు చూచెదము గాక! దృఢమైనట్టి అవయవముల చేతను శరీరముచేతను స్తోత్రముల చేయుచున్నవారమగుచు మాజీవితమును దేవతలకు ప్రియమగునట్లు చేయుదుముగాక ! సర్వదిగంత విశ్రాంత కీర్తిగల ఇంద్రుడు మాకు శుభములనొసంగు గాక! సర్వజ్ఞుడైన సూర్యుడు మాకు శ్రేయములను గలుగ జేయునుగాక! శుభములకాధారుండైన గరుత్మంతుడు, సర్వజ్ఞుడైన సూర్యుడు మాకు శ్రేయములను గలుగజేయునుగాక! శుభములకాధారుండైన మాకు మంగళము నొంసంగుగాక !

**ఓమ్ = యో బ్రహ్మణం విదిధాతిపూర్వం । యోవై వేదాంశ్చప్రహిణోతి తస్మై ।**
**తం హదేవ మాత్మబుద్ధి ప్రకాశం । ముము క్షుర్వై శరణ మహం ప్రపద్యే ॥ (5)**
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

**(శ్వేతాశ్వతరోపనిషత్)**

ఏ పరమాత్మ ప్రపంచ సృష్టికి ముందు హిరణ్యగుర్భుని సృజించి వానికి వేదము లొసంగెనో, అట్లే స్వయంప్రకాశుడును. దేహేంద్రియ బుద్ధులందు అంతర్యామి

రూపముననుండి తత్తత్కర్మాను సారముగ వాటిని ఆయాకార్యములందు నియమించువాడును నగు ఆపరమాత్మను ముముక్షువగు నేను శరణుపొందుచున్నాను.

**ఓమ్ - వాఙ్మే మనసి ప్రతిష్ఠితా । మనోమేవాచి ప్రతి ష్ఠిత మావిరావీర్మ ఏధి । వేదస్యామ అణీస్థః। శ్రుతంమే మా ప్రహాసీరనేనా ధీతేనా హోరాత్రాన్సంద ధామి ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। తన్మామవతు । తద్వక్తార మవతు । అవతు మా మవతు వక్తారమ్॥**

**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తి ః (6)**

**(ఐతరేయ ఉపనిషత్)**

నావాక్కు నిరంతరము మనః స్వరూపమున స్థిరమగును గాక। నామనసువాక్కునందు నెలకొని యుండుగాక। (వాక్కున్ను, మనస్సున్ను, పరస్పర సహాయముగ నుండు గాకయని ప్రార్థన) ఓ జ్యోతి స్వరూపమగు పరమాత్మా। నా అజ్ఞత్వమును పోగొట్టి నాకు ప్రకాశము గలుగునట్లను గ్రహింపుము ఓమనోహక్కులారా। నాకు దిగువను దహరింపబడు గ్రంథమును నొసంగుటకు సమర్థులగుదురుగాక। నాచేవినబడిన గ్రంథమును, దాని అర్థమును నేను మరువక యుందునుగాక। అధ్యయనముచేసి మరువకయుండు గ్రంథమును నేను రేయింబవళ్ళు అను సంధానము చేయుదును గాక। (అధ్యయనము చేయబడిన గ్రంథమందు యదార్థవస్తువునే (పరమాత్మనే) అనువదించెదనుగాక। సత్యమునే వచింతునుగాక। మీద చెప్పబడిన బ్రహ్మము శిష్యుడనగు నన్నును, బోధకులగు ఆచార్యులను రక్షించునుగాక।

**ఓమ్ - అహం వృక్షస్యరేరివ । కీర్తి ః పృష్ఠంగిరేరివ ।**
**ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృతమస్మి । ద్రవిణం**
**సవర్చసం । సుమేధా అమృతోక్షితః । ఇతి**
**త్రిశంకోర్వేదానువచనమ్ ॥ (7)**

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తి ః

(తైత్తిరీయ ఉపనిసత్)

నేను నాశస్వరూపమైన జన్మజరామరణాది రూపమగు దేహమను సంసార వృక్షమునకు అంతర్యామి స్వరూపము చేత ప్రేరకుడనున్నూ, పర్వత పృష్ఠభాగమువలె ఖ్యాతిగలవాడనున్నూ. సూర్యునివలె ప్రసిద్ధుడను, అమృతస్వరూపుడనున్నూ, అగుచున్నాను. సంసార స్థిత్యుత్పత్తి సంహారములయందు నైపుణ్యము యొక్క కూడికవలన సర్వజ్ఞత్వ లక్షణరూపమైన మంచిబుద్ధిగలవాడను. మరణధర్మము లేనివాడను. క్షీణింపనివాడను నగుచున్నానని యీప్రకారము త్రిశంకు మహర్షియొక్క ఆత్మైకత్వ జ్ఞానానుకూలమైన వాక్యమును (త్రిశంకు ఋషి, పంక్తి ఛందస్సు, పరమాత్మ దేవత

బ్రహ్మవిద్యార్థరూపమైన జపము నందు వినియోగము.ఇట్లు) దేవతా ఛందస్సులతో నుపాసించువాడు స్వాధ్యాయ ప్రాప్తిద్వారా అంతఃకరణశుద్ధిగల్గి బ్రహ్మవిద్యాప్రాప్తి నొందుచున్నాడు - (ఈ మంత్రోపాసనవలన స్వాధ్యాయమున్నూ, ఆస్వాధ్యాయము వలన అంతఃకరణ పరి శుద్ధియు, తద్వారా బ్రహ్మజ్ఞానోత్పత్తియు కల్పింపబడుచున్నది.)

**ఓమ్ - యశ్ఛంద సామృషభో విశ్వరూపః ఛన్దోభ్యోధ్య**
**మృతాత్సంబభూవ । సమేన్ద్రోమేధయా స్పృణోతు**
**అమృతస్య దేవధార ణోభూయాసం । శరీరంమే విచర్షణం।**
**జిహ్వామే మధుమత్తమా। కర్ణాభ్యాం భూరివిశ్రువం ।**
**బ్రహ్మణః కోశో2సిమేధయాపిహితః శ్రుతంమే గోపాయ॥ (8)**
**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తి ః**
**(తైత్తిరీయ ఉపనిసత్ )**

అమృత స్వరూపమును వేదమువలన పుట్టినదై వేదములలో శ్రేష్ఠమైనదియు, బ్రహ్మస్వరూపమును, పరమేశ్వర స్వరూపమునగు ఓంకారము నన్నుమరపు లేని బుద్ధితో స్పృశించునుగాక । ప్రకాశస్వరూపమగు నో ప్రణవమా । బ్రహ్మజ్ఞానము యొక్క ధారణ నాకగునుగాక। నా శరీరము పరిశుద్ధమగునుగాక నా జిహ్వ మాధుర్యముగలది యగునుగాక ! శ్రోత్రములచే నే ననేకముల వినినవాడనగుదునుగాక ! ఓంకారమా! నీవు బ్రహ్మకు స్థానమై లౌకిక ప్రజ్ఞచే గప్పబడిన దానవైతివి. ఇటువంటి నీవు నేను వినిన ఆత్మ జ్ఞానము మొదలుగాగల విజ్ఞానమును రక్షింపుమా.

**ఓం - శంనోమిత్ర ః ! శంవరుణః !శంనోభవత్వర్యమా !**
**శంన ఇంద్రో బృహస్పతి ః ! శంనోవిష్ణురురుక్రమః!**
**నమోబ్రహ్మణే ! నమస్తేవాయో ! త్వమేవ ప్రత్యక్షం**
**బ్రహ్మ2 సి ! త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి !**
**ఋతం వదిష్యామి ! సత్యం వదిష్యామి !తన్మామవతు ।**
**తద్వక్తారమవతు ! అవతుమాం ! అవతువక్తారమ్॥ (9)**
**ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తి ః**

**(తైత్తిరీయ ఉపనిసత్ )**

సూర్యుడు మాకు సుఖమును కలుగజేయుగాక వరుణుడుమాకు సౌఖ్యము నొంసగుగాక ! అట్లనే ఆర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విశాలరూపుడగు విష్ణువు మాకు సుఖమును కలుగజేయుదురుగాక ! బ్రహ్మస్వరూపమైన వాయువునకు

సమస్కారము ఓవాయువా! నీవే ప్రత్యక్షమైన బ్రహ్మస్వరూపుడవు కాన నిన్నే ప్రత్యక్షమైన బ్రహ్మస్వరూపముగా చెప్పగలను. నిన్ను ఋతస్వరూపముగను చెప్పగలను (కర్తవ్యమును శాస్త్రమును, అతిక్రమింపకుండ బుద్ధియందు లెస్సగ నిశ్చితమగు అర్థము ఋతమనబడును) సత్యస్వరూపము గను వచింపగలను. ఆ బ్రహ్మమునన్ను రక్షించునుగాక ఆచార్యుని రక్షించునుగాక ! ప్రణవస్వరూపమగు నో పరబ్రహ్మమా ! ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక తాపములు శమనమగుగాక.

**ఓమ్ అసతోమా సద్గమయ**
**ఓమ్ తమసో మా జ్యోతిర్గమయ**
**ఓమ్ మృత్యోర్మా అమృతంగమయ ॥ (10)**

అసత్తు నుండి నన్ను సత్తును పొందింపజేయుము. తమస్సు నుండి జ్యోతిని పొందింపజేయుము. మృతువునుండి అమృతమును పొందింపజేయుము.

# కలిహేల

(పులిజాలరామమూర్తి, మద్దాలి కృష్ణమూర్తి)

**కృతే ప్రవర్తతే ధర్మః చతుష్పాత్తజనైర్ధృతః**
**సత్యం దయాతపోదాన మితిపాదావిభోః నృపః**

సత్యము,దయ, తపస్సు దానము ఈ నాల్గు ధర్మములు కృతయుగములో యుండెడివి - ఒక్కొక్క యుగములో ఒకటి తగ్గిపోతూ కలియుగములో దానము మాత్రము మిగిలి, అప్పటి నాల్గుపాదములు కలిలో ఒకపాదము మాత్రము మిగిలి యున్నది - ఇప్పుడు మూడుపాళ్లు అధర్మమే యుందనీ ఒక్కపాలు ధర్మము ఉందనీ చెప్పేవారు కలరు - అదే నిజము - అందు వలననే కాలజ్ఞానం తెలిసిన పౌరాణికులు, వేదాంతులు, సంస్కర్తలు, మహర్షులు సమాజంలో ధర్మదీక్షను, నైతిక విలువలను కాపాడుటకై స్మృతులను, శాస్త్రములను నిర్ధారించినారు.

పదునేడవ శతాబ్దికి చెందిన నీలకంఠ దీక్షితులు ఎన్నోగొప్ప గ్రంథములను రచించిరి. అందులో కలివిడంబన శతకమొకటి = ఆనాటి రాజకీయ సాంఘిక, మతపరములైన మూఢాచారములను, వంచనా పద్ధతులను నిశితంగా విమర్శించినారు. వారు వక్రోక్తితో విమర్శించిన విషయాలు (1) నోరున్న వారిదే రాజ్యము. (2)తడబడకుండా దబాయించడము (3) చెంతచేరినవారి తాహతు మనస్తత్వ పరిశీలన (4) పనిని గూర్చిన నైపుణ్యం కాదు ప్రచారానికి ప్రాధాన్యత (5) ధనవంతులకు పెద్ద పీట (6) జ్యోతిష్కులు, మాంత్రికులు, తాంత్రికులు, గ్రహాలనుగూర్చి, అధిదేవతలను గూర్చి ప్రజల కర్థంగాని భాషలో దోచుకొనుట, వీరినే కాకుండా కవులను, అప్పిచ్చు వాళ్లను, వైద్యులను, దారిద్ర్యాన్ని, చుట్టాలను ధుయ్యబట్టాడు. కలిలోని కల్మషాలన్నీ వీరివల్లనే వృద్ధిచెందుతోంది - దొంగసన్యాసులను వదల్లేదు - ఈనాటికీ దీక్షితులవారి విమర్శలు అన్వయించుకోవచ్చును.

ఇరవయ్యో శతాబ్దము దాటిపోవు చున్నానూ స్త్రీ పరతంత్రగానే జీవిస్తున్నది. మనువు "నస్త్రీస్వాతంత్ర్య మర్హతి " అనిచెప్పినాడు కానీ ఆమెను బాల్యంలో తండ్రీ, యౌవనంలో భర్త, వార్ధక్యంలో పుత్రుడూ రక్షించాలని శాసించాడు. ఆమూడు బాధ్య తలూ పోయినవి, స్త్రీ అస్వతంత్రగానే వుంది. వరాహమిహిరుడు ఆకాలంలోనే స్త్రీల

దైన్యస్థితిని వర్ణిస్తూ "స్త్రీల విషయంలో పురుషుడు చేయని ఏదోషం మిగిలివుంది"? అని అడిగాడు. ఈనాడు కూడా స్త్రీలు బహిరంగంగావేలం వేయబడుతున్నారు. రోజుకు పది మానభంగాలు పది కట్నపు వేధింపుల చావులు. కలిప్రభావము యావత్ప్రపంచం మీద వుంది అందులో ముఖ్యమైనది వర్ణవివక్షత. సమసమాజము, సోదరత్వము, ప్రేమ శాంతి అని నీతులను వల్లిస్తూ ఆఫ్రికాలోని నల్ల జాతులవారినీ, అమెరికాలోని రెడ్ఇండియన్లనూ చిత్రహింసల పాలుచేసి, బానిసలుగా సంతలలో విక్రయించి, వారిని పశువుల కన్ననూ హీనంగా చూచిన శ్వేత జాతీయుల దారుణమైన ఘటనలు మనకు చరిత్ర చెప్పుటయేగాక ఈనాడు ప్రత్యక్షంగాచూస్తున్నాము. జర్మనీలో నాజీలు యూదులను సామూహికంగా హత్యలు చేసినారు. మతాధికారులు పీఠాధిపతులు ఈహత్యలను నిరసించలేకపోయిరి. శాస్త్రజ్ఞులుకూడా ఈదమన కాండనుండి తప్పించుకొనలేకపోయిరి. కోపర్నికస్, గెలీలియోలు భూమిగుండ్రముగా యున్నదనీ అదిమన సౌరకుటుంబములోని సూర్యుని చుట్టివచ్చుచున్న దానీ చెప్పినందులకు మతాధికారులే వారికి ఘోర శిక్షలు విధించిరి

ఈయుగములో ప్రజలలోని తిరుగుబాటు ధోరణి మరొక ముఖ్యమైనది. ఇందుకు కారణములు జన సాంద్రతపెరుగుట.

2. ప్రకృతివైపరీత్యములు, 3.సామ్రాజ్య విస్తరణకాంక్ష, 4 భాషా, మత, వైషమ్యములు. అంతర్యుద్ధాలు 5.శాస్త్ర సాంకేతికాభివృద్ధి 6.మేధావులవలన,7. ఫ్రెంచి విప్లవానికి నాంది అయిన, సౌభ్రాతృత్వము, సమానత్వము, స్వాతంత్ర్యనినాదాలు, 8. మొదటి ప్రపంచ యుద్ధము, 9. రష్యాలో శ్రామికవిప్లవము 10. తృతీయ ప్రపంచమన బడు వలసదేశాలలో విముక్తిపోరాటాలు. 11. రాజరికాలు నశించి నియంతల నిరంకుశుల పాలనలు 12. ద్వితీయ ప్రపంచ సంగ్రామము అణుబాంబుల ప్రయోగము, 13.ఐక్యరాజ్యసమితి, 14.ప్రచ్ఛన్నయుద్ధము 15. అంతరిక్షంలోకి ఉపగ్రహాలను ప్రవేశపెట్టుట, 16. చంద్రమండలంలోనికి మానవుని ప్రవేశము 17. కంప్యూటర్లు, రోబ్వాట్సుల తయారీ 18. కల్పనయుగము 19. ఆర్థిక సంస్కరణల సంక్షోభము పేటెంటు హక్కులు 20. ప్రాణిజాత కృతిమ సృష్టి.

ప్రకృతికి సమాజానికి అనుకూలముగా ఉపయోగించుకొనుటయను ప్రణాళికల పేరుతో ప్రకృతినే పాడుచేయుట ఈయుగములోని ఘోరమైన నేరము, పాపము అడవులను, అందులోని జంతు సంపదను నాశనముచేయు వితరణలేని ప్రాజెక్టు

నిర్మాణముల వలన భూకంపములు, చమురుబావుల త్రవ్వకములవలన అగ్ని విస్ఫోటనములు జరుగుచున్నవి - సంపన్నదేశాలు చమురు నిల్వలను కైవసము చేసుకొనుటకై యుద్ధాలను చేయుట, ముడిచమురును శుద్ధిచేయు కర్మాగారాల వల్ల వాతావరణ కాలుష్యముపెట్రోలు, డీజలు, కిరసనాయిల్,, వంటగ్యాసులు, వీటి తయారీలో ఎంతోకాలుష్యము - తుదకు ఓజోన్‌పొరలో రంధ్రములు పడి, మన ప్రాణములకే ముప్పు ఏర్పడే పరిస్థితి నెలకొన్నది.

ఈ యుగంలోనే సాంకేతిక శాస్త్రీయ ప్రగతి అనూహ్యంగా పెరిగిపోయింది. ఖగోళ, భౌతిక, జీవపదార్థ, బయోకెమిస్ట్రీ శాస్త్రాలు ఎన్నో రహస్యాలను వెల్లడించినవి. సృష్టికే ప్రతిసృష్టి చేయగలరేమోనన్న భయాందోళనలు ప్రభుత్వాలకు ఏర్పడుచున్నవి. ఒక వంక సంపన్న దేశాలు ఈ శాస్త్రాభివృద్ధిని తమ గుప్పిట పెట్టుకొని బడుగుదేశాల మనుగడకు ఎసరుపెడుతున్నాయి బడుగుదేశాలలో ఆరోగ్యము ప్రాథమిక విద్యలు ఎంతోఅవసరము ఆర్థిక సరళీకృత విధానాల వలన వాటికి దెబ్బ ఏర్పడి ఎన్నో అరాచక పరిస్థితులకు దారితీస్తున్నవి.

ఈ యుగంలోనే అన్నిరంగాలలో ఎంతో అభివృద్ధి సాధించబడింది. అపురోగమనము పేరుతో పాశవిక శక్తులు విజృంభిస్తున్నాయి. మతం పేరుతో అంతర్జాతీయ హింసాకాండ సంస్థాగతమైపోయినది. సత్యము అహింసకు బదులు, అసత్యము హింసలు అంతర్జాతీయ స్థాయికి చేరింది. అందరికీ హక్కులు కావాలి. బాధ్యతలు ఎవరకీ అక్కరలేదు. ప్రభుత్వాధినేతలేగాక సామాన్యమానవుడు కూడా హంతకుల మారణాయుధాలకు బలి అవుతున్నారు ఎవరి ఆస్తికీ, ప్రాణానికీరక్షణే లేదు. ఏ ఆస్తీ లేని దరిద్రులు కోట్లసంఖ్యలో వున్నారు - ఉన్నవాడికీ శాంతిలేదు. లేనివాడికి సుఖములేదు- సర్వత్రా అశాంతి. ఇదొక సంధియుగము, అంతర్జాతీయ కుట్రలు కీలకమైన అన్నిరంగాలలో వ్యాపించిన యుగము వారి వారి ఆర్థికస్తోమతతో, సాంకేతిక శాస్త్రీయ పరిజ్ఞానంతోబడుగుదేశాలను అన్ని విధాలా బానిసలను చేసికోనుటకు ప్రయత్నించుచున్న యుగము ఈ కలిహేలలో స్వార్థపూరిత దోపిడి విధానముతో మానవత్వమే నశించి పొయ్యే ప్రమాదమేర్పడినది.

Where is life we have lost in living
where is wisdom, we have lost in knowledge
Where is knowledge we have lost in information

T.E. ELIOT

సమాపనముః- ఈ రుగ్మతలన్నింటికి మన పూర్వులు ఎన్నోమార్గాలను చూపినారు. భర్తృహరి వైరాగ్యశతకం, ఆదిశంకరుని ప్రశ్నోత్తరి వేదాంత దేశికుల వైరాగ్యసుభవము, ఇంకనూ ఎన్నో ధర్మోప దేశాలను ఏర్చికూర్చి ఈచిన్న గ్రంథంలో శ్రీ పవని-వేణుగోపాలు గారు పొందుపరచినారు. తీనిని కలివర్తన దర్పణముగా తయారు చేసినారు శ్రీ నీలకంఠదీక్షితులవారి, కలివిడంబనము, వైరాగ్యశతకములతో ప్రారంభమైన ఈ గ్రంథములో అన్ని యుగాలలోని రాగద్వేషాలు, కామక్రోధాలు, భోగయోగాలు అవితెచ్చిపెట్టే సుఖదుఃఖాలు -వీటిని అత్యంత రమణీయమైన శైలిలో ఆ మహామనీషులు ప్రబోధించిన విషయాలను పవనివారు సేకరించి ప్రచురించారు.

శ్రీపవనీ వేణుగోపాలు గారు స్వాతంత్ర్య పమరయోధులేగాక పండితులు ఆధ్యాత్మిక గ్రంధపఠనలతోనూ, గ్రంధరచనలతోనూ ఈ వార్ధక్య దశలోకూడా కొనసాగిస్తున్నాడు. వీరికృషి ఇకపైకూడా ఇలాగే కొనసాగవలయునని ఆశిస్తూ.

పులిజాల శ్రీరామమూర్తి
మద్దాలి కృష్ణమూర్తి సోదరులు.

# సమాలోకనము

మాన్యులు శ్రీపవని, వేణుగోపాల్‌గారు నిత్య ఆధ్యాత్మిక సాహిత్య వ్యవసాయి. వయోవృద్ధులయ్యునువారి కలము బలమును వీడలేదు! నిత్యనూతనకృషిని నలుపుచునే యున్నది. "కలివర్తన దర్పణము" అనునది వారి క్రొంగొత్త సంచయగ్రంథము. ఇది యొక సూక్తికుసుమ గుచ్ఛము. ఇందుశ్రీనీలకంఠదీక్షితుల సంస్కృత కలివిడంబన శతకము, వైరాగ్యశతకము, శ్రీవేదాంత దీక్షితుల వైరాగ్యపంచకం, శ్రీ శంకర భగవత్పాదుల గుర్వష్టకం, సేకరించిన నీతిబోధశ్లోకావళి, నాస్తికవాదము లందలి శ్లోకములు అర్థతాత్పర్య సహితముగా వివరింపబడినవి. అవసరమగు చోట ప్రమాణములు, దృష్టాంతములుగూడ చూపబడినవి.

కాలచక్ర పరిభ్రమణంలో యుగయుగానికి ధర్మచ్యుతి సంభవిస్తూ కలియుగంలో పరాకాష్ఠస్థితిని చేరునని శాస్త్రపురాణాదులు తెలుపుచున్నవి. ఈ కలియుగ వర్తనమెట్లుండునో భాగవతమున ద్వాదశ స్కంధమందు పరీక్షిత్తునకు శుకయోగీంద్రుడు భవిష్యద్వాణిగా వివరించి యున్నాడు. కలియుగంలో జనులు ధర్మవిముఖులై, అన్యాయాసక్తులై, అరిషడ్వర్గ ప్రేరితులై, దురాచారం, అసత్యం, కపటం, దారిద్ర్యం, కామం, స్వార్థం అతిశయింపగా వినాశానికి గురియౌతారని తెలుపబడినది. అట్టి వినాశకస్థితి నుండి ప్రజలను రక్షించి ధర్మమార్గానువర్తులను జేయుటకై ఎందరో మహాత్ములు, జ్ఞానులు, కవిపండితులు నిరంతరం తమవంతుకృషి చేయుచున్నారు.

శ్రీ నీలకంఠ దీక్షితుల కలివిడంబనశతకము అట్టి నీతిబోధకము, అయితే ఇందు నీతిబోధ నర్మగర్భముగా చెప్పబడినది.

ఉదాహరణకు

**యదినక్వాపి విద్యాయాం సర్వదా క్రమతేమతి:**
**మాన్త్రికాస్తు భవిష్యామో యోగినోయతయో పివా !!(1)**

విద్యరాకపోయిన పరవాలేదు. బ్రతకడానికి చింతింపపనిలేదు. మాంత్రికులమో, యోగులమో,యతీశ్వరులమో అవుతాము.పూటగడవడంతో పాటు పూజలుకూడా లభి ాయి.

**కౌపీనం భసీతాలేపోదర్భారుద్రాక్షమాలికా !**
**మౌనమేకాసికా చేతి మూర్ఖ సంజీవనానిషట్ !! (2)**

కౌపీనధారణ, విభూతిలేపనం, ధర్భలు, రుద్రాక్ష మాలలు పట్టుకొని మౌనంగా ఒకచోట పద్మాసనాస్థితుడైయుండుట అను ఈ ఆరు ఉపాయాలు మూర్ఖునికి సుఖజీవనప్రదాన మార్గాలు: అని ఈనాడుజరుగుచున్న వాస్తవాలను ఎంత చక్కగా వివరించారో చూడండి.

అలాగే వైరాగ్య శతకంలో

**తేచోరాః కేపిశునాః కేరిపవః కేచదాయాదా ః !**
**జగదఖిలం తస్వవశేయస్వవశేహతమిదం చేతః !!**

తనపాడు మనస్సును నిగ్రహించుకొన్నవానికి ఈజగత్తంతా వశమౌతుంది. అట్టివానికి దొంగలెవరు? కలహకారకులెవరు !విరోధులెవరు? దాయాదులెవరు ? అనగా అతడు సర్వాతీతుడైవుంటాడని భావం.

ఇలాంటి రత్నాలవంటి శ్లోకాల నెన్నింటినో సేకరించి ప్రజాశ్రేయస్సుకై, జ్ఞానవికాసానికై అందించిన శ్రీవేణుగోపాల్‌గారు బహుధా అభినందనీయులు. ముఖ్యంగా ఈగ్రంథాన్ని నేటి విద్యార్థులచేత చదివించుట బహులాభకారికాగలదు.

ఇట్టిగ్రంథము సర్వజనామోదమును పొందగలదని ఆశించు.

తిరుపతి
8-12-98

బుధజనవిధేయుడు
**నైనారు అప్పాస్వామి**

**Annvaram Audiseshaiah**
**Audit Officer (Rtd.)**
**L.F.Accounts,**

# ముందస్తుగా ముకురంలో కలిని చూచుకొందాం... మనో దర్పణంలో మాలిన్యం తుడుచుకొందాం...

కలికాలం బాబూ అంటాం... కలికాలంలో ఉంటున్న మనం... మనం సహించలేని విషయాలు మనకెదురైతే అసలు విషయమేమిటంటే ఆ మరుక్షణమే ఆ అప్రియ విషయాలనే ఇతరులపై ప్రయోగించి ఇది తగిందేనని, ఇవి వారికి తగ్గవేనని ధర్మపన్నాలు చెపుతాం, వడివడిగా చేతులు చాపుతూ మన రంగుటద్దాలతో ఒకే వస్తువును మనకో రంగులో ఇతరులకో రంగులో విశ్లేషించి చూచే దృష్టే కలి దృష్టి. ముందుమూడు యుగాలనుంచి కలిని వెలివేసే విచిత్ర దృష్టి. దర్పణం ముందు నిలుచుకొని మలినం కనిపిస్తున్నా, ఎదుటి మనోదర్పణంలో మన మనోభావ వీచికలతో మాలిన్యం పులిమి మంచిని తుడిచి ఆ మసకలో మలినాన్ని మనోజ్ఞంగా తీర్చిదిద్ది మాయ మాయలో బడి ఆ మలిన రూపాన్ని సౌందర్య రాశిగా భావించి వెంటబడే వెర్రి చూపులవేటగాళ్ళం. మనం. చెప్పే దానికీ, చేసే దానికీ పొంతన లేని కార్యశీలులం, క్రింద పేరు వ్రాయందే మనకే తెలియని ఏకంగా పైన, చిత్రాలు చిత్రించే వింత కుంచెల సొంతదారులం. మనపంతలు మనమే సృష్టించుకొని చిత్రంగా విధిని, విధాతనూ లోకులను లోకాలనూ నిందించే షావుకారులం. పొట్ట కూటికై పలు వేషాలు ధరించే పగటి వేషగాండ్రం. ఆ విచిత్ర విషయాల అసలు రూపాలు తెలియని వెర్రి వెంగళాయిలం, మిడిసి మిడిసి ఎగసి పడే పుల్లి విస్తరాకులం. అరిషడ్వర్గాల

అదుపులోనున్న ఆప్తబంధువులం, సప్తవ్యసనాల కోరలలో చిక్కుకొన్న బాధాసర్పద్రష్టులం. లోపలనే ఉన్న క్షేత్రజ్ఞుడిని తెలియని క్షేత్రధారులం మనం; అజ్ఞాన పాత్రధారులం మనం. బాట తప్పిన బాటసారులం నిలుపుకోని బాసలు చేసే భాసించని బొమ్మలం. ప్రాణంలోని దివ్య చైతన్య శక్తిని పసిగట్టి బ్రహ్మానందం పొందలేని ప్రాణమున్న ప్రాణరహితులం; కళ్ళుండీ చూడలేని కబోదులం మనం, మన మనం మన మననం.

**"సాధారణ మానవుడు స్ఫటికంలాంటి వాడు**

**ప్రక్కరంగులకు లోబడి వ్యక్తిత్వం కోల్పోతాడు..."**

అంటాడో కవి... ఆయనే మరి ఈ వక్రాన్ని సవరించి, క్రమతను సాధించి లోకశోకాన్ని బాపే మార్గం ఏమిటని ఆలోచించి... వాల్మీకి తమసా నదీతీరంలో కరుణలొలుకు హృదయంతో కదిలిన పెదాలు కదిలించిన శ్లోకధార సాక్షాత్కరించగా... క్రాంతదర్శులైన ఋషులు, కవులై కావ్యాలు రచించిన ఋషులూ... లోకాన్ని సవరించే ఋజు మార్గాలన్నీ... సత్ప్రవర్తనాధురులైన కవుల కవితా ధారలు జీవులను పునీతులనుజేసి జీవనదులై ప్రవహించి చివరకు నారాయణుని ఆవాసమైన సాగరంలో సంగమింపజేస్తాయని వివరిస్తూ

**" కవిని మాత్రం రవితో పోల్చవచ్చు**

**సప్తవర్ణాలను తనలో జీర్ణించుకొని ఏకవర్ణం చిమ్ముతాడు"'**

అంటారు రవిగానని చోటులను గాంచిన ఎందరో మహానుభావులలో భక్తి రక్తి ముక్తి ప్రధాతలుగా త్రిమూర్తి సమన్వయ కర్తలుగా, సమభావ ప్రజ్వలన ఉక్తియుక్తులుగా చేతి వ్రేళ్లపై లెక్కకు మిగులుతారు. ఆ ఒకరిద్దరిలో ఒకరుగా మిగిలేవారు శ్రీ నీలకంఠ దీక్షితులవారు. ఆయన కలి విశ్వరూపాన్ని విస్తృతంగా కనులకు కట్టించి, ఆకలి వికృతాలకు విరుగుడైన వైరాగ్యమును కలిని కల్లనుంచి బయటపడవైచి, కృతయుగ దర్శనం గావించే, రానున్న కల్కిదేవర అశ్వవేగంలో కృపాణ కాఠిన్యంలో దాగిన కరుణ

- ప్రవిమలంగా ప్రకాశాయమానంగా ప్రసాదించేందుకు కలివిడమ్మున, వైరాగ్య శత సుమ కవితామాలికలను ద్వంద్వాలనుండి విముక్తులై సములై జీవుల, జీవన జ్యోతులు వెలుగొందటానికి అందించారు. అవి వాడని పూల మాలికలు. ఆ సుగంధం శతాబ్దాలు గడిచినా కాల గర్భంలో కలసిపోలేదు.

చిన్మయ విషయాలకు పునరుక్తి దోషం లేదు. అందుకే ఎందరో ఆ ఆధ్యాత్మిక కస్తూరి గుళికలకు వివరణలు తమ తమ అనుభవాలతో రంగరించి, మారుతున్న కాలానికి, కాల పరిస్థితులకి, జీవన విధానానికి అనుగుణంగా మలచి అందిస్తున్నారు. ఉడుతా ఉడుతా భక్తి. దర్శనమాత్రాననే వైరాగ్య లబ్ధినిడి లౌకికాలౌకిక చిదానందాన్ని గూర్చే సేతువును నిర్మించటంలో పాల్గొన్న వానరులు, ఉడుతలు, ఎలుగుబంట్లు వగైరా ఎలుగెత్తిచెప్పే సత్యం భగవంతుని దృష్టిలో అందరూ సమమేనని. ధర్మాన్ని కవితా జ్యోతులుగా మలచి సాటి జనానికందించే సత్కవుల, వ్యాఖ్యాతల రచనలన్నీ ధర్మసేతువులే అలాంటి సేతువు నిర్మాణ భాగస్వామ్యమే ఇప్పుడు మన కరకమలాలలో ఉన్న "కలివర్తన దర్పణము" అన్న వ్యాఖ్యాన గ్రంథం.

శ్రీ పవనివేణుగోపాలుగారు. ఆధ్యాత్మిక సాహితీ లోకానికి పరిచిత పూర్వులు. శ్రీకాళహస్తిలో జననం, సాలెపురుగు అల్లిక జిగిబిగిని సాధించాడు తన రచనలలో, పన్నగ భక్తిని సంతరించుకొన్నాడు, దేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్పంచుకొన్న ఈధీరుడు, గజరాజు వ్యక్తిత్వాన్ని ఔన్నత్యాన్నీ తన గుణ సంపదలో రంగరించుకొని, చతురుడు సౌశీల్యుడూ అయ్యాడు. ఈయన ఈశావాస్యోపనిషత్,ఆధ్యాత్మరామాయణం, లలితా సహస్ర నామ వ్యాఖ్యాది గ్రంథాలు వ్రాసాడు. పాఠకులు మెచ్చారు. అలా ఈ పవని వంశోద్భవుని జీవనం పావనమయింది. వారి అర్ధాంగి శ్రీమతి సుబ్బరత్నమ్మ, కుమార్తె శ్రీమతి ఎ.యస్. జ్ఞాన ప్రసూనాంబ కూడా ఆధ్యాత్మిక కుసుమాలను పెంచి పోషించిన వారే. వారి శ్రీమతి హృదయం

రామమందిరం. ఆపదుద్ధారక స్తోత్రాంతరంగం. సౌందర్యలహరి శ్రీమతి ప్రసన్న హృదయవీణాఝరి. నిజానికి వారిల్లో ఆధ్యాత్మిక పూదోట.

ఎనభైయ్యో ఏట ఆయన వెలువరిస్తున్న ఈ గ్రంథం వారికి భగవంతునిపైన ఆయన సృష్టిపైన, ఆ సృష్టిలోని చరాచర జీవరాసులపైన గల అపారమైన ప్రేమకు మణిదర్పణం. నీలకంఠ దీక్షితుల, వేణుగోపాలుల సంగమమైన ఈ 'కలివర్తన దర్పణం" హరిహరతత్త్వ ప్రదీపిక, , సమతత్త్వ కరదీపిక. ఆ వెలుగులో వేదాంత దేశికులు, మరియు ఎందరో భక్త కవులు కదలాడ్డటం మరింత కమనీయం.

పాఠకులు ఈ గ్రంథాన్ని చదివి,

**శ్లో॥ "స్తోతవ్యైః స్తూయతే నిత్యం, సేవనీయైశ్చ సేవ్యతే**
**నబిభేతి నజిహ్రేతి తథాపి ధనికో జనం"** - అన్న అంధకార స్థితినుండి బయలువెడలి,

**శ్లో॥ "క్షోణీకోణ శతాంశ పాలన కలాదుర్వార గర్వానల**
**క్షుభ్యక్షుద్ర నరేంద్ర చాటురచనా ధన్యాన్న మన్యామహే।**
**దేవం సేవితు మేవనిశ్చిమ మహేయోఽ సాదమాలు: పురా**
**ధానా ముష్టిముచే కుచేల మునయే దత్తేస్మ విత్తే శతామ్॥**
అన్న స్థితిని పొందెదరు గాక!

**సర్వేజనాః సుఖినోభవంతు...**

సర్వజన సుఖముగోరు రచనలు మన మనో దర్పణములో కలిపాపహరములై కదలుగాక!

**తిరుపతి,**
**18-2-1999.**

**అన్నవరం ఆదిశేషయ్య**

# నివేదన

**సముద్రాల లక్ష్మణయ్య**
కార్యదర్శి, ధర్మప్రచార పరిషత్
తి.తి.దే. – తిరుపతి

అపారే కావ్యసంసారే
కవి రేకః ప్రజాపతిః
యథ్యాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే॥

కావ్య సంసారం అనంతమైనది. దీనికి సృష్టికర్త కవి ఒక్కడే. అతని భావనా వీధిలో ఈ విశ్వం ఏరూపంతో నైనా భాసించగలదు అని కావ్య మర్మజ్ఞులు పేర్కొన్నారు.

క్రాన్తదర్శి అయినకవి సృష్టికి ప్రతిసృష్టి చేస్తాడు. అతని నిర్మాణం నవరసరుచిరం. అది అజరామరం.

విశ్వసాహిత్య జగత్తులో సంస్కృత సాహిత్యం నిరుపమానమైనదిగా గణుతి కెక్కింది. వైదికమనీ, లౌకికమనీ ఇరుతెగలుగా రూపొందిన ఈ సాహిత్యం కాలక్రమంలో అనంతశాఖోపశాఖలుగా విస్తరిల్లింది. ఉపనిషత్కవుల ఊహలొకవైపు, వాల్మీకి వ్యాస భాసకాళిదాసాదుల రచనలు మరొకవైపు సహృదయుల హృదయాలను ఆనందడోలికలలో ఉఱ్ఱూత లూగించాయి. "పదియారేండ్ల వయస్సు గూర్పదె సుకావ్యస్పర్శ జేజెమ్మకున్" అన్న కవీంద్రుని మాటను సార్థకం చేస్తూ ప్రాచీన సంస్కృత కావ్యాలు నేటికీ భావుకుల భావాలను రసరంజితాలు కావిస్తున్నాయి.

అయితే "చక్రార పంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః" అన్నట్లు కాలగతిలో అమరవాణికి కూడా భాగ్యరేఖ వక్రించక తప్పలేదు. ఆ దుఃస్థితి ఎంతవరకూ వచ్చిందంటే, "అది మృతభాష" అన్న నిందకు గురి అయ్యేటంత వరకూ కొనసాగింది.

సురభారతి ఏనాటికైనా అమరవాణియే కాని మృతవాణి కాజాలదు. దాని అమరత్వానికి కారణభూతులైన కవిపుంగవులలో పదునేడవ శతాబ్దికి చెందిన నీలకంఠ దీక్షితుడొకడు. మహోన్నత ప్రతిభాశాలిగా పేరొందిన ఈ కవిచంద్రుడు జగద్విదిత చరిత్రుడైన అప్పయ్యదీక్షితుడవతరించిన కుటుంబంలోనే జన్మించాడు.

నీలకంఠ దీక్షితుడు రచించిన 'శివలీలార్ణవ' మనే 22 సర్గల మహాకావ్యం సుప్రసిద్ధం. ఇందులో శివలీలలు విస్తృతంగా వర్ణింపబడ్డాయి. 'నీలకంఠ విజయ'మనే ఇతని చంపూ ప్రబంధం కూడా విద్వాంసుల వినుతికి పాత్రమైంది. ఇతనిది ప్రసన్నమైన శైలి. రసవంతములైన అలతి అలతి పదాలతో గంభీరములైన భావాలను వ్యక్తం చేయడంలో అందెవేసిన చేయిగా నీలకంఠ దీక్షితుడు గణనకెక్కాడు.

ఇతడు రచించిన కలవిడంబన – సభారంజన – అన్యాపదేశ శతకాది లఘు కృతులుకూడా అలఘు రచనలుగా పేరొందాయి. లోకానికి నీతిని బోధించడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని కవి ఈ కృతులు చేసినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. కావ్యానికి ఎన్నో ప్రయోజనాలుంటాయి. అందులో కాన్తాసమ్మితంగా లోకానికి హితోపదేశం కావించడం అతిముఖ్యమైన ప్రయోజనం. ఈ పనిలో దీక్షితుడు మహావిజయం సాధించి కృతకృత్యుడయ్యాడు.

దీక్షితకవి రచించిన 'కలివిడంబన – వైరాగ్య శతకాలు, భర్తృహరి వైరాగ్యశతకం' – ఇత్యాదిగా కొన్ని లఘుకృతులు 'కలివర్తన దర్పణ' మన్న పేరుతో ఈ సంపుటిలో సవ్యాఖ్యానంగా ప్రకటించబడ్డాయి.

కలివిడంబన శతకంలో కవిలోక వ్యవహారాన్ని, కలికాలంలో మనుజుల ప్రవృత్తినీ, అతి మనోహరంగా చిత్రించాడు. వైద్యులు, జ్యోతిషికులు, కవులు మొదలైన వారు స్వార్థంతో లోకాన్ని వంచించి ఎలా పబ్బం గడుపుకొంటున్నారో సచమత్కారంగా నిరూపించాడు. ఈ కవి మాటలు శ్రోతలకు నవ్వు పుట్టిస్తాయి. పాఠకుల మనస్సులను రంజింప జేస్తాయి. దుష్కృత్యాలకు అలవాటుపడిన వారిలో ఆత్మవిమర్శకు అవకాశమిస్తాయి. తద్ద్వారా వారు తమ ప్రవృత్తి మార్చుకోగల్గితే కలిప్రభావంనుండి తప్పించుకోవచ్చు. ధూర్తుల వంచనలకు గురి అయ్యే

సామాన్య జనులలో వివేకాన్ని రేకెత్తించే ఈ కవి సూక్తులు సకల జనావళికీ శిరోధార్యాలు.

ఉదాహరణకు ఈ క్రింది శ్లోకం చూడండి –

నిర్ధనానాం ధనావాప్తం! ధని నా మధికం ధనమ్।
బ్రువాణాః సర్వధాగ్రాహ్యా! లోకైర్జ్యో తిషికా జనాః॥ (18)

జ్యోతిషికులు డబ్బులేనివారి దగ్గరకు పోయి "నీకు డబ్బు వస్తుంది" అని చెబుతారు. ధనికుని చెంతకు వెళ్ళి నీవు కోటికి పడగెత్తుతావు అని ప్రలోభం కల్గిస్తారు. ఇలా చెప్పే వంచక శిరోమణులనే లోకులు ఆదరిస్తూ వుంటారు. ఇది కలి ప్రభావం కాక మరేమి?

ఇక వైద్యుల వ్యవహారం ఎలావుంటుందో కవివరాటల్లోనే గమనించండి.

భైషజ్యంతు యధాకామం । పథ్యంతు కఠినం వదేత్।
ఆరోగ్యం వైద్య మాహాత్మ్యాత్ । అన్యధాత్వమ పథ్యతః ॥ (25)

రోగానికి ఏమందు ఇచ్చినా పథ్యం మాత్రం కఠినంగా పెట్టు. రోగం కుదిరితే నీ మహిమ కుదరక పోతే పథ్యం పాటించలేదని రోగిని దబాయించు. కలివిడంబన మంటే ఇదే.

ఇందులో 'కలి' ప్రస్తావన వచ్చింది. కాబట్టి యుగ స్వరూపాన్ని బట్టి నాల్గు మాటలు చెప్పడం ఇక్కడ అసంగతం కాదు. యుగమనేది మన ప్రవర్తన పైననే ఆధారపడి వుంటుంది. మనలోని సత్ప్రవృత్తి కృతయుగానికీ, దుష్ప్రవృత్తి కలియుగానికీ నిదర్శనాలు. అందుకే రాజా కాలస్యకారణం' అని పెద్దలన్నారు. కాలానికి కారణం రాజే కాని, రాజుకు కారణం కాలం కాదు. ఇప్పుడు రాజులు లేవు. ప్రజలే రాజులైన ప్రజారాజ్య కాలమిది. అంచేత ప్రజల మనస్తత్వం బాగుంటే కృతయుగమనీ, చెడిపోతే కలియుగమనీ భావించాలి. 'కలి కలి' అని జపిస్తూ అవినీతికి అందలం పట్టి బుద్ధిపూర్వకంగా కాలుష్యవ్యాప్తికి దోహదం కల్గించే దుఃస్థితి తగదు. ఇది మంచి లక్షణం కాదు.

ముఖ్యంగా హిందూ సమాజంలో ఈజాడ్యం ఏమాత్రం చికిత్స చేయడానికి వీలుగాని విధంగా వ్యాపించింది. ఈ దుర్గతినే నీలకంఠ

దీక్షితుడు తనరచనల్లో ఎత్తిచూపాడు. శ్రీ వ్యాసాశ్రమస్థాపకులైన శ్రీమలయాళ స్వాములవారు 'మలయాళ యతీంద్ర గీత' మొదలైన తమ గ్రంథాలలో యుగస్వరూప నిరూపణం చాలా చక్కగా చేసివున్నారు.

ఈ సంపుటంలోనే చేర్చబడిన నీలకంఠ దీక్షితుని వైరాగ్య శతకాన్ని పఠిస్తే భర్తృహరి వైరాగ్య శతకం లాగా అది విషయ విరక్తి కల్గించి సంసార సాగరం నుండి తరించే ఉపాయం బోధిస్తుంది.

ఈ సంస్కృత రచనలకు చక్కనైన వివరణ వ్రాసి ప్రకటించిన శ్రీపవని వేణుగోపాల్ గారిని గురించి రెండు మాటలు, వీరు స్వాతంత్ర్య సమర యోధులు, తత్త్వజిజ్ఞాసాపరులు, నిరంతర వాఙ్మయ పరిశ్రమ కావిస్తూ ఇటీవల చాలా గ్రంథాలు రచించి ప్రకటించారు. వీరేకాదు. వీరి కుటుంబంలోని వారంతా వాఙ్మయసేవకు అంకితమైన వారే. ఎక్కడ మంచి ఉన్నా గ్రహించే స్వభావం శ్రీ వేణుగోపాల్ గారికి వెన్నతో బెట్టిన విద్య.

వారు తమ చిత్తవృత్తికి తగినరీతిలో నీలకంఠ దీక్షితుని రచనలు స్వీకరించి, ఎంతో శ్రమించి వాటికి నాతి విస్తరంగా తెలుగులో వివరణ వ్రాసి ప్రకటించడం ముదావహం.

మూలంలోని సంస్కృతవచనాలకు దీటైన మాటలతోనే తెలుగులో వివరణ కొనసాగింది.

ఈ కాలంలో సంస్కృత రచనలు చదివేవారు అరుదైపోయారు. అయినా శ్రీ వేణుగోపాల్‌గారు దీక్షితుని రచనల్లో కల అందచందాలను గమనించి అందలి స్వారస్యాన్ని పదిమందికీ అందజేయాలన్న పట్టుదలతో ఈ రచన కావించి కృతార్థులయ్యారు.

ఇక ఈ కృతిని చదివి కృతార్థులు కావలసిన బాధ్యత పాఠకులపై ఉన్నది.

**–సముద్రాల లక్ష్మణయ్య**
తిరుపతి, 20-3-1999.